అపరాధ పరిశోధన అనుబంధం—117

# కొడిగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## స్కెలిటన్ గ్రూప్

రచన: వసుంధర

## పడగ విప్పిన తాచుపాము

రచన: బొమ్మిడి అచ్చారావు

## బందిపోటు నాయకుడు

రచన: బొమ్మిడి అచ్చారావు 2nd Part

## మరపురాని మగువ

రచన: టెంపోరావ్

## వైరివాడి తెలివి

రచన: బి. రాజేశ్వరి

అపరాధ పరిశోధన సప్లిమెంట్—117
సెప్టెంబర్, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# స్కెలిటన్ గ్రూప్

వసుంధర

"ఇవెక్కడి ఎండలు బాబూ?" అన్నాడు గోపాలం.

చాలా కాలం తర్వాత అతను వేసవిలో కాకినాడ వచ్చాడు. అతడు ఉద్యోగరీత్యా ఉత్తరహిందూస్థానంలో వుంటున్నాడు. అతడుండే ప్రాంతంలో ఎండలు మరీ అతి తక్కువ కాకపోయినా — ఇలా వళ్ళంతా జిగురు జిగురుగా అయిపోయేలా చెమటలు పట్టవని అతడు శేఖరంతో అన్నాడు.

శేఖరం ఆరోగ్యంపాడై ప్రాణంమీదకు వచ్చింది. అతడు చచ్చిపోతాడనే అంతా అనుకున్నారు. గోపాలం అతడి ప్రాణస్నేహితుడు. గోపాలాన్ని ఓసారి చూడాలని వున్నదని శేఖరం కబురు పంపించాడు. గోపాలం వున్నవాడున్నట్లు వచ్చి కాకినాడ వాలాడు. అయితే అప్పటికి శేఖరం గండం గడిచి బయటపడ్డాడు.

శేఖరానికీ, గోపాలానికీ మధ్య మరో బంధమేర్పడనున్నది. శేఖరం చెల్లెలు దుర్గ గోపాలాన్ని ఆకర్షించింది.

తన ఆకర్షణకు ప్రేమ అని పేరు పెట్టడమేకాక స్నేహితుడికి చెప్పుతున్నాడు గోపాలం.

ఈ ప్రేమను శేఖరం ఆమోదించడంకంటె — ఆ అదృష్టానికి ఆనందపడ్డాడనడం సబబు. ఎందుకంటే గోపాలం రెండు చేతులా సంపాదిస్తున్నాడు. అయిన వాళ్ళెంకెవ్వరూ లేరు.

మిత్రుడు మృత్యుగండం నుంచి తప్పించుకోగానే గోపాలం మనసు దుర్గమీదకు లాగింది. అతడామెతో మాట్లాడడంకోసం తహతహలాడుతున్నాడు. అయితే ఆమె అతడికి ఏకాంతంలో దొరకడంలేదు. ఒకేఒక్కసారి కొరికింది. అప్పుడతదేదో అనబోయేలోగా దుర్గ— "అబ్బ—చెమట వాసన—" అని ముఖంలో అదోరకం భావం వ్యక్తంచేసింది.

ఆమె ఆ మాట అన్నప్పుడు ఇద్దరికీమధ్య మూడు గజాల దూరం ఉన్నది. నిజానికి చెమట వాసన దుర్గ ఒంటినుంచి కూడా వస్తున్నది. అందువల్ల గోపాలం కాస్త ఫీలయ్యాడు. అప్పుడే అన్నాడు—"ఇవెక్కడి ఎండలు బాబూ?" అని.

అలాగనడంలో అతడి ఉద్దేశ్యం తనవద్దనుంచి వచ్చే చెమట వాసనకు వాతావరణమేకానీ తన అపరిశుభ్రత కాదని ఆమెకు తెలియజెప్పడమూ—ఆ ఎండలు తననూ, ఆమెనూ ఒకేవిధంగా బాధిస్తున్నాయని సూచించిడమూ!

అందుకు దుర్గ ఏమీ అనలేదు. అదోలా నవ్వి అతణ్ణి తప్పించుకుని వెళ్ళిపోయింది. వచ్చిన ఓ మంచి అవకాశం ఇలా పోవడంతో గోపాలం హతాశుడయ్యాడు.

అతడు మొత్తం వారం రోజులు సెలవు పెట్టాడు. అందులో రెండు రోజులు ప్రయాణానికి పోయాయి.

మరో రెండు రోజులు ప్రయాణానికి పోతాయి. అనగా మూడు రోజులు మిగిలాయి. వాటిలో రెండవ రోజు నడుస్తున్నదిప్పుడు.

శేఖరం అనారోగ్యం పేరు చెప్పి ఇంటిలో చాలా మంది శేఖరం బంధువులు చేరారు. ఒక్కొక్కరే వెళ్ళి పోతున్నప్పటికీ మిగిలినవారి సంఖ్య గోపాలానికి ఇబ్బంది కలిగించేదిగానే వున్నది.

గోపాలం ఆ సాయంత్రం శుభ్రంగా స్నానం చేశాడు. అదృష్టవశాత్తూ వున్నట్లుండి గాలివీచడం ప్రారంభ మయింది.

అతడు మళ్ళీ దుర్గను అన్వేషించి పట్టుకున్నాడు. ఆమె అతణ్ని చూసి ఇబ్బందిగా నవ్వింది.

"ఇప్పుడు నావద్ద చెమటవాసన లేదు—" అన్నా డతను.

"కానీ నావద్ద వున్నది—" అంటూ ఆమె అక్క ణ్నించి వెళ్ళిపోయింది. గోపాలం ఆమె దారికి అడ్డంగా నిలబడ్డాడు.

ఆమె కదలకుండా అలాగే నిలబడిపోయింది.

"నేను నీతో మాట్లాడాలి—" అన్నాడు గోపాలం.

దుర్గ మాట్లాడలేదు.

"నీకు నేనంటే ఇష్టముందో లేదో చెప్పాలి—"

అప్పుడు దుర్గ సిగ్గుపడింది.

"ఇష్టమే కదూ—" అన్నాడు గోపాలం.

"ఊఁ" అన్నది దుర్గ.

"నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అన్నాడు గోపాలం.

"ఛీ—" అన్నది దుర్గ.

"ఛీ అనొద్దు—ఇష్టమో కాదో చెప్పు—" అన్నాడు గోపాలం.

"నేను చెప్పను—" అన్నది దుర్గ.

"ఎందుకని?"

"నాకిష్టంలేదు—"

గోపాలం ఉలిక్కిపడి—"నన్ను పెళ్ళిచేసుకోవడం నీకిష్టంలేదూ?" అన్నాడు.

"అది చెప్పడం నాకిష్టంలేదు—" అని తుర్రున పారిపోయింది దుర్గ.

గోపాలం తెల్లబోయాడు. అయితే తనకు కాస్త దూరంలో ఓ వ్యక్తి తనను గమనిస్తూన్న విషయం అతడికి తెలియదు.

## 2

"దుర్గా!" అన్నాడతను కాస్త కోపంగా.

"ఏం బావా—అంత కోపంగా వున్నావు—" అంది దుర్గ.

"కోపమంటే కోపమే మరి—వాడికి నీతో అంత చనువేమిటి?"

"వాడంటే—"

"వాడే—ఆ గోపాలంగాడు...."

"గోపాలమా?" అంది దుర్గ — "నా అన్నయ్య అతడికే నన్ను ఇచ్చి పెళ్ళిచేయాలనుకుంటున్నాడు...."

"నీ అన్నయ్య అనుకుంటే నీకిష్టమేనా?"

దుర్గ తమాషాగా నవ్వి ఊరుకుంది.

"అలా నవ్వడంకాదు. నువ్వు నన్ను చేసుకుంటావో-వాణ్ని చేసుకుంటావో ఈ క్షణమే తేలిపోవాలి—" అన్నాడతను.

"అన్నయ్య కట్నమివ్వడు. నేను అన్న మాట కాదన లేను. మీ నాన్నకు కట్నం కావాలి. నువ్వు తండ్రిమాట కాదనలేవు. మన పెళ్ళి ఎలా జరుగుతుంది?"

"ఎలాగో జరుగుతుంది! ముందు నేనంటే నీకిష్టమో కాదో చెప్పు—"

"ఆ మాట పెళ్ళయ్యాక చెబుతాను—" అని దుర్గ అక్కణ్నించి వెళ్ళిపోయింది. ఆమె వెంట నడువబోయిన ఆమె బావ వెనుకనుంచి తన భుజంమీద ఎవరిదో చేయి పడటంతో వెంటనే ఆగి వెనక్కు తిరిగాడు.

శేఖరం నవ్వుతూ—"దుర్గ నా చెల్లెలు—" అన్నాడు.

అతను—"నాకు తెలుసు—" అన్నాడు.

"నేను నిన్ను ద్వేషిస్తున్నాను-" అన్నాడు శేఖరం.

"నాకు తెలుసు—" అన్నాడతను.

"నీకు తెలియని దొకటుంది—" అన్నాడు శేఖరం.

"ఏమిటది?"

"అది నాకూ తెలియదు—" అని వెళ్ళిపోయాడు శేఖరం.

దుర్గ బావ అక్కడే నిలబడిపోయి శేఖరం మాటల్లోని అంతర్యం ఆలోచిస్తున్నాడు.

తను దుర్గ విషయంలో అదుపు దాటితే తనేంచేస్తాడో తనకే తెలియదని శేఖరం తన్ను హెచ్చరించాడా?

## 3

"నడివీధిలో పడకలేమిట్రా?" అన్నాడు శేఖరం.

"నీకైతే ఇంట్లో పడుకోవడం ఎలాగూ తప్పదు. నాకేం కర్మ—నిన్న రాత్రి వుక్కపోయాను. ఈ రోజు ఏమైనా సరే వీధిలో పడుకోవలసిందే—" అన్నాడు గోపాలం.

"ఇంకెవరైనా వీధిలో పడుకుంటున్నారా?" అన్నాడు శేఖరం.

"సత్యంగారు పడుకుంటారట—" అన్నాడు గోపాలం.

"వాడా! సరే.... వాడికి నువ్వంటే ఏమాత్రంపడదు- ఆ సంగతి నీకు తెలుసా?" అన్నాడు శేఖరం.

"ఏం—?" అన్నాడు గోపాలం ఆశ్చర్యంగా.

"వాడు దుర్గను ప్రేమిస్తున్నాడు...." అన్నాడు శేఖరం.

"ఓహో! ఆయన దుర్గ బావ కదూ—నాకీ విషయమే స్ఫురించలేదు—"

"దుర్గకే కాదు. నాకూ బావే వాడు—" అన్నాడు శేఖరం.

"అవునవును—" అన్నాడు గోపాలం.

"కానీ వాడంటే నాకు అసహ్యం—"

"ఏం?"

"వాడికి దుర్గ కావాలి. కానీ దుర్గకోసం ఏమీ వదులుకోలేడు—"

"అంటే?"

"వాడి నాన్నకు కట్నం కావాలి. నేను కట్న మివ్వనని చెప్పేశాను. కట్నం ఎగేయిడంకోసం సత్యాన్ని ఎరవేసి పట్టానని వాళ్ళ నాన్న అన్నాడు. నా చెల్లెలు తళుకు బెళుకులతో వాణ్ణి వశపర్చుకోవాలనుకుందిట. ఆయనలాగన్నప్పుడు వాడేమీ మాట్లాడలేదు. ముంగిలా కూర్చున్నాడు. మీ నాన్న మాటల్ని ఖండించరా అని నిలదీశాను. అయినా ఏమీ అనలేదు—"

"పాపం—తండ్రి చాటు బిడ్డ కాబోలు-" అన్నాడు

గోపాలం.

"అలాంటి వాళ్ళనుంచే ఆడవాళ్ళకు ప్రమాదం—" అన్నాడు శేఖరం.

"మంచి విషయం చెప్పావు. రాత్రి నేను సత్యాన్ని ఆటపట్టిస్తాను. అతిడి గురించి ఏమీ ఎరుగనివాడిలా నటిస్తూ అతడిలాంటి మగాళ్ళని దుమ్మెత్తిపోస్తాను—"

"అలా ఉత్సాహపడకు. వాడు చాలా ప్రమాదకరమైన మనిషి. నాకు బాగా తెలుసు. వాణ్ని ఆవేశపెడితే ఆ ఆవేశంలో ఏమైనా చేస్తాడు...." అన్నాడు శేఖరం.

"ఆవేశపరులను ఆపడం నాకు తెలుసు—" అన్నాడు గోపాలం.

## 4

గోపాలం మడత మంచం తీసుకు వెళ్ళేందుకు గదిలోకి వెడితే అక్కడ దుర్గ వుంది. ఆమె అతణ్ని చూస్తూ—"మీరు వీధిలో పడుకోవద్దు—" అంది.

"ఏం?" అన్నాడు గోపాలం.

"వీధిలో సత్యం బావకూడా పడుకుంటున్నాడు—". అన్నదామె.

"పడుకుంటే నాకేం?"

"వాడికి మీరంటే కోపం—"

"ఎందుకని?"

"ఎందుకో అందుకు—నా మాట విని మీరీ గదిలో నే పడుకోండి. మీ కోసం ఓ ఫ్యాను కూడా ఏర్పాటు చేస్తాను" అంది దుర్గ.

"చెమట వాసన.... భరించలేను...." అన్నాడు గోపాలం.

"చాలా తెలివిగా మాట్లాడుతున్నారులెండి. మీరు

లోపల పడుకు నేమాటైతే....” అంది దుర్గ.

“అయితే?”

“రాత్రి నేను మీతో కాసేపు మాట్లాడతాను....”

గోపాలం తనువు పులకించినట్లయింది. ఈమె తనను ఆశ పెడుతోంది. ఎందుకు? సత్యం నిజంగా ప్రమాదకర మైన మనిషా? లేక రాత్రి ఆమె నిజంగా తనతో మాట్లా డాలనుకుంటున్నదా?

అతడి ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. ఆమె అతడితో ఏదో చెప్పాలని అనుకుంటున్నది. అది సూటిగా చెప్పలేక ఇలా సత్యం గురించి చెబుతున్నది.

“థాంక్స్!” అన్నాడు గోపాలం.

“రాత్రి ఇంట్లో పడుకుంటే నేనే మీకు థాంక్స్ చెబుతాను—” అంది దుర్గ.

“చూడండి—” అన్నాడు గోపాలం—“ఈ ఎండలు అలవాటు తప్పి కొన్నేళ్ళయింది. ఈ ఉక్క నేను భరించలేకపోతున్నాను. మీతో మాట్లాడ్డంకోసం నేనీ గదిలో పడుకోగలను. కానీ మీరు లేకుండా ఒక్క క్షణం కూడా ఇక్కడి ఉక్క భరించలేను. ఫ్యాన్ వున్నా భరించలేని వేడి ఇది. మీరు రాత్రి ఎన్నింటికి నాతో మాట్లాడతారో చెప్పండి. సరిగ్గా అన్నింటికి నా పక్క లోపలకు మారుస్తాను—”

ఏమనుకున్నదో—“రాత్రి ఒంటి గంటకు—” అంది దుర్గ.

గోపాలం మంచం తీసుకుని వీధిలో వేసుకున్నాడు. సత్యం అప్పటికే అక్కడ పడుకుని వున్నాడు. వీధి తలుపు తాళంవేసి చెవి తన జేబులో వుంచుకున్నాడు గోపాలం.

సత్యం కదలడంలేదు.

"బాగా నిద్రపట్టి వుండాలి—" అనుకున్నాడు గోపాలం. అతను తనూ పక్కమీద వాలాడు.

పెద్దగా గాలివేయడంలేదు. వీధిలో కూడా అంత బాగోలేదు. ఎటొచ్చీ లోపల పట్టినట్లుగా చెమటలు లేవు.

గోపాలానికి సత్యాన్ని లేపి ఏమైనా అనాలని వున్నది. అందుకు రెండు కారణాలున్నవి. తను ప్రేమించిన దుర్గను అతడూ ప్రేమించడం ఒకటి. దుర్గను అతడు అవమానించడం రెండవది.

"సత్యంగారూ!" అన్నాడు గోపాలం నెమ్మదిగా.

సత్యం ఉలకలేదు. పలకలేదు.

గోపాలానికి అతణ్ని తట్టి లేపాలని అనిపించింది. అతికష్టంమీద అతడా కోరికను నిగ్రహించుకున్నాడు.

అతడు తన చేతికి వున్న ఎలక్ట్రానిక్ వాచ్‌లోని అలారం సరిగ్గా ఒంటిగంటకు మ్రోగేలా ఏర్పాటు చేసుకున్నాడు. అతడి ఆలోచనలు సత్యాన్ని వదిలి దుర్గ చుట్టూ తిరగసాగాయి.

దుర్గ తనతో ఏం మాట్లాడుతుంది?

రాత్రి ఒంటిగంటకు తనకు ఎటువంటి అనుభవం రాసి పెట్టి వుంది?

మనసు కలలు కనమని ప్రోత్సహిస్తున్నదో ఏమో అతడికి త్వరగా నిద్రపట్టింది. అతడలా ఎంతసేపు నిద్రపోయాడో ఏమోకానీ ఓ రాత్రివేళ ఎవరో అతణ్ని తట్టి లేపారు. ఉలిక్కిపడి కళ్ళు నులుముకుని అతడు ముందు తన్ను తట్టిలేపిన మనిషిని చూశాడు.

"మీ జేబులో తాళంచెవి ఓసారిలా ఇవ్వండి—"

అన్నాడు సత్యం.

గోపాలానికి కళ్ళు మూతలు పడుతున్నాయి. చాలా మత్తుగా వున్నదతడికి.

తాళంచెవి ఇస్తూ టైము చూసుకున్నాడు. పదకొండున్నర అంది.

తను దుర్గను కలుసుకోవడానికి చాలా టైమున్నది.

“తాళం చెవి మీ తలగడక్రింద వుంచుతాను—” అన్నాడు సత్యం.

“ఊఁ” అన్నాడు గోపాలం. అతడింకేమీ వివరాలడగలేదు. నిద్రమత్తు ప్రభావం అటువంటిది.

సత్యం ముందు లోపలకు వెళ్ళాడు. ఓ పదినిమిషాలుండి ఒక్కడూ మళ్ళీ బయటకు వచ్చాడు. ఈసారి అతడు మడతమంచం లోపలకు తీసుకుని వెళ్ళాడు. మళ్ళీ బయటకు వచ్చి తాళంచెవిని గోపాలం తలగడక్రింద వుంచాడు.

అప్పుడు సత్యం ఒక్క క్షణం ఆగాడు. గోపాలాన్ని పరీక్షగా చూశాడు. అతడు మంచి నిద్రలో ఉన్నట్లు తెలుస్తున్నది. కానీ....

“ఎందుకైనా మంచిది....” అనుకున్నాడు సత్యం. అతడి జేబులోంచి చిన్న సీసా బయటకు తీశాడు. దాని మూత తీశాడు.

సీసాను గోపాలం ముఖంమీదకు వుంచి రెండుసార్లు మెత్తగా నొక్కాడు. తుస్సుమని చప్పుడయింది.

ఇప్పుడు గోపాలం గాఢనిద్ర పోతున్నవాడిలాకాక చచ్చినవాడిలా పడున్నాడు. సత్యం తృప్తిగా నిట్టూర్చి లోపలకు వెళ్ళిపోయాడు.

# 5

ఇన్‌స్పెక్టర్ భానోజీరావు కుర్చీలో కూర్చుని—
"మా పనులన్నీ అయ్యాయి. ఇంక మీరు మా ప్రశ్నలకు జవాబు చెప్పవలసి వున్నది—" అన్నాడు.

అక్కడ శేఖరం, సత్యం, దుర్గకాక పదిమంది వున్నారు. భానోజీరావు ముందా పదిమందినీ కొన్ని ప్రశ్నలు వేసి పంపించేశాడు. వాళ్ళనుంచి అతడికి తగిన సమాచారమేదీ లభించలేదు.

మిగిలిన ముగ్గురిలోనూ భానోజీరావు దుర్గను ముందు ప్రశ్నించాడు. దుర్గ కాసేపు ఏమీ మాట్లాడలేదు.

"మీరలా మౌనం వహిస్తే ఏమీ లాభంలేదు. ఒకోసారి మీరు మామూలు సమాచారం అనుకున్నది మాకెంతో ప్రయోజనకారి కావచ్చు...." అన్నాడు భానోజీరావు.

"అడగండి—" అంది దుర్గ.

"గోపాలం గురించి మీకు తెలిసినదంతా చెప్పాలి-"

"అతడు నన్ను ప్రేమించాడు. పెళ్ళిచేసుకుంటానన్నాడు. విషయం అన్నయ్యతో చెప్పాడు. అన్నయ్య అంగీకరించాడు—"

"మీ సంగతేమిటి?"

"చిన్నప్పట్నించీ నాకు నా బావంటే ఇష్టం—బావకూ నేనంటే ప్రేమ. బావకు నన్ను పెళ్ళిచేసుకోవాలని వుంది. కానీ తండ్రి కట్నం కావాలంటే కాదనలేకపోతున్నాడు. అందుకని అన్నయ్యకు అతడంటే ద్వేషం—"

"అంటే మీ అన్నయ్య కట్నమిచ్చి బావతో పెళ్ళి జరిపించాలని మీరు కోరుకుంటున్నారా?" అన్నాడు

భానోజీరావు.

"ఊఁ" అన్నది దుర్గ.

"ఒకవేళ మీ అన్నయ్య గోపాలంతో పెళ్ళి జరిపి వే సంతోషించి వుండేవారా?"

"చెప్పలేను—"

"గతరాత్రి మీరు గోపాలంతో మాట్లాడేరా?"

దుర్గ ఒక్కక్షణం ఆలోచించి—"లేదు—" అన్నది.

"వీధిలో గోపాలం, మీ బావ సత్యం—ఇద్దరూ పడుకున్నారు. కానీ ఒక రాత్రివేళ సత్యం ఇంట్లోకి వచ్చేశాడు. ఆ తర్వాత ఓలారీ ఆ వీధిలోంచి వెడుతూ—గోపాలం మంచాన్ని గుద్దేసింది. గోపాలం వెంటనే మరణించాడు. ఈ సంఘటనపై మీ అభిప్రాయమేమిటి?"

"యాక్సిడెంట్!" అంది దుర్గ.

"సత్యం ముందుగా లోపలకు రావడం...."

"యాక్సిడెంటల్ ...." అన్నదామె.

"మీరు వెళ్ళొచ్చు—" అన్నాడు భానోజీరావు.

దుర్గ వెళ్ళింది. శేఖరం వచ్చాడు.

"సత్యం ప్రమాదకరమైన మనిషి. ఇందులో వాడి చేయి వున్నదీ లేనిదీ నాకు తెలియదు. కానీ...." అని ఆగిపోయాడు శేఖరం.

"కానీ...." అన్నాడు భానోజీరావు.

"వాడు గోపాలాన్ని చంపాలని అనుకున్నట్లు నాకు తెలుసు—...."

"ఎలా?"

"దుర్గ పెళ్ళి ఎవరితో కుదిర్చినా ఆ వరుణ్ణి బ్రతకనివ్వనని సత్యం నాతో చాలాసార్లు అన్నాడు—"

"ఎందుకని?"

"కట్నమివ్వడానికి తగిన డబ్బు నావద్ద వున్నదట. అందుకని తన తండ్రి కట్నమడగడంలో తప్పులేదని వాడి వాదన_....."

"అవునూ — మీరు సత్యానికి కట్నమివ్వకూడదని ఎందుకనుకున్నారు?" అన్నాడు భానోజీరావు.

"కట్నమిస్తే వాడికే ఎందుకివ్వాలన్నది నా బాధ! అదీకాక గోపాలాన్ని నేను చిన్నతనంనుంచీ ఎరుగుదును. వాడు యోగ్యుడు. కానీ కట్నంలేకుండా నా చెల్లెల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడు. అలాగని వాడికేమైనా లోపాలున్నాయా అందామంటే కట్నాల బజార్లో వాడి రేటు — ముప్ఫైవేలదాకా వుంది. అలాంటివాడుండగా కట్నమిచ్చి సత్యానికివ్వాల్సిన కర్మ నాకేమిటి?"

భానోజీరావు క్షణం ఆలోచించి_"సత్యం గోపాలాన్ని చంపి వుండవచ్చునని మీరనుకుంటున్నారా?" అన్నాడు.

శేఖరం ఎంతోసేపు ఆలోచించలేదు_"రాత్రి నేనో దృశ్యం చూశాను_" అన్నాడతడు_"సత్యం లోపలకు మంచం మార్చుకుని గోపాలం ముఖంమీదకు ఏమో స్ప్రే చేశాడు. మధ్యలో నిద్ర చెడిపోయినపుడు నేనా దృశ్యం చూశాను. అప్పుడు దాని గురించి ఎక్కువ ఆలోచించాలనుకోలేదు. అయితే ఈ ప్రమాదం జరిగిన వెంటనే నాకా విషయం గుర్తుకు వచ్చింది_"

భానోజీరావు ఉత్సాహంగా_"మీరు చెప్పిందంతా నేను జాగ్రత్తగా నోట్ చేసుకుంటున్నాను. నిద్ర మత్తులో మీరు భ్రమపడడం లేదుగదా!" అన్నాడు.

"లేదు. కానీ అప్పుడే నా బుర్ర పదునెక్కివుంటే

ఈ ప్రమాదం జరిగివుండేదికాదు గదా అనిపిస్తోంది—"
అన్నాడు శేఖరం బాధగా.

"ఇంకా ఏమైనా చెప్పగలరా మీరు?" అన్నాడు భానోజీరావు.

"లారీ డ్రైవర్ దిగా భావించబడుతున్న తాళాల గుత్తిమీద పుర్రె బొమ్మ వున్నదిగదా—అది స్కెలిటన్ గ్రూపుదని మీరే అన్నారు. స్కెలిటన్ స్మగ్లింగ్ గ్రూప్ నాయకుడు వరాలయ్యా అని చాలామంది చెప్పు కుంటారు కానీ పోలీసులవద్ద అందుకు సరైన ఆధారాలు లేవు. నాకు తెలిసినదల్లా మా సత్యానికీ వరాలయ్యాకూ మంచి స్నేహం వున్నదన్న విషయం...." అన్నాడు శేఖరం.

"అంటే మీరు చెప్పేదేమిటి?"

"గోపాలాన్ని వీధిలో పడుకోమని ప్రోత్సహించింది సత్యం. తనూ అతడితోపాటు కాసేపు పడుకుని ఓ రాత్రివేళ లోపలకు వచ్చేకాడు. దీని అంతరార్థం మీరే ఆలోచించండి. ఈ విషయమై ఇంక నేనేమీ చెప్ప లేను—" అన్నాడు శేఖరం.

భానోజీరావు శేఖరాన్ని పంపించేసి సత్యాన్ని రప్పించాడు.

"గోపాలం చావుపై మీ అభిప్రాయం—"

"యాక్సిడెంట్—"

"కాంతసేపు వీధిలో పడుకుని తర్వాత మీరు బయట నుంచి లోపలకు పోవాలనుకోవడం...."

"యాక్సిడెంటల్—"

"మీ మరదలు దుర్గ కూడా సరిగ్గా ఇవే పదాలు ఉపయోగించింది—"

"ఆమె నా మరదలు-"అన్నాడు సత్యం గర్వంగా.

"మీ ఇద్దరిదీ ఒకేమాట కావచ్చు. కానీ ఇద్దరూ తప్పే చెప్పారు. మీరు ఇంట్లో పడుకోబోతూ గోపాలం ముఖంమీద మత్తు మందు స్ప్రే చేయడం ఒకరు చూశారు—"

సత్యం తెల్లబోతూ—"ఎవరు?" అన్నాడు.

"చెప్పింది ఎవరైనప్పటికీ—అది నిజం!" అన్నాడు భానోజీరావు.

"నిజమే—" అన్నాడు సత్యం నీరసంగా.

"ఎందుకలా చేశారు?"

"దుర్గ గోపాలాన్ని రాత్రి ఒంటిగంటకు కలుసుకోవాలనుకుంది—"

"ఎందుకు?"

"నాకు తెలియదు—"

"అయితే మీరు గోపాలంమీద మత్తుమందు ఎందుకు జల్లారు?"

"అతడికాసమయానికి మెలకువ రాకూడదని...."

"వస్తే ఏమవుతుంది?"

"దుర్గకు అన్యాయం జరుగుతుంది!"

"ఇంతమంది వున్న ఇంట్లో దుర్గకు అన్యాయం ఎలా జరుగుతుంది?"

సత్యం తల వంచుకుని — "దుర్గ సంగతి తెలిస్తే మీరిలా అనేవారు కారు—" అన్నాడు.

"చెప్పండి—" అన్నాడు భానోజీరావు.

"మగవాడు చొరవచేస్తే దుర్గ అభ్యంతరం పెట్టలేదు...."

"మీకెలా తెలుసు?"

"అనుభవంమీద చెబుతున్నాను...."

"అంటే?"

"మీరనుకునేది నిజం. దుర్గ ఏనాడో నాదయింది.."

"ఆమె మీమీద ప్రేమకొద్దీ మీకు లొంగిపోయిందేమో...." అన్నాడు భానోజీరావు. అయితే ఈ కొత్త విశేషం అతడిని ఆశ్చర్యపరుస్తున్నది.

"నిజం చెబుతున్నాను. నాకు చాలామంది ఆడవారితో పరిచయం వున్నది. దుర్గ నామీది ప్రేమతో నాకు లొంగిపోలేదు. అటువంటి ఏకాంతం లభిస్తే ఏ మగవాడికైనా ఆమె లొంగిపోయి వుండేది-" అన్నాడు సత్యం.

భానోజీరావు అతడివంక ఆశ్చర్యంగా చూశాడు. సత్యం కళ్ళలో నమ్మకం కొట్టవచ్చినట్లు కనబడింది.

"మీ అభిప్రాయం తప్పని నా ఉద్దేశ్యం—" అన్నాడు భానోజీరావు.

"తన బలహీనత గురించి దుర్గకు కూడా తెలుసు—" అన్నాడు సత్యం—"అందుకే ఆమె మగవాళ్ళకు సాధ్యమైనంత దూరంగా వుండడానికి ప్రయత్నిస్తుంది. ఏకాంతానికి ప్రయత్నించినా సాధ్యపడనివ్వదు. నిన్న రాత్రి ఆమె గోపాలంతో మాట్లాడుతూంటే ఆమె కనులు చూశాను. ఆ కళ్ళలో అతడిపట్ల జాలి కనబడింది. ఆ జాలి దేనికి దారితీస్తుందో నాకు తెలుసు...."

"ఆమె కారణం ఏమిటో అతడికి చెప్పలేదా?"

"అతడికి ప్రమాదం ఉన్నదని హెచ్చరించింది. నిజం చెప్పాలంటే ఆ ప్రమాదం నావల్ల వున్నదని అతడికి చెప్పిందామె—" అన్నాడు సత్యం.

భానోజీరావు తెల్లబోయి — "ఏమన్నారూ?" అన్నాడు.

"మీరా విషయం సీరియస్‌గా తీసుకోకండి. దుర్గకు గోపాలాన్ని ఏకాంతంగా కలుసుకుని మాట్లాడాలని పించింది. అందుకామె నోటికి వచ్చిన అబద్ధం చెప్పింది. విశేషమేమిటంటే ఆమె అతడిని ప్రమాదం గురించి హెచ్చరించింది. అది నిజంగానే జరిగింది—...." అన్నాడు సత్యం.

భానోజీరావు ఆలోచనలో పడ్డాడు. సత్యం తీరికూర్చుని తన ప్రాణం మీదకు వచ్చే విషయమొకటి చెప్పాడు. ఎందుకు? అతడు నిజంగా నిర్దోషా? లేక....

దుర్గ గోపాలంతో ఏం మాట్లాడిందో అతడు విన్నాడు. ఈ విషయం తనకు తెలిసింది కాబట్టి తను మళ్ళీ దుర్గను ప్రశ్నించవచ్చు. అప్పుడామె ఈ విషయం చెప్పవచ్చు. ఆ విషయం పసిగట్టి ముందుగానే తనే ఈ విషయం చెప్పేకాడా?

భానోజీరావు ఆలోచిస్తూ — "గోపాలం ప్రమాద వశాత్తూ మరణించలేదనీ—ఒక పథకం ప్రకారం హత్య చేయబడ్డాడనీ నేననుకుంటున్నాను. నా అభిప్రాయంతో ఏకీభవించమని మిమ్మల్ని అడగడంలేదు. ఈ హత్య ఎవరు చేసివుండవచ్చునని మీరు అభిప్రాయపడుతున్నారు?" అన్నాడు.

"నేనేమీ చెప్పలేను—" అన్నాడు సత్యం.

-"పోనీ—ఈ హత్యవల్ల లాభంపొందే వారెవరైనా వున్నారా?"

ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు సత్యం.

ఈ హత్యవల్ల లాభం పొందేవాడు సత్యం మాత్రమే!

అయినా ఎటువంటి లాభం? తన్ను ప్రేమించి తనకు శరీరాన్నర్పించిన ఓ అమ్మాయిని గోపాలం పెళ్ళిచేసుకోకుండా ఆపడం....ఏమిటో—హత్యకు ఇదే కారణమంటే నమ్మబుద్ధి కావడంలేదు....

"ఇది హత్య అని నేనలేను. కానీ గోపాలం చావు వల్ల ప్రయోజనం పొందే వ్యక్తి ఎవరో నాకు తెలుసు-" అన్నాడు సత్యం.

"ఎవరు?" అన్నాడు భానోజీరావు.

"గోపాలం బాగా డబ్బు సంపాదిస్తున్నాడు. తను సంపాదించిందంతా అతను ఈ ఊళ్ళోని ఎకౌంట్ కు మెయిల్ ట్రాన్ ఫర్ చేస్తున్నాడు. అయిదారేళ్ళతర్వాత ఇక్కడే పెద్ద వ్యాపారం ప్రారంభించాలని అతడి ఆలోచన—"

"అయితే?"

"ఆ అకౌంట్ కు నామినీ శేఖరం—" అన్నాడు సత్యం.

అంటే—గోపాలం చనిపోతే ఆ డబ్బు శేఖరానికి వస్తుందన్నమాట-అనుకున్నాడు భానోజీరావు. అతగాడి పోలీసు బుర్ర చురుగ్గా పనిచేయసాగింది—"ఆ అకౌంట్లో డబ్బెంత వుండవచ్చు?"

"లక్షరూపాయలున్నా నేనాశ్చర్యపోను-" అన్నాడు సత్యం.

"మీ మనసులో ఏదో వుంది. వివరంగా చెప్పకలరా?"

సత్యం గొంతు సవరించుకుని — "సుగణా, నాకూ శారీరక సంబంధం ఏర్పడిన సంగతి శేఖరానికి తెలుసు.

అందుకే నేను కిట్నం గురించి పట్టుబడుతున్నానని అతడి అనుమానం. అయితే దుర్గను అన్యాయం చేసే ఉద్దేశ్యం నాకు లేదు. మా నాన్నకు నిజంగా డబ్బు అవసరం వుంది. ఆ డబ్బు రాబట్టడానికి నా పెళ్ళి ఒక్కటే ఆయనకు దారి. ఆయన నామీద ఎన్నో ఆశలు పెట్టుకుని చదివించాడు. ఆయనను నేనెలా నిరుత్సాహపర్చగలను. పోనీ అంటే శేఖరం లేనివాడు కాదు....” అన్నాడు.

“శేఖరానికి భూములున్నాయా?” అన్నాడు భానోజీ రావు.

“లేవు—”

“తండ్రి ఇచ్చిన ఆస్తి వుందా?”

“లేదు—”

“మరి అతడు ఆస్తిపరుడెలాగయ్యాడు?”

సత్యం చిన్నగా తగ్గి—“శేఖరం అక్రమంగా డబ్బు సంపాదిస్తున్నాడు—” అన్నాడు.

“అక్రమంగా అంటే?”

“అందరూ లోపాయికారీగా స్కెలిటన్ గ్రూప్ నాయకుడని చెప్పుకుంటుండే వరాలయ్యతో శేఖరానికి మంచి దోస్తీ వుంది—” అన్నాడు సత్యం.

భానోజీరావు తెల్లబోయాడు.

స్కెలిటన్ గ్రూప్‌తో సత్యానికి సంబంధముందని శేఖరం అన్నాడు. శేఖరానికి ఆ గ్రూప్‌తో సంబంధముందని సత్యం అంటున్నాడు.

అసలు ఈ స్కెలిటన్ గ్రూపు గురించి ఆరాతీసే దాకా ఈ యింట్లో వాళ్ళనింకేమీ అడక్కూడదని అతడనుకున్నాడు.

# 6

ఇన్‌స్పెక్టర్ భానోజీరావు స్టేషన్‌కు వెళ్ళగానే స్కెలిటన్ గ్రూప్‌కు సంబంధించిన ఫైల్సు తిరగేశాడు.

రెండు సంవత్సరాల క్రితం ప్రారంభమయింది ఆ గ్రూపు. అయిదు బ్యాంకు దోపిడీలకు ఆ గ్రూపుతో సంబంధమున్నదని అనుమానం. సుమారు ఇరవై హత్యలకు ఆ గ్రూపు కారణమని అనుమానమున్నది.

అఫీషియల్‌గా ఇంతే తెలిసినప్పటికీ — రాష్ట్రంలో జరిగే అనేక ఘోరాలకూ, నేరాలకూ ఈ గ్రూపు ప్రోత్సాహమున్నదని చెప్పుకుంటూరు. ఒక ప్రముఖ రాజకీయ నాయకుడి ఆధ్వర్యంలో ఈ గ్రూపు నడుస్తున్నట్లు అంతా అనుకుంటూంటారు. కాకినాడకు సంబంధించినంత వరకూ వరాలయ్యమీద కొంత అనుమానమున్నది. అయితే ఏ అనుమానానికీ సరైన ఆధారాలు లేవు.

పుత్తె ఆ గ్రూపుకు గురు అని చెప్పుకుంటూరు. అయితే ఆ గురును ప్రత్యేకంగా ఏ నేరం చేయడానికిగానీ, వ్యక్తులను బెదిరించడానికిగానీ వాడలేదు. అంతవరకూ లభించిన ఆధారాలనుబట్టి చూస్తే—అసలు స్కెలిటన్ గ్రూప్ అనేది ఉన్నదా లేక అది కేవలం ఊహాజనితమా అని కూడా అనుమానం కలుగుతుంది.

రెండు సంవత్సరాల క్రితం ఆ గ్రూపు ఉనికి గురించి అనుమానం తగిలినప్పుడు పోలీస్ డిపార్టుమెంట్ డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ విజయ్‌ను అందుకు నియమించింది. రెండు వారాల్లోనే ఆసక్తికరమైన విషయాలు తెలుసుకున్నానంటూ అతడినుంచి రిపోర్టు అందింది. రిపోర్టు అందిన ఇరవై నాలుగు గంటల్లో అతడో యాక్సిడెంట్లో మరణించాడు. దానిపై దర్యాప్తు చేయడానికి ఇన్‌స్పెక్టర్

సత్యారావు నియమించబడ్డాడు. అతడూ స్కెలిటన్ గ్రూప్ ఉనికిని నిర్ధారించి-ఆ వెంటనే ప్రమాదవశాత్తూ మరణించాడు. అలా అయిదుగురయ్యారు.

ఆరోవాడైన మోహన్ మాత్రం తను పరిశోధించి— స్కెలిటన్ గ్రూప్ ఉనికి అనుమానాస్పదమనీ—అంత వరకూ మరణించిన అయిదుగురి చావుకీ — స్కెలిటన్ గ్రూప్‌కీ ఏ సంబంధమూ లేదనీ నిర్ధారించాడు.

ఇన్‌స్పెక్టర్ భానోజీరావు మోహన్‌ని కలుసుకోవా లనుకున్నాడు. అందుకు అతడికి ఎంతోసేపు పట్టలేదు. మోహన్ చాలా త్వరగా లైన్‌లో దొరికాడు.

"హలో మిస్టర్ మోహన్! నేను మీతో చాలా అర్జంటుగా మాట్లాడాలి. మనం యెక్కడ కలుసుకుందాం?—" అన్నాడు భానోజీరావు.

"మా యింటికి రండి—" అన్నాడు మోహన్.

ఇన్‌స్పెక్టర్ మోహన్ రాజమండ్రిలో వుంటున్నాడు. భానోజీరావు అతడిల్లు చేరుకునేందుకు మూడు గంటలు పట్టింది.

ఇద్దరూ పరస్పరం పరిచయం చేసుకున్నారు.

"ఏమిటి విశేషం?" అన్నాడు మోహన్.

"నాకు మీరు సహకరించాలి—" అన్నాడు భానోజీ రావు.

"ష్యూర్!" అన్నాడు మోహన్.

"బహుశా నేనడిగే ప్రశ్నలు కొన్ని మిమ్మల్ని చాలా ఇబ్బంది పెట్టవచ్చు—"

"నా ఇబ్బంది సంగతి ఎలా వున్నా అడగడానికి మీరు చాలా ఇబ్బంది పడుతున్నట్లు అనిపిస్తుంది—" అన్నాడు మోహన్ నవ్వుతూ.

"అందుకు కారణం స్కెలిటన్ గ్రూప్-" అన్నాడు భానోజీరావు.

మోహన్ పెదాలపై చిరునవ్వు మాయమయింది—"అదేమిటి?" అన్నాడు గంభీరంగా.

"స్కెలిటన్ గ్రూపు గురించి మీకు తెలిసింది చెప్పాలి—"

"నాకు తెలిసినంతవరకూ అలాంటి గ్రూపు ఏదీ లేదు—".

భానోజీరావు నవ్వి—"స్కెలిటన్ గ్రూప్ గురించి మీరు ఇన్వెస్టిగేట్ చేశారన్న విషయం మరిచిపోకూడదు—" అన్నాడు.

అప్పుడు మోహన్ నవ్వి—"నేను ఇన్వెస్టిగేట్ చేసి తెలుసుకున్నదేగదా — ఇప్పుడు మీకు చెప్పాను—" అన్నాడు.

"అది నాకు తెలుసు. అయితే మరో విషయం నన్నాశ్చర్య పరుస్తున్నది. మీకు ముందు అయిదుగురు పోలీసాఫీసర్లు ఇదే విషయం ఇన్వెస్టిగేట్ చేసి ఆ గ్రూపు ఉనికిని ధృవపరిచారు...." అన్నాడు భానోజీరావు.

"అయిదుగురు పొరపాటుపడినంతమాత్రాన ఒక్కడు తెలుసుకున్న నిజం నిజం కాకుండా పోతుందా? నిజం విషయంలో డెమోక్రసీ పనికిరాదు"అన్నాడు మోహన్.

"మీరు రాజకీయాల గురించి మాట్లాడుతున్నారు. నేను స్టాటిస్టిక్స్ గురించి మాట్లాడుతున్నాను. ఒకే విషయంమీద ఆరుగురు పరిశోధించినపుడు — అందులో అయిదుగురిది ఒకటిగానూ, ఒకడిది వేరుగానూ ఉన్నప్పుడు నిజం యెవరిదయే అవకాశముంటుందీ అని యోచిస్తున్నాను...." అన్నాడు భానోజీరావు.

"పరిశోధనకు యోచన అవసరం. అయితే ఆ యోచన వల్లనే పరిశోధన పూర్తికాదు. సపోర్టింగ్ ఎవిడెన్స్ కావాలి—" అన్నాడు మోహన్.

"ఒప్పుకున్నాను—" అన్నాడు భానోజీరావు— "స్కెలిటన్ గ్రూప్ ఉనికిని నిరాకరించిన అయిదుగురూ వెను వెంటనే మరణించారు. లేదన్న మీరు బ్రతికారు. లేదని బ్రతికారా, బ్రతికి లేదన్నారా అన్నది మీనుంచి తెలుసుకోవాలనుకుంటున్నాను—"

మోహన్ ముఖం అదోలాగై పోయింది—"ఈ రకం ప్రశ్న మొదటిసారిగా మీనుంచే వింటున్నాను—" అన్నాడతను.

భానోజీరావు మాట్లాడలేదు.

"స్కెలిటన్ గ్రూప్ గురించి తెలుసుకునే అవకాశం మీకు కలగజేస్తాను. అప్పుడు అన్నీ మీకే అర్థమవుతాయి—" అన్నాడు మోహన్.

"అయితే ఆ గ్రూపు వుందంటారా?"

"అది మీరే నిర్ణయించుకుందురుగాని...." అన్నాడు మోహన్.

"అంటే?"

"మనం ఇద్దరం కలిసి ఈ కేసు పరిశోధిద్దాం. స్కెలిటన్ గ్రూపు గురించి మీకున్న అనుమానాలన్నీ తీరిపోతాయి—"

"పరిశోధించడమంటే ఎలా?"

"ముందు గోపాలం హత్యకేసుతో ప్రారంభిద్దాం.." అన్నాడు మోహన్.

"ఆ కేసు గురించి మీరు విన్నారా?"

"వినడమేమిటి? అది పరిశోధిస్తూనే మీరిక్కడకు

వచ్చారని నాకు తెలుసు—" అన్నాడు మోహన్.
భానోజీరావు ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

## 7

యాక్సిడెంట్ చేసిన లారీ దొరికింది. అది చిత్రాడ ప్రాంతాల రోడ్డు పక్కన వదిలిపెట్టబడి వుంది. డ్రైవరు లేడు.

క్షణాలమీద వాకబులు జరిగాయి. లారీ వరాలయ్యది.

భానోజీరావు వరాలయ్యను కలుసుకున్నాడు.

"లారీలో వున్నది డ్రైవర్ రాములు. వాడు రాజమండ్రినుంచి మామిడి పళ్ళు తీసుకుని రావలసి వుంది. ఏ కారణంవల్లనో యాక్సిడెంట్ చేసి ఆ భయంతో పరారీ అయ్యాడు—" అన్నాడు వరాలయ్య.

భానోజీరావు ఆయనకు హత్య జరిగిన స్థలంలో దొరికిన తాళాలగుత్తి చూపించి—"దీని గురించి మీరేమైనా చెప్పగలరా?" అన్నాడు.

వరాలయ్య అది పరిశీలించి చూసి—"ఇది స్కెలిటిన్ గ్రూపుకి చెందివుండవచ్చు—" అన్నాడు.

స్కెలిటిన్ గ్రూపు అన్న పేరు వరాలయ్య నోటినుంచి వింటానని భానోజీరావు ఊహించలేదు—"ఆ గ్రూపు గురించి మీకు తెలుసా?" అన్నాడు ఉత్సాహంగా.

"ఆ గ్రూపుకూ నాకూ ముడి వున్నట్లు జనం చెప్పుకుంటారని కూడా నాకు తెలుసు—" అన్నాడు వరాలయ్య.

"అయితే అది నిప్పు లేకుండా వచ్చిన పొగ అంటారా?"

"కాదు—" అన్నాడు వరాలయ్య—"నేను వ్యాపారస్థుణ్ని. అన్నీ న్యాయమార్గాన చేయడం కావాలన్నా నాకు సాధ్యపడదు. కొందరు రాజకీయ నాయకులు, ప్రభుత్వోద్యోగులు నన్ను బలవంతపెట్టి నాకిష్టంలేని పనులు చేయిస్తూంటారు నాచేత. నా మనుగడను దృష్టిలో వుంచుకుని నేనందుకు ఒప్పుకోవలసి వస్తూంటుంది....

"అలాంటి వారి కొందరి పేర్లు చెప్పగలరా?"

"చెబితే బ్రతకను...."

భానోజీరావు గంభీరంగా-"మీ ప్రాణాలు కాపాడే బాధ్యత నాది—" అన్నాడు.

"మీకు తెలుసో తెలియదో — స్కెలిటన్-గ్రూపు గురించి పరిశోధనకు దిగి అయిదుగురు పోలీసాఫీసర్లు ప్రాణాలు పోగొట్టుకున్నారు—" అన్నాడు వరాలయ్య.

భానోజీరావుకు ఏమనాలో తోచలేదు. కొద్దిక్షణాలు ఆలోచించి—"పోనీ — మీరెలాంటి ఇష్టంలేని పనులు చేశారో చెప్పగలరా?" అన్నాడు.

"ఆ మధ్య విశాఖపట్నంలో స్టేట్ బ్యాంకునుంచి ఇరవై లక్షలు దోపిడీ చేయబడ్డాయి. ఆ దొంగకు నేను ఒకరోజు మా యింట్లో రక్షణ కల్పించాను. ఆ ఇరవై లక్షల్లో ఒక్క రూపాయకూడా నాకు దక్కలేదు. నా బాధ్యత ఆదొంగలను ఒకరోజు కాపాడ్డంమాత్రమే. అందుకు ప్రతిఫలంగా ప్రభుత్వం నా జోలికి రాకుండా వుండడం మాత్రమే!"

"అంటే?"

"వ్యాపారస్థుల్ని బాధించడానికి ప్రభుత్వానికి లక్షా తొంభై మార్గాలున్నాయి. ప్రతిఒక్కటీ మాకు ప్రాణాంతకమే—" అన్నాడు వరాలయ్య.

"ఈ తాళాలు మీ లారీ డ్రైవర్ వయ్యుండాలి. అవి మీకు తెలియకుండా అతడి వద్దకు వచ్చాయా—లేక ...."

వరాలయ్య నవ్వి—"ఇవి మా లారీ డ్రైవర్ వని నే ననుకోవడంలేదు. వాడు అత్యంత సామాన్యుడు. స్కెలిటన్ గ్రూపులాంటి ప్రమాదకర సంస్థల్లో పనిచేసే మనిషి కాదు—" అన్నాడు.

"మరయితే హత్యా ప్రదేశంలోకి వెలా వచ్చిందంటారు?"

వరాలయ్య నవ్వి — "మీకు తెలియకే నన్నడుగుతున్నారా? ఈ తాళాలగుత్తి హంతుడిది కావచ్చు. హత్య జరిగిన ఇంట్లో యెవరిదైనా కావచ్చు—" అన్నాడు.

"ఛీ—నేను నిజంగా ట్యూబ్ లైట్ నే—" అనుకున్నాడు భానోజీరావు. అతడికి మిత్రవర్గంలో ట్యూబ్ లైటు అన్న పేరుంది. ఆ పేరు పోగొట్టుకోవాలని అతడెన్నో ప్రయత్నాలు చేశాడు. డిపార్టుమెంట్లో సమర్థుడిగా పేరు తెచ్చుకున్నప్పటికీ మిత్రవర్గంలో మాత్రం అతడీ పేరు పోగొట్టుకోలేక పోతున్నాడు.

"స్కెలిటన్ గ్రూపు గురించి ఇంకేమైనా చెప్పగలరా మీరు?" అన్నాడు భానోజీరావు.

"చెప్పడం నాకుగానీ, తెలుసుకోవడం మీకుగానీ మంచిదికాదు. స్కెలిటన్ గ్రూపు లేదనే అనుకోండి. మీకూ నాకూ చాలా మంచిది-" అన్నాడు వరాలయ్య.

"పోలీసు డిపార్టుమెంటంటే చాలామందికి భయంపోయింది—" అనుకున్నాడు భానోజీరావు. వరాలయ్య ఎంత సూటిగా మాట్లాడుతున్నాడు. అందుకు కారణం?

"నా మంచి చెడ్డలు నేను చూసుకుంటాను. మీకు తెలిసింది చెప్పండి—" అన్నాడు భానోజీరావు కాస్త

కోపంగా.

"హోటల్ యశ్వంత్ తెలుసా మీకు?" అన్నాడు వరాలయ్య.

హోటల్ యశ్వంత్ ప్రారంభమై రెండు సంవత్సరా లయింది. కాకినాడలో న్యూయార్క్‌లో వుండవలసిన హోటల్ వెలిసిందని అంతా దానిగురించి చెప్పుకుంటారు. భానోజీరావు ఆ హోటల్‌కెప్పుడూ వెళ్ళలేదు. డ్యూటీ మీద వెళ్ళవలసిన అవసరం యెన్నడూ రాలేదు. మామూలుగా వెళ్ళే స్తోమతులేదు. ఒకరోజు కని సరదాగా వెళ్ళినా అంతా అనుమానిస్తారు. ఒక మామూలు పోలీ సాఫీసరు అందులోకి వెళ్ళగలగడాన్ని డిపార్టుమెంట్లో హర్షించలేరు.

"తెలుసు—" అన్నాడు భానోజీరావు.

"ఆ హోటల్ ప్రొప్రయిటర్ శంకరానంద్‌కీ, స్కెలి టన్ గ్రూపుకీ ఏమైనా సంబంధముండి వుండవచ్చునని నా అనుమానం. అయితే ఇది కేవలం అనుమానం మాత్రమే!"

భానోజీరావు లేచి నిలబడి—"మీ డ్రైవర్ రాములు కోసం మేము ప్రయత్నిస్తున్నాం. మీ సహాకారం తప్పక వుంటుందని ఆశిస్తున్నాం—" అన్నాడు.

"తప్పకుండా—" అన్నాడు వరాలయ్య.

# 8

భానోజీరావు హోటల్ యశ్వంత్‌కు వెళ్ళలేదు. అతడు తానెక్కడ బయల్దేరానూ ఎక్కడకు చేరుకుంటా న్నానూ అని ఆలోచిస్తున్నాడు.

గోపాలం చచ్చిపోయాడు. వీధిలో ఓ పక్కగా మడత మంచం వేసుకుని పడుకుంటే లారీ గుద్దింది.

అది హత్యా? లేక యాక్సిడెంటా?

ఈ ఆలోచనతో పరిశోధన ప్రారంభించి స్కెలిటన్ గ్రూపులో అడుగుపెట్టాడు. డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ మోహన్‌ని కలిశాడు. వరాలయ్యని కలిశాడు. ఇప్పుడు హోటల్ యశ్వంత్ గురించి విన్నాడు.

ఇందువల్ల తనేం సాధిస్తాడు?

స్కెలిటన్ గ్రూపు గురించి ఏమీ తెలియడంలేదు. అంతకంతకూ అయోమయమైపోతోంది. ముందు గోపాలం హత్య గురించి ఆలోచించాలి.

ఆ హత్య ఎలా జరిగింది?

ఆ హత్యకూ స్కెలిటన్ గ్రూపుకూ సంబంధమున్నదా?

భానోజీరావు తలపట్టుకున్నాడు.

అప్పుడు ఎవరో—"సార్!" అన్నాడు.

భానోజీరావు తలెత్తి చూశాడు.

"నా పేరు జగన్నాథమండి—" అన్నాడతను.

భానోజీరావు మాట్లాడకుండా అతడికంకే చూశాడు.

"మిమ్మల్ని అర్జంటుగా ఓ చోటుకు తీసుకుని వెళ్ళాలి—"

"ఎక్కడకు?"

"గుడి వీధికి—"

"ఎందుకు?"

"అక్కడో ఆయన మిమ్మల్ని కలుసుకుంటారట—"

"ఎవరాయన?"

"పేరు తెలియదండి. కానీ డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ మోహన్ చెప్పగా ఆయన మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నారట...." అన్నాడు జగన్నాథం.

భానోజీరావు తక్కున లేచాడు—"పద!" అన్నాడు.

ఇద్దరూ స్టేషన్ బయటకు వచ్చారు.

అక్కడో అంబాసిడర్ కారుంది. ఆకుపచ్చరంగు. కారులో వేరెవ్వరూ లేరు.

"నేనే డ్రైవ్ చేస్తానండి—" అన్నాడు జగన్నాథం.

భానోజీరావు వెనక సీట్లో కూర్చున్నాడు. కారు కదిలింది.

భానోజీరావు ఆలోచిస్తున్నాడు. ఎవరతను? తనకిలాంటి సమాచారం అందించాలని అనుకుంటున్నాడు.

ఉన్నట్లుండి కారు ఆగింది.

భానోజీరావు బయటకు చూశాడు. అది గుడివీధి కాదు.

"చిన్న ట్రబుల్ సార్—" అన్నాడు జగన్నాథం. కార్లోంచి దిగాడతను.

భానోజీరావు చుట్టూ చూశాడు. వీధి నిర్మానుష్యంగా వుంది.

జగన్నాథం ముందుకు వెళ్ళి బోనెట్ తెరిచాడు. భానోజీరావు అటే చూస్తున్నాడు.

అప్పుడిద్దరు వచ్చారు—కారుకు అటూ ఇటూ!

వాళ్ళను భానోజీరావు చూడలేదు. చూసేలోగా రెండుపక్కలనుంచీ ఇద్దరూ కార్లోకి మత్తుమందు స్ప్రే చేశారు. ఆ విషయం భానోజీరావుకు తెలిసిపోయింది. కానీ అప్పటికే ఆలస్యమయిపోయింది. అతడు తల పక్కకు వాల్చేశాడు.

జగన్నాథం బోనెట్ కిందకు దించాడు.

అతడు ముందుసీట్లో కూర్చున్నాడు. మత్తుమందు

స్ప్రే చేసిన ఇద్దరూ వెనుక సీట్లో భానోజీరావుకు అటూ ఇటూ కూర్చున్నారు.

కారు కదిలింది.

# 9

"వెల్‌కం మిస్టర్ భానోజీరావ్-" అన్నాడతను.

భానోజీరావు కళ్ళు నులుముకుని చుట్టూ చూశాడు. ఆ ప్రదేశం అతడికి చాలా కొత్తగా వుంది.

"నేనెక్కడున్నాను?"

"రావలసిన చోటుకే వచ్చావు!" అన్నాడతను.

"ఎవర్నువ్వు?"

"నువ్వు చూడాలనుకుంటున్న వ్యక్తిని...."

"అంటే?"

"స్కెలిటిన్ గ్రూపు...."

భానోజీరావు తెల్లబోయి—"నువ్వు లీడరువా—" అన్నాడు.

"అలాగే అనుకోవచ్చు—" అన్నాడతను.

"నీ పేరు...."

"స్కల్!" అన్నాడతను.

"స్కల్!" అని తనలోతనే గొణుక్కున్నాడు భానోజీరావు

"ఏమిటి?" అన్నాడు స్కల్.

"స్కల్—అదేం పేరు—" అన్నాడు భానోజీరావు.

"అదీ ఒక పేరు—" అన్నాడు స్కల్ తాపీగా.

"నీ తలిదండ్రులు నీకా పేరు పెట్టివుండరు—" అన్నాడు భానోజీరావు.

"తలిదండ్రుల పేరు చెప్పగలవాళ్ళి దౌర్భాగ్య భారతదేశంలో ఎందరున్నారంటున్నావు?" అన్నాడు

స్కల్.

"అంటే?"

"భారతదేశం జనాభా ఎనభై కోట్లు అనుకోవచ్చు. ఇందులో ఎంతమందికి తలిదండ్రుల పేర్లు తెలుసూ అంటున్నాను—" అన్నాడు స్కల్.

సంభాషణ తప్పుతున్నదని గ్రహించాడు భానోజీ రావు—"నన్నిక్కడికి ఎందుకు పిలిపించావు?"

"డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ మోహన్ నీ గురించి చెప్పాడు...."

"మోహన్—" అనుకున్నాడు భానోజీరావు మనసులో. అతడు తన డిపార్టుమెంట్లోని వ్యక్తి. కానీ అతడికి స్కెలిటన్ గ్రూపుతో సంబంధముంది. లేకపోతే ఈ విధంగా తానిక్కడికి రప్పించబడి వుండేవాడు కాదు.

"ఏమని చెప్పాడు?"

"నువ్వు నన్ను చూడాలనుకుంటున్నావని!"

"నేను నిన్ను చూడాలనుకోలేదు. పట్టుకోవాలనుకున్నాను...." అన్నాడు. భానోజీరావు.

"పోనీ—అందుకే....నిన్ను పట్టుకున్నాను...."

"అందుకే అంటే?"

"నీకు తెలుసో తెలియదో — ఇంతవరకూ ఏడుగురు పోలీసు ఇన్‌స్పెక్టర్లని నేను పట్టుకున్నాను. నువ్వు ఏడో వాడివి...."

అందులో అయిదుగురు పోయారన్న విషయం భానోజీరావుకు స్ఫురించగా అతడి వళ్ళు జలదరించింది. ఎంత సులభంగా వీళ్ళు తనని పట్టుకున్నారు?

"తెలుసు...."

"మేము పట్టుకున్నవారిలో ప్రాణాలతో వున్నవాడు మోహన్. ఆ తర్వాత అలాంటి అవకాశం నీకే వుంది."

"అవకాశం వున్నదా, సంపాదించుకోవాలా?"

"తెలివైన ప్రశ్న—" అని నవ్వాడు స్కల్.

భానోజీరావు మాట్లాడలేదు. అతను చుట్టూ చూస్తున్నాడు.

అది అత్యంత ఆధునికంగా అలంకరించబడిన గది. అందులో ఎదురెదురుగా రెండు సోఫాలు. ఓ సోఫాలో స్కల్. రెండో సోఫాలో తను!

"నీకు నేనేమీ చెప్పను. అంతా నీ అదృష్టంమీద ఆధారపడి వుంటుంది. నువ్వు మాతో ఇక్కడ కొంత సేపు గడుపుతావు. కొన్ని విచిత్రాలు చూస్తావు. పవిత్ర భారతదేశం గురించి కొన్ని నిజాలు తెలుసుకుంటావు. ఆ తర్వాత ఇక్కణ్నించి బయటపడతావు. అపైన అదృష్టముంటే బ్రతుకుతావు...." అన్నాడు స్కల్.

భానోజీరావు అంతా మౌనంగా విన్నాడు.

* * *

"ఇది థియేటర్!" అన్నాడు స్కల్. అక్కడ చలనచిత్ర ప్రదర్శనకు అనువైన ఏర్పాట్లన్నీ వున్నాయి.

ఓ పాతిక కుర్చీలు కూడా వున్నాయి.

కుర్చీల్లో స్కల్, భానోజీరావు కూర్చున్నారు.

ఎదురుగా వెండి తెర!

ఉన్నట్టుండి గది చీకటైపోయింది. వెండితెర మరింత ప్రకాశవంతమైంది.

భానోజీరావు సినిమా చూస్తున్నాడు.

ముందు ఏదో సబ్బుల కంపెనీ అడ్వర్టయిజ్మెంట్!

ఓ ప్రముఖ చలనచిత్ర తార ఆ సబ్బు తన సౌందర్యా

స్నేలా పెంచిందో వివరించింది. ఆమె స్నానం చేస్తున్న దృశ్యాలు ఎక్కడా అసభ్యత లేకుండా చిత్రీకరించబడ్డాయి. అది ముగియగానే—"ఇది ప్రజలకోసం అన్న వాక్యాలు వచ్చాయి. ఆ తర్వాత తెరమీద ఓ ముఖం కనబడింది. తెర వెనుకనుంచి వ్యాఖ్యానం వినబడసాగింది.

"ఈయన ప్రముఖులు. ఫిలిం సెన్సార్ బోర్డు మెంబరు. చలనచిత్రాల్లో అసభ్యతను ఏమాత్రమూ సహించరు. వీరి కారణంగా భారతీయ చలనచిత్రాల్లో నైతిక విలువల స్థాయి పడిపోకుండా ఆగిపోయింది....ఏదైనా చలనచిత్రం చూసినపుడు వీరు కొన్ని అభ్యంతరాలు చెప్తూంటాడు. ఆ అభ్యంతరాలు చెప్పకోదగ్గవికాదని నిర్మాతలు వారిని కన్విన్స్ చేయాలి. అదెలాగంటే?"

వ్యాఖ్యానం ఆగిపోయింది.

ఫిలింసెన్సార్ బోర్డు మెంబరు యిప్పుడు నడుస్తున్నాడు. ఆయన ఓ గదిలో ప్రవేశించాడు. ఆ గదిలో....

ఇందాకా సబ్బు గురించి ప్రచారం చేసిన తార వున్నది.

ఇద్దరూ పరస్పరం చూసుకున్నారు.

మళ్ళీ వ్యాఖ్యానం ప్రారంభమయింది. వ్యాఖ్యానం తెరమీది నటుల నటనకు అనుగుణంగా వున్నది.

"సిద్ధమేనా—అంటున్నారు గౌరవసభ్యులు. సిద్ధమే అంటున్నది తారామణి. నా చిత్రంలో మీకు కనబడిన అభ్యంతరాలేమిటి—అంటున్నది నటీమణి. నిన్ను చూస్తే ప్రజల మనసులో ఎలాంటి సంచలనం కలుగుతుందో చూడాలని వచ్చాను—అంటున్నారు గౌరవ సభ్యులు.."

వ్యాఖ్యానం కొనసాగుతున్నది. భానోజీరావు చూస్తు న్నాడు.

అతడు....ఆమె....

ఇద్దరూ పక్కనే వున్న స్నానాల గదిలో ప్రవేశించారు.

అదే గది....

ఇందాకా సబ్బుల కంపెనీ అడ్వర్టయిజుమెంటు కుపయోగపడిన స్నానాల గది....

తార స్నానానికి సిద్ధపడుతున్నది.

సెన్సారుబోర్డు సభ్యుడు చూస్తున్నాడు.

ఆమె బట్టలు విడిచింది. షవరు తిప్పింది. స్నానం చేస్తున్నది.

ఆమె చేతిలో సబ్బు. అదే సబ్బు! ఇందాకా ప్రచారాని కుపయోగపడిన సబ్బు....ఆ సబ్బుతో ఆమె ఒళ్ళు రుద్దుకుంటున్నది.

ఇందాకటి చిత్రానికీ ఈ చిత్రానికీ తేడాలేదు. ఎటొచ్చీ ఇందులోని కొన్ని సన్నివేశాలు మాత్రమే అందులోకి తీసుకోబడినాయి.

నటీమణిపై కెమేరా వేగంగా తిరుగుతున్నది. ఆమె సభ్యంగా కనబడినపుడు—ఇది ప్రజలకోసం....అనీ అసభ్యంగా కనబడినప్పుడు—ఇది గౌరవసభ్యునికోసం....అనీ వ్యాఖ్యాత చెబుతున్నాడు.

తార స్నానం ముగిసింది.

తెరమీద చీకటి....

గదిలో వెలుగు....

"తర్వాతేం జరిగిందో నీవు తెలుసుకోనవసరంలేదు. ఆ తార నటించిన సినిమా సెన్సారయిందని గ్రహిస్తే

చాలు....” అన్నాడు స్కాల్.

“ఏమిటిదంతా?” అన్నాడు భానోజీరావు.

“కొందరు తమ పదవులనెలా దుర్వినియోగం చేస్తున్నారో తెలుసుకునేందుకు ఇదో మచ్చుతునక...” అన్నాడు స్కాల్.

“ఇది నువ్వు బయటపెట్టవా?” అన్నాడు భానోజీరావు.

“బయట పెట్టడంవలన ప్రయోజనం?”

“ఒక దోషి నిరూపించబడతాడు....”

“దోషి ఒక్కడే అయినప్పుడు నీవు చెప్పింది నిజం.”

“అంటే?”

“దోషికి పదవి వచ్చిందని నీవనుకుంటున్నావు. పదవి వచ్చిన ప్రతివాడూ దోషిగా మారుతున్నాడని నేను గ్రహించాను....”

“అయితే ఏం చేస్తావు?”

“దోషిని బయటపెట్టి నేను చేయగలిగిందేమీ లేదు. అందుకే దోషిని అదుపులో వుంచే సాధనాలకోసం వెతుకుతున్నాను నేను. ఆ గౌరవ సభ్యుడు కూడా తను నటించిన ఈ చిత్రం చూశాడు. నేనంటే అతడికిప్పుడు భయం!”

భానోజీరావు ఆలోచనలో పడ్డాడు.

“లైట్సాఫ్!” అన్నాడు స్కాల్.

మళ్ళీ గదిలో చీకటి.

తెరమీద వెలుగు....

ఆ వెలుగులోంచీ ఒక ప్రముఖ రాజకీయ నాయకుడు.

వ్యాఖ్యానం ప్రారంభమయింది.

“దేశానికి ప్రధానమంత్రి కావాలన్నది ఈయన కల.

అది తీరడం కోసం ఏమైనా చేయాలన్నది ఈయన సంకల్పం. ఈయన సంకల్పబలం అసామాన్యం. ఈయన ఇప్పుడెవరితో మాట్లాడుతున్నారో చూడండి...."

ఉన్నట్లుండి తెరమీద ఓ విదేశీయుడు కనిపించాడు. వ్యాఖ్యాత అతడు సీఐఏ ఏజెంట్ అని చెప్పాడు.

ఆ నాయకుణ్ని భానోజీరావు గుర్తించాడు. అతడు ఒక్కసారి కూడా ప్రధానమంత్రి కాకపోయినా— అయే అవకాశమున్నదని కూడా ఎవరూ అనుకోవడం లేదు. దేశ వ్యాప్తంగా అతడి పేరు ప్రచారంలో లేదు.

సీఐఏ ఏజంటుకు అతడు భారత దేశానికి సంబంధించిన కొన్ని రహస్యాలు చెబుతున్నాడు. అతడు వింటున్నాడు. వినడం పూర్తయ్యాక అతడో కాగితం ఇచ్చాడు. నాయకుడు దానిమీద ఓ అంకె వేశాడు.

ముప్ఫైవేల డాలర్లు.

అవి స్విస్ బ్యాంకిలోకి వెడతాయి.

వ్యాఖ్యాత కొనసాగిస్తున్నాడు — "ఈ నాయకుడి వెనుక అసలైన మరో ప్రముఖనాయకుడున్నాడు.... వీరిద్దరూ కలిసి...."

మళ్ళీ తెరమీద చీకటి....

గదిలో వెలుగు.

"ఇదీ మన దేశాన్నేలే ప్రజానాయకుల కథ...." అన్నాడు స్కల్.

"అంటే?" అన్నాడు భానోజీరావు.

"దేశభక్తి ప్రజలకోసం. దేశం నాయకుల కోసం. నీ దగ్గరున్న బంగారాన్ని నువ్వు అమ్ముకోవచ్చు. తాకట్టు పెట్టుకోవచ్చు. యేమైనా చేయవచ్చు .... నాయకులు దేశాన్ని స్వంత ఆస్తిలా వాడుకుంటున్నారని చెప్పడానికి

ఇదో మచ్చుతునక మాత్రం...."

భానోజీరావు మనసేదోలాగై పోయింది.

"మిష్టర్ భానోజీరావ్! ఇలాంటి ఆధారాలు నావద్ద కోకొల్లలు...."

"ఎలా సంపాదించావివన్నీ...." అన్నాడు భానోజీరావు.

"అది నీకు అనవసరం. కానీ నేను నిన్నో విషయం అడగదల్చుకున్నాను. నావద్దనున్న ఆధారాలలో కొన్ని నీకిస్తాను. ఏమైనా చర్య తీసుకోగలవా?" అన్నాడు స్కల్.

"ష్యూర్!" అన్నాడు భానోజీరావు ఉత్సాహంగా.

"అప్పుడేమవుతుందో తెలుసా?"

"బహుశా నాకు ప్రమోషన్ వస్తుంది...." అన్నాడు భానోజీరావు.

"అవును ప్రమోషనే.... మోహన్ కు ముందు అయిదుగురు ఇన్ స్పెక్టర్సుకు ఈ లోకంనుంచి ఆ లోకానికి ప్రమోషన్ వచ్చింది...." అన్నాడు స్కల్.

"ఏమిటీ?" అన్నాడు భానోజీరావు.

"వాళ్ళకు చిలక్కి చెప్పినట్లు చెప్పాను. దేశభక్తి అనే ఆవేశానికిలోనై తప్పటడుగులు వేయవద్దని! వాళ్ళు వినలేదు. ఫలితాలకు భయపడకుండా దోషుల్ని బయట పెడతామన్నారు. ఫలితంగా సాక్ష్యాలతోసహా దగ్ధమై పోయారు. కావాలంటే అందుకూ ఋజువులు చూపించగలను...." అన్నాడు స్కల్.

మళ్ళీ గదిలో చీకటి....

తెరమీద వెలుగు....

ఈ పర్యాయం భానోజీరావుకూ జ్ఞానోదయమైంది.

"లైట్సాన్...." అతి దే అరిచాడు.

* * *

"మరీ ఇంత ఘోరమా? అన్నీ తెలిసికూడా...."

"ఈ దేశంలో అన్నీ అందరికీ తెలిసే జరుగుతున్నాయి. అయినా ప్రజలు తెలిసి కూడా దోషులకే పట్టం కడుతున్నారు...." అన్నాడు స్కల్.

"ఇంతకీ నీ ఆశయం ఏమిటి?"

స్కల్ నవ్వి — "మనిషి అసలు స్వరూపం అస్థిపంజరం. దానిచుట్టూ రక్తమాంసాలు పోగై చర్మం కప్పితే మనిషి అవుతున్నాడు. ఆరంభంలో వున్నదీ, చివరకూ మిగిలేదీ అస్థిపంజరం మాత్రమే! మానవ జీవితానికి సంబంధించిన యథార్థానికీ హెచ్చరికగా వుండే స్కెలిటన్ పేరును నేను స్వీకరించాను. అందులో స్కల్‌ను నేనయ్యాను. అస్థిపంజరం భయంకరంగా, అసహ్యంగా వుండవచ్చు. ప్రతి మనిషిలోనూ అటువంటి యథార్థాలుంటాయి. ఆ యథార్థాల విషయంలో హెచ్చరిస్తూ—వారిని అదుపులో వుండడంకోసమే స్కెలిటన్ గ్రూపు ప్రారంభమైంది—" అన్నాడు.

"ఇంత పకడ్బందీగా వ్యవహారాలు నడుపగలుగుతున్న నువ్వు ఆ నేరాలను నువ్వెందుకు బయట పెట్టలేకపోతున్నావు?" అన్నాడు భానోజీరావు.

"దీనికి జవాబు ముందే చెప్పాను...." అన్నాడు స్కల్—"దేశ నాయకులందరూ ఇంచుమించు దోషులే అయినప్పుడు అది బయటపెట్టడంవల్ల దేశంలో అరాచకమేర్పడుతుంది—"

భానోజీరావు ఆలోచిస్తూ—"అదీ నిజమే! అయితే మీ స్కెలిటన్ గ్రూపుకు చెడ్డపేరు రావడానికి

కారణం?" అనడిగాడు.

"అసలు మా గ్రూపు ఎక్కడా దేశవిద్రోహకర కార్యకలాపాల్లో పాల్గొనడం లేదు. అయితే దేశ విద్రోహకర శక్తులు పాలకవర్గంలో ప్రముఖ స్థానాలు వహించి వుండడంవల్ల ఏదోవిధంగా మా గ్రూపును దెబ్బ తీయాలని చాలామంది చూస్తున్నారు. ఎక్కడ ఎటు వంటి నేరం జరిగినప్పటికీ మా గ్రూపును ఇరికించాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రత్యక్షంగా మాపై చర్య తీసుకునే దమ్ములెవరికీ లేవు. అందుకని అవకాశం వచ్చినపుడల్లా ప్రతివారూ మా పేరు ఉచ్చరిస్తూంటారు. ఇందువల్ల ఎన్నో కేసులు తప్పుదారినిబట్టి పరిష్కరించ బడకుండా వుండిపోతున్నాయి—" అన్నాడు స్కల్.

"ఇప్పుడు నేనేం చేయాలి?" అన్నాడు భానోజీరావు.

"అది నీ అదృష్టం నిర్ణయిస్తుంది-" అన్నాడు స్కల్.

## 10

భానోజీరావుకు మెలకువవచ్చేసరికి ఓ గదిలో మంచం మీద వున్నాడు. అతడు గది పరిశీలించి చూసి ఆశ్చర్య పోయాడు.

ఆ గది ఎక్కడో చూసినట్లుంది.

"నేనిప్పుడెక్కడున్నాను?" అన్నాడు భానోజీరావు అప్రయత్నంగా.

"మనింట్లో నే—" ఓ గొంతు వినిపించింది.

"అరే— ఈ గొంతు కూడా ఎక్కడో విన్నట్లుందే" అన్నాడతను.

"ఎక్కడో విన్నట్లుండడమేమిటండీ — నేను మీ భార్యనైతే...."

"భానోజీరావుకు మత్తు పూర్తిగా విడిపోయింది.

తనిప్పుడు తిన యింట్లో తన భార్య సమక్షంలో వున్నట్లు గు ర్తించాడతను.

"నేనిక్కడికెలా వచ్చాను?"

"ఇద్దరు కాన్‌స్టేబుల్సు మిమ్మల్ని స్పృహలేని స్థితిలో ఇంట్లో అప్పగించి కంగారేమీ లేదని చెప్పి వెళ్ళారు. అసలేం జరిగిందండీ—" అన్నదామె.

భానోజీరావుకు ఆశ్చర్యంగా వున్నది. తను చూసింది కలా, నిజమా అన్న సందిగ్ధంలో పడ్డాడతను. భార్యతో ఏమీ చెప్పకుండా క ర్తవ్యం గురించి ఆలోచిస్తున్నాడతను. అతడు తీవ్రాలోచనలో వున్నాడని గు ర్తించి శ్రీమతి కూడా అతన్నింక మాట్లాడించలేదు. అయితే కొద్దిక్షణాల్లోనే ఆమె రావలసి వచ్చింది. అతణ్ని మాట్లాడించవలసీ వచ్చింది.

"మీకోసం ఎవరో వచ్చారు!"

"పేరు...."

"మోహన్...."

భానోజీరావు చటుక్కున లేచాడు. అతడికి మోహన్‌తో మాట్లాడవలెనని ఆత్రుతగా వున్నది.

తను కొందరు ప్రముఖుల రహస్యాలు తెలుసుకున్నాడు. ఇప్పుడేం చేయాలి?

మోహన్‌కి కూడా తనకులాంటి అనుభవమే ఎదురయిందా?

స్కెలిటన్ గ్రూప్ విషయమై ఏం చేయాలి?

అతను హాల్లోకి వెళ్ళాడు.

"హల్లో భానోజీరావ్! నీ కేసు నేను పూ ర్తి చేశాను...." అన్నాడు మోహన్.

"నా కేసు ఏమిటి?"

"గోపాలం హత్యకేసు...."

భానోజీరావు ఆ విషయమే మరిచిపోయాడు. గోపాలం పేరు వినగానే ఉలిక్కిపడ్డాడు.

"పూర్తి చేశావా—అది యాక్సిడెంటేనా?"

"కాదు—హత్య ..."

"హంతకుడెవరు?"

"డ్రైవర్ రాములు...."

"మోటివ్ ...."

"డబ్బు...."

భానోజీరావు కుర్చీలో కూలబడి—"కాస్త వివరంగా చెప్పు—" అన్నాడు.

"పదివేలకోసం రాములు ఈ హత్య చేశాడు...." అన్నాడు మోహన్.

"ఊఁ" అన్నాడు భానోజీరావు.

"సుధ సత్యాన్ని ప్రేమించింది. సత్యమంటే శేఖరానికి ద్వేషం. అందుకని చెల్లెల్ని గోపాలానికిచ్చి చేయాలనుకున్నాడు. అయితే అప్పటికే వాళ్ళిద్దరూ శారీరకంగా ఒకటైనారని తెలియడంతో శేఖరం అప్సెట్టయ్యాడు. అతడివద్ద డబ్బేమీ లేదు. గోపాలం అకౌంట్లో జతపడిన లక్షాయాభై వేలూ శేఖరం స్వంతం అవాలంటే గోపాలం చావాలి. ముగ్గురూ కలిసి పథకం వేశారు. సత్యం డ్రైవర్ రాముల్ని పట్టాడు. అంతా కలిసి హత్య జరిపించేశారు. గోపాలం పోగానే నువ్వు రంగంలోకి దిగావు. సగం నిజం, సగం అబద్ధం చెప్పి ముగ్గురూ నిన్ను కన్ఫ్యూజ్ చేశారు. పరస్పర ద్వేషం వున్నట్లుగా వాళ్లు నటించినా అది నటన మాత్రమే! డ్రైవర్ రాములుతో సహా అందరి దగ్గర్నుంచీ వాఙ్మూ

లాలు తీసుకుని రికార్డు చేశాను—" అన్నాడు మోహన్.

"సత్యాన్నీ, శేఖరాన్నీ ఎలా అనుమానించావ్!" అన్నాడు భానోజీరావు.

"అనుమానించడమెందుకు—కేసు స్పష్టంగా కనబడుతూంటే! కేవలం స్కెలిటన్ గ్రూపు కారణంగా నీ బుర్ర పెడదారి పట్టింది...." అని—"మైడియర్ ఫ్రెండ్ ఒకే విషయం గుర్తుంచుకో నువ్వు. ఎప్పుడైనా ఎవరైనా ఇద్దరు ఒకే కేసులో నీ అనుమానాన్ని స్కెలిటన్ గ్రూపుమీదకు తోయడానికి ప్రయత్నించారో—వాళ్ళిద్దరూ లాలూచీ అని గ్రహించు—" అన్నాడు మోహన్.

"మెనీ—మెనీ—థాంక్స్...." అన్నాడు భానోజీరావు ఓ నిర్ణయానికివస్తూ.

—:అయిపోయింది:—

# పడగ విప్పిన తాచుపాము

బొమ్మిడి అచ్చారావు

ఆ దృశ్యం చూడలేక కళ్ళు మూసుకున్నాడు డిటెక్టివ్ కిరణ్. హంతకుడు నరరూప రాక్షసుడో ఆటవిక జాతికి చెందిన అనాగరికుడో అయ్యుంటాడు. అంత ఘోరమైన హత్య కిరణ్ యిదివరకు చూడలేదు.

మొత్తం శరీర భాగాలన్నీ మెడికల్ స్టూడెంట్సు డిసెక్ట్ చేసినట్టు ప్రతిభాగాన్ని ఖండించాడు హంతకుడు. చేతులు, కాళ్ళు, కళ్ళు, ముక్కు, చెవులులాంటి పై భాగాలే కాకుండా శరీరాంతర్భాగంలోని గుండె, కాలేయం, మెదడులాంటి భాగాలు కూడా విడివిడిగా పార్సిల్ చేశాడు.

"ఎవరిదీ శవం?" అడిగాడు కిరణ్ దృష్టి మరల్చుకుని.

"పోలికలు కూడా తెలీకుండా ముక్కలు ముక్కలు చేసి పంపాడు కదా! గుర్తుపట్టడం కష్టమే! కాని, కొన్ని ఆధారాల్నిబట్టి చూచాయగా గుర్తుపట్టేరు మావాళ్లు?" అని ఆగాడు ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్.

"ఏమిటా ఆధారాలు?"

"ఇదిగో, యీ చీటీలో నాలుగు వాక్యాలు రాయబడి వున్నాయి, చూశావా? దీన్నిబట్టి ఏదో రహస్య ముఠాని పట్టుకోవటానికి వారంరోజుల క్రితం బొంబాయి వెళ్ళిన సి.బి.ఐ. ఏజెంటు దివాకర్‌ది కావచ్చునని ఊహిస్తున్నారు."

కిరణ్ చీటీ అందుకుని చదివాడు.

"మా కర్యకలాపాల్లో తల దూర్చాలని ప్రయత్నించినా, భంగపరచాలని ప్రయత్నించినా వీడికి పట్టిన దుర్గతే మీ డిపార్టుమెంటులోని ప్రతి ఒక వ్యక్తికీ పడుతుంది. బీ కేర్‌ఫుల్. మమ్మల్ని పట్టుకోవాలని ప్రయత్నించవద్దు. ఇది మీ అందరికీ హెచ్చరిక!" అని వుందా చీటీలో.

"దివాకర్ ఎప్పుడు వెళ్ళాడు?" ఆ ముఠా వివరాలేమిటి? ఈ పార్సెల్ ఎప్పుడొచ్చింది? ఎవరు తెచ్చారు దీన్ని?" ప్రశ్నల వర్షం కురిపించాడు కిరణ్.

"ఇది సరాసరి మన క్రైంబ్రాంచ్ ముందు గతరాత్రి గురు తెలీని మనుషులు వేన్ లోనించి కిందికి తోసేసి వెళ్ళిపోయారు. చెక్కపెట్టెలో జాగ్రత్తగా ఫాక్ చేసి పడేశారు. డ్యూటీ సెంట్రీ చూశాడు. పైన సిటీ క్రైం బ్రాంచ్ పేరుంది. వెంటనే కమిషనర్‌కి, డి.జి.పి.కి, ఎస్పీకి మెసేజెస్ వెళ్ళాయి. అందరి సమక్షంలోను దీన్ని పగలకొట్టారు. లోపల ఈ ఖండాలతోబాటు చీటీ దొరికింది.

"అప్పటికి వారంరోజుల క్రితం దివాకర్ బొంబాయి వెళ్ళాడు—ఓ స్మగులింగ్ ముఠా ఆచూకీ తెలుసుకోవటానికని! దేశంలోని ఓడరేవులన్నిటిద్వారా స్నేక్ లెదర్

యింకా కొన్ని ప్రొహిబిటెడ్ గూడ్స్ అక్రమ రవాణా అవుతున్నాయి విదేశాలకు. వాటిలో యీ ముఠా అగ్రస్థానం వహిస్తోంది. దాని ఆచూకీ తెల్సుకోవటం కోసం దివాకర్ వెళ్లాడు. మొదటి రెండు రోజులు—అతన్నుంచి ఇన్వెస్టిగేషన్ బ్యూరోకి మెసేజెస్ వచ్చాయట. తర్వాత అకస్మాత్తుగా కాంటాక్టు బ్రేకయిపోయాయి. ఇంతలో యీ పార్సిల్ వచ్చి పెద్ద దుమారం లేపింది" చెప్పాడు శ్రీనివాస్.

"అయితే, హతుడెవరైనదీ కన్ఫర్మ్ అయినట్టే!"

"ఇంకా పూర్తిగా నిర్ధారణ కాలేదు. దివాకర్ వీపుకి కుడిపక్కన, ఎడమచేయి మణికట్టువద్ద ఐడెంటిఫికేషన్ మార్కులు వుండాలి. కాని సరిగ్గా ఆ ప్రదేశాల్లో చర్మం చీరెయ్యబడింది. మార్కులు దొరకలేదు. ముఖం అసలే గుర్తు తెలీకుండా కళ్ళు చెవులు ముక్కు కోసేశారు. అతను వేసుకువెళ్ళిన దుస్తులు అసలు శవఖండాలతో పాటు లేనేలేవు! దంతనిర్మాణం, తల వెంట్రుకలనుబట్టి నిర్ధారణ చేయటానికి నిపుణులు ప్రయత్నిస్తున్నారు. ఇంకా పరిశోధన సాగుతోంది."

"దివాకర్ వివరాలేమిటి?"

"అతను బ్రహ్మచారి. వయసు ముప్ఫయి దాటింది. అతనికో గర్ల్ ఫ్రెండ్ వుంది. పేరు శకుంతల. ఈ సీజన్లో పెళ్ళిచేసుకోవటానికి నిర్ణయించుకున్నారు. అతనికి తల్లి, ఓ తమ్ముడు వున్నారు. ముగ్గురు యిక్కడే డిపార్టుమెంటల్ క్వార్టర్సులో వుంటున్నారు."

"శకుంతల ఏం చేస్తుంటుంది? ఆమె వుండేది ఎక్కడ?"

"ఆమె టెలిఫోన్స్‌లో పనిచేస్తోంది. పి అండ్ టి కాలనీలో క్వార్టర్సులోనే వుంటోంది. ఒంటరిది. వెనక ముందు ఎవరూ లేరని వినికిడి."

"దివాకర్‌కి ఆమెకి పరిచయమేలా జరిగింది? వాళ్ళిద్దరు విచ్చలవిడిగా తిరుగుతుండేవాళ్ళా? దివాకర్ గురించిన పర్సనల్ విషయాలు ఆమెకి బాగా తెలిసే వుండాలి..!"

"తెలిసుండొచ్చు. నేను వివరాలు సేకరించలేదు. ఎందుకంటే శవం దివాకర్‌దని యింతదాకా నిర్ధారణే జరగలేదుకదా! అందుకే దివాకర్ తల్లికి తమ్ముడికిగాని, శకుంతలకిగాని విషయం యింతదాకా తెలియపర్చలేదు."

"దట్స్ గుడ్! నిపుణుల పరీక్ష పూర్తయ్యాక మన పరిశోధన ఏ కోణంలో మొదలుపెట్టాలో నిర్ణయించుకుందాం" అంటూ లేచాడు కిరణ్.

ఇంతలో ఫోన్ మోగింది. శ్రీనివాస్ అందుకున్నాడు అవతలివైపు నుంచి. మెసేజ్ వింటూనే కుర్చీలోంచి హడావిడిగా లేచాడు శ్రీనివాస్.

"ఇప్పుడే బయల్దేరి వస్తున్నాను" అంటూ ఫోన్ పెట్టేసి హేట్ తగిలించుకున్నాడు శ్రీనివాస్. "పి అండ్ టి కాలనీలో ఎవరో కిరసనాయిలు మీద పోసుకుని తగలబెట్టుకున్నారట. మంటలు బయటకు వ్యాపించటంతో ఫైర్ సర్వీస్‌కి ఫోన్ చేసి యిటు మనక్కూడా చేశారు కాలనీవాళ్ళెవరో!" అన్నాడు.

"శకుంతల కాదుగదా!" అన్నాడు కిరణ్.

దెబ్బతిన్నట్టు చూశాడు శ్రీనివాస్. "తొందరలో వివరాలడగనేలేదు. ఆడో మగో కూడా తెలీదు. ఎనీవే, వెళ్తున్నాంకదా! అన్నీ తెలుస్తాయి. శకుంతల కాదని, కాకూడదనీ కోరుకుంటున్నాను. మన కేస్‌కి మూలా

ధారం ఆమే ప్రస్తుతం!" అంటూ హడావిడిగా స్టాఫ్‌కి ఆదేశాలిచ్చాడు శ్రీనివాస్.

"కమాన్ బ్రదర్! నీ టయోటా వదిలెయ్యి, జీప్‌లో పోదాం" అన్నాడు శ్రీనివాస్.

## 2

పదిహేను నిమిషాల్లో శ్రీనివాస్ బలగం ఎక్కిన జీపు పి అండ్ టి కాలనీ క్వార్టర్సు చేరుకుంది.

అప్పటికి ఫైర్ యింజన్‌లు మంటలనార్పేశాయి. ప్రమాదం జరిగింది మూడో అంతస్తుపైన.

కిరణ్ శ్రీనివాస్ మూడో అంతస్తులోని బర్నింగ్ కేసున్న క్వార్టరుకి చేరారు. అక్కడ జనం బాగా గుమికూడివున్నారు. కిటికీనుంచి పొగలు యింకా వస్తూనే వున్నాయి. తలుపులు, కిటికీ తలుపులు నల్లగా కాలిపోయాయి.

శ్రీనివాస్ ఆదేశానుసారం కానిస్టేబుల్స్ తలుపులు పగలకొట్టారు. వెంటనే వూడివచ్చేశాయి.

లోపల పూర్తిగా కాలిపోయిన శవం! ఒళ్ళు కాలిన వాసన ముక్కుపుటాల నదరగొట్టుతోంది. మాంసం కూడా బాగా కాలి వుడికిపోయింది. దాదాపు పూర్తిగా తగలబెట్టిన శవంలా వుంది.

వరసగా దారుణంగా చచ్చిన శవాల్ని రెండు చూడటంతో కిరణ్ కడుపులో తిప్పింది.

పక్క పోర్షన్ అతను చెపుతున్నాడు.

"ఓ అరగంట క్రితం ఏదో వాసన వస్తూనట్టు పసికట్టిందట సార్ మా ఆవిడ. అందరం ఆఫీసులకి వెళ్ళిపోయాం. ఆడవాళ్ళు కూడా చాలామంది ఉద్యోగస్థులే

కావటంతో యిళ్ళ దగ్గర వుండేవాళ్ళు అరుదు. వాసన వెనకనే మంటలు హెచ్చుగా కనిపించాయట కిటికీలో నుంచి. వెంటనే మా ఆవిడ నలుగుర్ని కేకలు పెట్టి పిలిచింది. ఈ ఒక్క పోర్షన్‌తో బాటు తక్కిన క్వార్టర్సుకి కూడా మంటలు వ్యాపించటంతో భయపడి అందర్నీ ఫోన్ మీద పిలిపించారు అందరు ఆడవాళ్ళు కలిసి. తర్వాత ఫైర్ సర్వీస్‌కి, మీకు కబురు చేశాం."

"అది సరే, అసలు యీ శవం ఎవరు?"

"శకుంతల అని, ఆపరేటర్ సార్! టెలిఫోన్‌లో."

కిరణ్ సాలోచనగా చూశాడు శ్రీనివాస్ వంక. శ్రీనివాస్ యిబ్బందిగా చూశాడు.

"కిరసనాయిలు పోసుకుని తగలబెట్టుకుందని ఎలా అనుకున్నారు?" అడిగాడు కిరణ్.

"సాధారణంగా బర్నింగ్ కేసులన్నీ ఇదే తంతులో నడుస్తాయికదా సార్! అందుకని అలా వూహించాం."

"ఆమె ప్రమాదవశాత్తూ తగలబడి వుండొచ్చు కదా!" అన్నాడు శ్రీనివాస్.

పక్కింటాయనకి కొంచెం కోపం వచ్చినట్టుంది?

"అవన్నీ చూసుకోవలసింది మీరు! మా సివిల్ డ్యూటీ మేం చేశాం. నయం, సమయానికి ఫైర్ సర్వీస్ రాకుంటే బిల్డింగంతా నేలమట్టమై పోయుండేది. మంటల్లో కాలి" అన్నాడతను.

శ్రీనివాస్‌కి అతను తమ డిపార్టుమెంటు అసమర్థతని ఎత్తిపొడుస్తున్నట్టనిపించింది.

"ఆల్ రైట్! అది మేం ఇన్వెస్టిగేట్ చేస్తాం. శకుంతలని చివరిసారిగా యెవరు చూశారు? ఆమె ఆఫీసు అవర్సులో క్వార్టర్లో ఎందుకుంది? మీకెవరికైనా తెలిస్తే

చెప్పండి!" అన్నాడు కిరణ్.

"ఆమె కీరోజా పీకీ ఆవ్ సార్! అంచేత యింట్లోనే వుంది. ఉదయంనించీ ఆమె ఇంట్లో వుండగా అందరమూ చూశాం" అన్నాడు యిందాకటి ఆయనే.

"థాంక్యూ! ఆమెకోసం ఉదయంనించీ యెవరైనా వచ్చారేమో చెప్పగలరా?"

"మా ఆవిడనడిగి చెపుతానుండండి" అని పక్కనే వున్న భార్యని కనుక్కొని "లేదు సార్, యెవరూ రాలేదుట!" అన్నాడాయన.

"థాంక్యూ ఒన్స్ ఎగెయిన్" అని కిరణ్ శ్రీనివాస్ వంక చూసి, "పద, లోపల పరిశీలిద్దాం" అన్నాడు.

గదంతా కాలిపోయింది. పక్క, గుడ్డలు, పరుపు, ఛెయిర్స్, టేబిలు, కర్టెన్స్, సూట్ కేసులు అన్నీ దాదాపు తగలబడిపోయో, సగం సగం తగలబడో వున్నాయి. పుస్తకాల రాక్‌లోని పుస్తకాలు కూడా చాలావరకు తగలబడ్డాయి.

కిరణ్ శవానికి చుట్టుపక్కల కిరోసిన్ టిన్స్‌కోసం చూశాడు. అయిదు లీటర్లుపట్టే జెర్రీకేన్ వుంది. అది కూడా చాలావరకు తగలబడి ముద్దగా అయింది. దాన్ని తీసిచూశాడు. వాసన కిరోసిన్‌ది కాదు— పెట్రోలుది!

వెనకనున్నగది వంటగది. దాంట్లో ఎక్కడా కిరోసిన్ స్టవ్‌లు లేవు. గాస్ పొయ్యి వుంది. మంటలకి సిలిండర్ పేలిపోనందుకు ఆశ్చర్యం కలిగింది కిరణ్‌కి. దగ్గరకుపోయి కదిపి చూశాడు. గాస్ లేదు. ఖాళీ సిలిండరు.

మంటలు ఆ గదికి కూడా పాకాయనటానికి నిదర్శనంగా అక్కడి వస్తువులు కూడా సగం సగం కాలి వున్నాయి. గదంతా ఫైర్ యింజన్‌లు వెదజల్లిన నీటితో

చి తడిగా తయారయ్యాయి.

"ఫైర్ సర్వీస్ చాలా సిన్సియర్ అని పక్కింటావిడ చెప్పటమే కాదు, నేనూ చెబుతున్నాను" అన్నా కిరణ్.

శ్రీనివాస్ ఏమిటన్నట్టు చూశాడు.

"మంటలు గదుల్లోపల ప్రజ్వరిల్లుతున్నా కిటికీ గుండా వాటి నడుపుల్లోకి తేచ్చారే గాని, పొరపాటు కూడా గదుల్లోకి ప్రవేశించలేదు."

"మంటలు ప్రారంభదశలో నే వుండివుంటాయి!" శ్రీనివాస్‌కి వాళ్ళది పైచేయి కావటం యిష్టంలేదు.

"ప్రారంభదశ కాదు చివరిదశలో వున్నాయి మంటల శవం బొగ్గులా మాడిపోయి చాలా భాగం మాంసంకూడ కాలిపోయింది. గదుల్లో వస్తువులు దాదాపు పూర్తి కాలిపోయాయి. గమనించలేదా?" అన్నాడు కిరణ సన్నగా నవ్వి.

"ఆల్ రైట్! ఇది ఆత్మహత్యేనంటావా? ఆదేఅయి శకుంతల యెందుకీ పని చేసింది? దివాకర్ గురించిన నిః ఏదయినా తెలిసిందా? మనకి రాసిన ట్టే ఆమెకు కూడ దుండగులు ఏదైనా లెటర్ రాశారా? అందులో దిః కర్‌ని చంపేసినట్టు రాసివుండాలి. అందుకే యీ భరించలేక ఆత్మహత్య చేసుకుని వుండొచ్చు" అన్నా శ్రీనివాస్.

కిరణ్ మాట్లాడలేదు.

శ్రీనివాస్ మళ్ళీ అన్నాడు. "ఇదే నిజమయితే శవం ఖచ్చితంగా దివాకర్‌దే అయివుంటుంది."

"మైడియర్ ఇన్‌స్పెక్టర్! శకుంతల ఆత్మహత్య చే

"లేదు, హత్య చేయబడింది!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ అదిరిపడి చూశాడతనివంక.

"గదిలోని ప్రతి వస్తువుమీద పెట్రోలు చిలకరించి శకుంతల ఎటూ తప్పించుకునే అవకాశంలేకుండా చేసి, అగ్గిపుల్ల గీసి తగలబెట్టేశాడు హంతకుడు!"

"శకుంతల యిల్లంతా పెట్రోలు చిమ్మి అనక అంటించుకుని వుండొచ్చుగా!"

"మైడియర్ ఇన్స్పెక్టర్! చావాలనుకున్న మనిషి తన వొంటిమీదే పెట్రోలుగాని, కిరోసిన్ గాని పోసుకుని తగలబడుతుందిగాని, ఇల్లంతా జాగ్రత్తగా పెట్రోలుతో తడుపుకోదు. నీ అనుమానం ఇప్పుడే నివృత్తి చేస్తానుండు!" అంటూ కిరణ్ బయటికొచ్చి, యిందాక సాక్ష్యం చెప్పి నాయన భార్యను పిలిచి అడిగాడు.

"చూడండమ్మా! మంటలు వచ్చినపుడు శకుంతల రక్షించమంటూ కేకలు పెట్టిందా?"

"ఆఁ! కేకలు వినిపించే నేను బయటికి వచ్చానండి. అప్పటికే మంటలు బాగా పెద్దవైపోయాయండి. రెండు నిమిషాల తర్వాత శకుంతల గొంతు వినిపించలేదండి!" అన్నదామె.

కిరణ్ శ్రీనివాస్ వంక చూసి మెల్లగా "ఆత్మహత్య చేసుకునే మనిషి మౌనంగా తనపని చేసుకుపోతుందిగాని రక్షించమని ఎందుకరుస్తుంది?" అన్నాడు.

శ్రీనివాస్ దొరికిపోయినట్టు చూశాడతనివంక.

"మీ నిపుణుల్ని రంగంలోకి దిగమను!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ తన సిబ్బందికి సూచనలిచ్చాడు.

# 3

"పాథాలజిస్టు రిపోర్టు వచ్చింది. డెంటల్ సర్జన్, మైక్రోబయాలజిస్టు రిపోర్టులు కూడా వచ్చాయి" అన్నాడు శ్రీనివాస్.

పోలీస్ స్టేషన్‌లో ఇద్దరు ఎదురెదురుగా కూచున్నారు.

"శవం దివాకర్‌ది కాదు, అవునా?" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ కళ్ళు పెద్దవిచేసి చూశాడు. "నీకెలా తెలుసు?"

"ఊహించాను. అదే నిజం కావాలనేం కాదు. యిలా కావచ్చునని ముందునించీ అనుమానిస్తున్నాను."

"అయితే అది దివాకర్ శరీరఖండాలని మనల్ని నమ్మించటానికి శత్రువులెందుకు ప్రయత్నించినట్టు?"

"మన కేసు పక్కదారి పట్టించటానికి! ఓ విధంగా డిపార్టుమెంటుని హడలగొట్టడానికి."

"వీళ్ళు గుండెలు తీసిన బంటుల్లా వున్నారే! కేసంతా తికమకగా తయారయింది."

"నో, దివాకర్ చనిపోలేదన్న విషయం యింకా నిర్ధారణ జరగాల్సి వుంది."

"అదేమిటి, అలా అంటావు? ఎక్స్‌పర్టు డెంటల్ సర్జన్ రిపోర్టు నిజంకాదని అనుమానిస్తున్నావా? మైక్రోబయాలజిస్టు మన స్టేట్‌లోనే కాదు, యావద్భారత దేశంలోను ప్రఖ్యాతిగాంచినవాడు!

"నో నో, నేను వాళ్ళిద్దర్లో ఎవర్నీ శంకించటంలేదు. శత్రువులు పంపిన శవఖండాలు దివాకర్‌వి కాదన్నమాట నిజమే! ఈ శవం దివాకర్‌ది కానంతమాత్రాన దివాకర్ ఎక్కడోచోట బతికే వున్నాడని మనం ఆశించటం

లోనూ తప్పులేదు. కాని తమ గుట్టు రట్టుచేయటానికి తమని వెతుక్కుంటూ వచ్చినవాడ్ని శత్రువులు మట్టు బెట్టకుండా వదలరన్న సంగతి మనమూ గుర్తుంచు కోవటం మంచిది."

"యు ఆర్ రైట్! దివాకర్ చాలా పేరు ప్రఖ్యా తులున్న సి.ఐ.డి. అతను గతంలో డిపార్టుమెంటుకి ఎనలేని పేరుతెచ్చిన కేసుల్ని పరిశోధించాడు. ఎంత రిస్క్ వున్న కేసునైనా ఒక్కడు భుజాలమీద వేసు కుని దాన్ని సాధించి తీర్తాడు. అతని గుండెబలం, దక్షత అలాంటివి!"

"అయితే, దివాకర్ ఉనికి తెలుసుకోగలిగితే మనం కేసులో ముందుకి చొచ్చుకుపోవటానికి స్కోప్ వుంది. శత్రువులు తెలివైనవాళ్ళు. దివాకర్ యీ భూమ్మీద లేడని నమ్మించటానికి చక్కటి పన్నాగం పన్నారు. నా వూహే నిజమైతే దివాకర్ చనిపోలేదు. బహుశా వాళ్ళకు చిక్కకుండా తప్పించుకు తిరుగుతుండవచ్చు."

"ఎలా చెప్పగలవు?"

"దివాకర్ వాళ్ళచేతికి చిక్కివుంటే నిర్దాక్షిణ్యంగా చంపేసి వుండేవాళ్ళు. ఇలా నకిలీ దివాకర్ శవాన్ని మనకి పార్సిల్ చేసే బదులు అసలు దివాకర్ శవాన్నే బహుమతిగా పంపించి వుండేవాళ్ళు! మనల్ని భయపెట్టి, కన్ఫ్యూజ్ చెయ్యాలనే ఉద్దేశ్యంతోనే అలాచేశారు."

"నాకూ అలాగే అనిపిస్తోంది.... సరే, యీ కేసు పరిష్కరించటానికి నువొక్కడివే సమర్థుడవని నిన్నే సెలక్టుచేశారు మా డిపార్టుమెంటు హెడ్స్. అంచేత నువ్వు దివాకర్ మొదలుపెట్టిన యిన్వెస్టిగేషన్ విజయ వంతంగా కొనసాగించి శత్రువుల ఆచూకీ తెలుసు

వాలి. నీకు యెలాంటి సహాయం కావలసినా చెయ్యమని డి.జి.పి. కమిషనర్ ఆఫ్ పోలీస్ మా డిపార్టుమెంటుకి ఆదేశాలిచ్చారు."

"ఓ.కే! మీ నమ్మకాలు వమ్ము చెయ్యను. ఈ రోజు నించే రంగం సిద్ధం చేసుకుంటాను. నువ్వు...."

కిరణ్ మాటలు పూర్తికాకుండానే టెలిఫోన్ గణ గణ మోగింది.

శ్రీనివాస్ అందుకుని, "హల్లో....ట్రంకాలా? ప్లీజ్ కనెక్టు...." అన్నాడు.

కిరణ్ భ్రుకుటి ముడిపడింది.

"ఎక్కడినించి కాల్?" అనడిగాడు.

"బొంబేనించి."

"అలాగా! దివాకర్ కావచ్చు. ఫోన్ ఇలా ఇవ్వు?" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ విస్మయంగా చూసి ఫోన్ అందించాడు.

"ఈజిట్ సిటీ క్రైం బ్రాంచ్?" అని వినిపించింది అవతలినుండి.

"ఎస్ ప్లీజ్!" అన్నాడు కిరణ్.

"అయామ్ ఎక్స్ జీరో టూ స్పీకింగ్!" అని వినిపించింది అవతలినుండి.

"ఎక్స్ జీరో టూ....?" అన్నాడు కిరణ్ ప్రశ్నార్థకంగా.

"అది దివాకర్ కోడ్ నెంబర్" అన్నాడు శ్రీనివాస్ గబగబ.

కిరణ్ సర్దుకుని, "హల్లో మిస్టర్ దివాకర్! హౌ ఆర్యూ?" అన్నాడు గొంతులో ఉత్సాహం నింపుకుని.

"అయామ్ ఆల్‌రైట్ ఫర్ టైం బీయింగ్! ఈజిట్

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్!"

"హలో, అయామ్ డిటెక్టివ్ కిరణ్ స్పీకింగ్!"

"వెరీ గ్లాడ్ టు హియర్ యూ మిష్టర్ కిరణ్! మీరయితే ఇక ఏ సమస్యా లేదు. మీరు వెంటనే నన్ను బాంబేలోని హోటల్ తాజ్‌లో కలవండి. రూం నంబర్ ఫోర్ త్రీ టూ. నేనిక్కడ వున్నట్టు బాంబే పోలీస్‌కి గాని, యిన్వెస్టిగేషన్ బ్యూరోకిగాని, యెవరికీ తెలీదు. కోడ్ ఎర్ర గులాబీ ఇంకా సంభాషణ పొడిగించటం ప్రమాదం. కట్ చేసేస్తున్నాను" అంటూ ముగించాడు దివాకర్.

కిరణ్ రిసీవర్ క్రెడిల్ చేస్తూ, "వెరీగుడ్! శత్రువుల ఆచూకీ తెలిసిపోయినట్టే! మిష్టర్ శ్రీనివాస్! మనం వెంటనే బాంబే వెళ్ళాలి. దివాకర్ మనకి చాలా విషయాలు చెప్పవచ్చు. నువ్వు మీ అఫిషియల్స్‌తో మాట్లాడి బాంబే పోలీస్‌కి రహస్యంగా మన ప్రయాణం గురించి మెసేజ్ పంపించేసేలా చూడు. శాంతాక్రజ్ ఏర్‌పోర్టుకి బుల్లెట్ ప్రూఫ్ కారు పంపించమని చెప్పు. ఆ కారు పోలీస్‌దని ఎవరూ గుర్తుపట్టకుండా జాగ్రత్తలు తీసుకోమను" అన్నాడు.

"ఆల్ రైట్! యిప్పుడే అన్ని ఏర్పాట్లు చేస్తాను. సార్జంట్ రాజుని, సార్జంట్ శివాన్ని బైపర్సన్ పంపి నువ్వు చెప్పిన ఏర్పాట్లు చేయిస్తాను. ఏ ఫ్లైట్‌కి వెళ్దాం!"

"అదంతా తర్వాత సావకాశంగా మాట్లాడదాం. మనం వెళ్ళే ఫ్లైట్‌కి కూడా చాలా రహస్యంగా వెళ్ళాలి. శత్రువులు అనుక్షణం మనల్ని వెంటాడుతుండ వచ్చు. నేను డైరెక్ట్‌గా యిక్కడినుంచి యింటికిపోయి

ఆ తర్వాత నేరుగా బేగంపేట్ ఏర్‌పోర్టుకి వస్తాను. నువ్వు కూడా సరాసరి యిక్కడినుంచి రాకుండా మారువేషంలో ఎక్కడెక్కడో తిరిగి, ఏర్‌పోర్టుకిరా! ఫ్లైట్ మన పేర్లతో కాకుండా వేరే పేర్లతో బిజినెస్ మీద వెళుతున్నట్టు సీట్సు రిజర్వు చేయించు. చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి."

"ఆల్ రైట్! అవన్నీ నేచూసుకుంటాను, నువ్వు యింటికి వెళ్ళి నీ ఏర్పాట్లలో వుండు."

"అలాగే. నేను కూడా మారువేషంలో వస్తాను. ఏర్‌పోర్టులో నన్ను చూసి గుర్తుపట్టినా నేనెవరో తెలీనట్టు వ్యవహరించాలి! బి కేర్‌ఫుల్!"

## 4

శాంతాక్రజ్ విమానాశ్రయంలో ఫ్లైట్ దిగి ఎవరికి వారే విడివిడిగా బయటకొచ్చారు. కిరణ్, శ్రీనివాస్‌లు వాళ్ళని టాక్సీలవాళ్ళు చుట్టుముట్టారు. కిరణ్ సర్దార్జీ వేషంలోను, శ్రీనివాస్ ముస్లిం యువకుడి వేషంలోను వున్నారు.

"కహాఁ జానా సాబ్?" అంటూ వాళ్ళచేతుల్లోని సూట్‌కేసులు లాక్కోబోయారు టాక్సీవాళ్ళు.

కిరణ్ తన సూదంటు రాయివంటి చూపుల్ని టాక్సీ స్టాండుచుట్టూ గిర్రున తిప్పాడు. దూరంగా పార్క్ చేయబడివున్న స్కై కలర్ ఎంబాసిడర్ కనిపించింది. బుల్లెట్ ప్రూఫ్ కారు ప్రయివేట్ కారులా కనిపిస్తోంది. పోలీసు కారని యెవరూ వూహించలేరు.

కిరణ్ చకచక అటు నడిచాడు. సరిగ్గా అతను డోర్ తీసుకుని యిటునుంచి ఎక్కుతుండగానే అవతలపక్క నుంచి శ్రీనివాస్ ఎక్కేశాడు. కారు మరుక్షణంలో

ముందు కురికింది.

హోటల్ తాజ్ కి పోయే రోడ్ పట్టింది కారు. ఇంతలోనే వెనుకనుంచి బుల్లెట్ దూసుకుంటూ వచ్చి కారును తాకి టప్ మని చప్పుడు చేస్తూ కిందపడింది.

కిరణ్ ఎలర్టుగా కూచున్నాడు. "మిస్టర్ శ్రీనివాస్! దాడి ప్రారంభమయింది. శత్రువులు మన ఉనికి కనిపెట్టే శారు" అన్నాడు.

శ్రీనివాస్ డ్రైవరు నుద్దేశించి, "క్యా సలీం, పోలీస్ స్టేషన్ సే సీదా ఆగయే క్యా?" అనడిగాడు.

"లేదు సార్! ముందుగా ఓ ఆటో మొబైల్ రిపేరింగ్ షాపుకి పోయి, రిపేరు చేయించినట్టు నటించి, ఊరంతా చక్కర్ కొట్టి ఏర్ పోర్టుకొచ్చాను. పోలీసు స్టేషన్లో పెట్టకుండా కారుని ఉదయమే తెచ్చి మా యింట్లో పెట్టుకున్నాను" అన్నాడు సలీం—డ్రైవరు—హిందీలో.

ఈ లోపల వెనకనుంచి మరో రెండు బుల్లెట్లు వచ్చి తగిలాయి. ఒకటి వెనుక అద్దానికి మరొకటి డిక్కీకి తగిలాయి.

కిరణ్ రేర్ వ్యూ మిర్రర్ లో చూశాడు. వెనుకనుంచి చాలా వేగంగా ఓ డాట్సన్ కారు, ఓ టాక్సీ దూసుకుంటూ వస్తున్నాయి. సలీం చాలా ఎక్స్పర్టులా వున్నాడు. నిదానంగా నడపకుండా అటు యిటు జిగ్ జాగ్ గా పోనిస్తున్నాడు కారుని. అందుకే వెనకనించి వస్తున్న వాళ్ళకు సరైన గురి కుదరటంలేదు.

కిటికీల్లోంచి బుల్లెట్స్ లోనికి రాకుండా ముందుగానే తామిద్దరు గ్లాస్ విండోస్ పైకి లేపేశారు సలీం తన రెండుపక్కల విండోస్ మొదట్నుంచీ మూసి వుంచాడు.

బుల్లెట్ ప్రూఫ్ కారు సెందుకు తెమ్మని అడిగాడో శ్రీనివాస్‌కి అర్థమయింది.

రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. రాత్రి పదిగంటలు దాటి పదిహేను నిమిషాలయింది. ఎదురుగా ఏమైనా కార్లు వచ్చినపుడు తప్ప, తక్కిన సమయాల్లో వెనుక నుంచి తమ కారుమీద బుల్లెట్ల వర్షం కురుస్తూనే వుంది.

కిరణ్ అప్పటికప్పుడే ఓ నిర్ణయానికొచ్చి, "శ్రీనివాస్! మనమిప్పుడు తాజ్‌కి వెళ్ళొద్దు. మన మెవరమో శత్రువులకి తెలిసిపోయింది. అలాంటప్పుడు తాజ్‌కివెళ్ళి మనంతట మనమే శత్రువులకి దివాకర్ ఉనికి తెలియచేయటం చాలా ప్రమాదకరం. సరాసరి పోలీస్ స్టేషన్‌కే పోదాం. మనం పోలీసులమని వాళ్ళకెటూ తెలిసిపోయింది. కాబట్టి కొత్తగా రహస్యం తెలిసేదంటూ ఏం లేదు" అని డ్రైవర్‌తో "సరాసరి స్టేషన్‌కే పోనియ్యి" అన్నాడు.

"సారీ, తాజ్‌కి బాగా దగ్గరకొచ్చేశాం" అన్నాడు సలీం.

కిరణ్ మెదడులో స్పార్క్ వెలిగింది.

కిరణ్ చటుక్కున కోటుజేబులోనుండి పిస్తోలు బయటికి తీసి సలీం తలకి ఆనించాడు. "ఎవరు నువ్వు? మేం నీకు తాజ్‌కు వెళ్ళమని చెప్పలేదు. నువ్వు తాజ్‌కే ఎలా తీసుకొచ్చావు? నువ్వు మా డ్రైవర్ సలీంకాదు. చెప్పు మర్యాదగా!" అన్నాడు.

ఊహించని జర్క్‌తో కారు ఆగిపోయింది. అంత వరకు సలీంగా వ్యవహారింపబడుతున్న డ్రైవరు మెరుపు వేగంతో డ్రైవర్ సీటులోంచి తలుపు చటుక్కున తెరుచుకుని రోడ్‌మీద కురికాడు. వెనక వస్తూన్న

డాట్సన్ కారు ఒక్క క్షణం వాళ్ళ కారు పక్క ఆగి డ్రైవర్ని లోపలకు తీసుకుని మహా వేగంగా ముందుకి దూసుకుపోయింది. దాని వెనకనే టాక్సీకూడా దూసుకు పోయింది.

"శ్రీనివాస్ చాలా పొరపాటు జరిగిపోయింది. డ్రైవర్ మనవాడేనన్న ఓవర్ కాన్ఫిడెన్స్‌తో మనమే మననోటితో దివాకర్ తాజ్‌లో వున్న విషయం చెప్పే శాం. మన డ్రైవర్ని మోసంచేసి మన కారుని వీళ్ళు కిడ్నాప్ చేసి మనల్ని రిసీవ్ చేసుకోవటానికి ఏర్‌పోర్టు వచ్చారు. వాళ్ళకి యీ క్షణంవరకు దివాకర్ యెక్క డుంటున్నదీ తెలీదు. నా వూహే నిజమయితే యీసరికి వాళ్ళు తాజ్‌లో వుంటారు. కమాన్ హారియప్!" అంటూ కిరణ్ వెనక సీట్లోంచి డ్రైవర్ సీట్లోకి మూకి కారు స్టార్టుచేశాడు.

అయిదు నిమిషాల్లో డిటెక్టివ్‌లున్న కారు హోటల్ తాజ్ పోర్టికోలో వుంది.

కిరణ్ తలుపు తెరుచుకుని హోటల్ వెనకపక్క నుంచి పరుగెత్తుకుంటూ మెట్లవైపు చొచ్చుకుపోయాడు. శ్రీనివాస్ అనుసరించాడు.

లిఫ్ట్ కోసం చూడకుండా మూడేసి మెట్లు నొక్కసారి ఎక్కుతూ ప్రతి ఫ్లోర్‌లోనూ రూం నెంబర్ వెరిఫై చేసుకుంటూ థర్డ్ ఫ్లోర్‌కిచేరాడు. రూం నంబర్సు మూడు వందలనుంచి మొదలయ్యాయి. అందుకే నాలుగో ఫ్లోర్ లోనే ఫోర్ త్రీ టూ నంబర్ దొరికింది.

కిరణ్ ఒక్కపరుగున ఆ రూం దగ్గరికి పరుగెత్తాడు. తలుపులు దగ్గరగా వేసివున్నాయి. తోసుకుని వెళ్ళాడు.

అక్కడి దృశ్యం అతను వూహించినట్లే వుంది.

గదంతా చిందరవందరగా వుంది. తలుపు పక్కగా రూం బాయ్ రక్తం మడుగులో పడున్నాడు.

కిరణ్ ఒక్క క్షణంలో గదిని, లావెట్రీని చుట్టేశాడు.

గదిలో ఎక్కడా దివాకర్ జాడలేదు.

## 5

కాసేపటివరకు యిద్దరు మౌనంగా నిల్చున్నారు. కిరణ్ తలుపు దగ్గరికి వేసి బోల్టు వేశాడు.

“మన అజాగ్రత్తవల్ల ఓ నిండు ప్రాణాన్ని చేజేతులా తీశామేమోననిపిస్తోంది” అన్నాడు కిరణ్ —అతని మనసు, ఈ సంఘటనతో వికలమయిపోయింది. తామిద్దరు మాటల సందర్భంలో అసలు విషయం బయటపెట్టేశారు. దాంతో శత్రువులకి దివాకర్ ఆచూకీ తెలిసిపోయింది.

“రూం నెంబర్ ఎలా తెలిసిందో అర్థంకావటంలేదు” అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ వినిపించుకోకుండా గదంతా కలియజూశాడు.

గది పెద్దదే! ఓ బెడ్, టేబిలు, రెండు కుర్చీలు, వున్నాయి గదిలో. రాక్‌లో కొన్ని పుస్తకాలున్నాయి. మంచంకింద ఓ సూట్‌కేస్ వుంది. గోడకి తగిలించి ఓ ఏర్ బాగ్ వుంది.

సూట్‌కేస్ అడుగున దివాకర్ ఐడెంటిఫికేషన్ కార్డు ఫోటోతోబాటు వుంది. ‘ఎక్స్ జీరో టూ’ వున్న కోడ్ నంబరు దిగువున వేసివుంది.

“దివాకర్ వచ్చినప్పట్నుంచీ ఇదే హోటల్లో మకాం చేసివుండాలి” అన్నాడు శ్రీనివాస్.

“వారం రోజులేగా అయింది? బహుశా హోటల్ రిజిష్టర్లో మారుపేరుతో రూం బుక్ చేసి వుండొచ్చు” అన్నాడు కిరణ్. మంచంమీదున్న పరుపు పైకెత్తి

చూశాడు.

పరుపుకింద ఏమీలేదు.

అయితే పరుపు మామూలుగా వేసేస్తుంటే పరుపు లోపల గరగర చప్పుడయింది. కిరణ్ మస్తిష్కం తీవ్రంగా పనిచేస్తోంది. పరుపుకి ఓ పక్కగా రంధ్రంచేసి వుంది. ఆ రంధ్రంగుండా చెయ్యి తోశాడు.

చేతికి ఏదో కాగితం తగిలింది. బయటికితీశాడు. ఏదో ప్లాన్‌లాగా వుంది.

కాగితాన్ని టేబిల్‌మీద పరిచి దానివంకే తదేకంగా చూడసాగాడు కిరణ్. శ్రీనివాస్ అతని చర్యల్ని పూర్తిగా గమనిస్తున్నాడు. తనూ వంగి కాగితంలోకి చూశాడు. అతనికేం అర్థంకాలేదు.

అది అరఠావు సైజు కాగితం!

కాగితానికి చుట్టూ బోర్డర్‌లా గీచివుంది.

కాగితం మధ్యగా కొలను. దానిలో కలువ పువ్వు గీచివుంది. వెనక కొండల బారు చూపించబడివుంది. కొండలబారుకి కొలనుకి మధ్య పడగవిప్పిన తాచుపాము బొమ్మ వుంది. బోర్డర్‌కి ఓ పక్క కుడివైపు సముద్ర కెరటాలు ఉవ్వెత్తున లేచిపడుతున్నట్టు గీయబడి వుంది. ఎడమవైపు బోర్డర్‌కి కొంచెం దిగువగా సింహం తల బొమ్మ గీచివుంది.

కిరణ్ చాలాసేపు ఆ బొమ్మవైపే తీవ్రంగా ఆలోచిస్తూ చూశాడు.

శ్రీనివాస్ ప్రశ్నార్థకంగా చూశాడు కిరణ్‌వంక.

కిరణ్ కాగితాన్ని మడిచి కోటుజేబులో పెట్టుకున్నాడు. ఇంకాసేపు పుస్తకాల్ని, సూట్‌కేస్‌ని ప్రతి సెంటిమీటరు పరీక్షగా చూశారిద్దరు.

ఇంతలో తలుపుకి పక్కనున్న బజర్ మోగింది.

కిరణ్ సాలోచనగా శ్రీనివాస్ వంక చూసి, వెళ్ళి తలుపు బోల్టు తీశాడు.

బయట హోటల్ మేనేజర్ కాబోలు నిలబడి వున్నాడు.

"సార్, మీరెవరో తెలుసుకోవచ్చా?" అన్నాడు తను హిందీలో.

కిరణ్ అతనివంక పరీక్షగా చూసి, "ఈ రూంలో బసచేసిన ఆయన స్నేహితులం!" అన్నాడు.

"మిష్టర్ అశోక్ వున్నారా లోపల?"

"లేరు!"

"ఇందాకా మా బోయ్ మీ రూంకి సర్వీసింగ్ చేయటానికొచ్చాడు. గంటదాటినా అతను మీ రూంనించి తిరిగిరాలేదు."

"అతనెప్పటికీ తిరిగిరాడు!"

"అదేమిటి సార్, అలా అంటున్నారు?"

"ఇలా ఓసారి లోపలికొచ్చి చూడండి!" కిరణ్ గుమ్మంలోనుంచి అడ్డుతొలగి నించున్నాడు.

మేనేజర్ లోనికి చూస్తూనే అదిరిపడ్డాడు.

"వ్వాట్? హత్యా? ఎవరు చేసారీపని?"

"అది మాకు తెలియదు."

"అయితే మీరు అశోక్ ఫ్రెండ్సు కాదా?"

శ్రీనివాస్ తమ ఐడెంటిటీతీసి చూపించాడతనికి.

మేనేజర్ నమ్రతగా నమస్కరించి, "మా హోటల్లో యిలాంటి దారుణం జరగటం, అందునా మా ఉద్యోగి హత్యచేయబడటం యిదే మొదటిసారి. యెవరుచేశారో, వాడినుంచి ఏమి ఆశించి చంపారో అర్థంకాకుండా

వుంది" అన్నాడు.

"వాడినుంచి ఏమీ ఆశించి చంపలేదు. మిష్టర్ అశోక్‌ని యెవరో అపహరించుకుపోయారు. మీ బాయ్ వాళ్ళని చూశాడు. మళ్ళీ వాళ్ళని గుర్తుపట్టకుండా శాశ్వతంగా వాడి నోరు మూయించేశారు."

"వాట్ సార్? అశోక్‌గార్ని కిడ్నాప్ చేశారా? అన్నీ వింతగా అనిపిస్తున్నాయి నాకు. ఈ బోయ్ హత్య గురించి తెలిశాక హోటల్లో పని చేయటానికి బాయ్స్ భయపడిపోతారు. మిష్టర్ అశోక్ విషయం తెలిస్తే మా హోటల్‌కున్న గుడ్‌విల్ పోతుంది. దయచేసి మీరీ విషయాలేవీ లీక్ చెయ్యవద్దని ప్రార్థన."

"అవసరమైతే తప్ప కావాలని బయటపెట్టం. కాని మీ హోటల్లో ఓ గదిలో జరిగే విషయం పక్కనున్న వాళ్ళకిగాని, తక్కిన ఇన్‌మేట్స్‌కిగాని తెలియకపోవటం విచిత్రంగా వుంది."

"అసలు మా హోటల్ ప్రత్యేకతే అది సార్! ఎవరిమటుకు వాళ్ళకు యిండిపెండెంటుగా వుండాలనే ఉద్దేశంతో మా రూంస్ ప్రత్యేకించి కట్టించాం. ప్రైవసీ కోసం సిటీలో మా హోటల్‌నే యెన్నుకుంటారు శ్రీమంతులు. అదే మిష్టర్ అశోక్ కిడ్నాపింగ్ విషయం గాని, మా బాయ్ హత్య విషయంగాని మాకు మీరు చెప్పేవరకు తెలియకుండా పోవటానికి కారణం!"

ఇంతలో గదిలోని ఫోన్ మోగింది.

కిరణ్ ఒక్క అంగలో ఫోన్ సమీపించి రిసీవర్ ఎత్తి "హల్లో!" అన్నాడు.

అవతలినుంచి ఓ కర్కశమైన స్వరం వినిపించింది.

"డియర్ కిరణ్! ఇప్పటికైనా తెలిసిందా మా ప్రయోజకత్వం? యెందుకు అనవసరంగా ప్రాణాలు పోగొట్టుకుంటావు? గో బాక్!"

"మిష్టర్! నువ్వెవరో తెలీదుగాని, ఉత్త పిరికిపందవని అర్థమవుతోంది" అన్నాడు కిరణ్ నిదానంగా.

"ఏమిటి అహంకారం?"

"అహంకారం కాదు మిష్టర్! యెదురుపడి పోరాడే ధైర్యంలేకనే నువ్వు వెనక దెబ్బ తీస్తున్నావు. మా ఏజెంటుని కిడ్నాప్ చేసినంత మాత్రాన నీకేమిటిలాభం?"

"లాభమా? మీ ఏజెంటు మా రహస్యాలన్నీ కనుక్కున్నాడు. బయటపెడతానని గర్వంగా చాటి చెప్పాడు. అసలు చంపేయాలనే అనుకున్నాం. త్వరలో అదీ జరుగుతుంది. యెలాగూ మీ యిద్దరు—నువ్వు, ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ — సిటీలోనే వున్నారుగా! మీ ఫ్రెండ్ శవాన్ని మీకే అప్పగించేస్తాం!"

"మిష్టర్, ఊరికే గొప్పలు చెప్పుకోకు! మా ఏజెంటు అంత తెలివితక్కువ వాడేం కాదు — మీ చేతుల్లో చావటానికి!"

"అదీ చూద్దాం. ఈ లయిన్‌తో పెట్టుకున్నవాళ్ళెవరూ బతికి బట్టకట్టింది లేదు! మా కార్యకలాపాలకి అడ్డొచ్చిన వాళ్ళందర్నీ నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేశాం. బొంబే పోలీసుల్ని అడిగి చూడు—ఎంతమందిని వదులుకున్నారో తెలుస్తుంది. అందుకే వాళ్లెవరూ మా జోలికి రావటం మానేశారు. లయిన్ అంటే వాళ్ళకు సింహస్వప్నం! నా మాట విని వచ్చిన దారినే తిరిగిపో! నీ వెంట వచ్చిన పోలీసాయన్ని కూడా తీసుకుపో!"

కిరణ్ నవ్వాడు—"ఎవరు ఎవరికి సింహస్వప్నమో

నీ మాటలే చెపుతున్నాయి. అయినా నీతో వాదించటం అనవసరం! నువు యిండియన్‌వే అయితే, నీలో మాతృదేశంమీద భక్తి, గౌరవం వుంటే వెంటనే నీ వృత్తికి స్వస్తిచెప్పు! నువ్వు పరాయి దేశస్థుడివయివుంటే వెంటనే మా దేశం వదిలి నీ దేశం పారిపో!" అన్నాడు.

అవతల ఫోన్‌లో వికృతమైన నవ్వు వినిపించింది. "లయన్‌ని బెదిరించినవాడివి నువ్వొక్కడివే కనిపించావు. సరే, నా మాట పెడచెవిన పెడుతున్నావు. నిన్నూ, నీ ఇన్‌స్పెక్టర్ని ప్రాణాలతో వదిలేదిలేదు, గుర్తుంచుకో!"

"చేసేవాడు యిన్నిసార్లు చెప్పడు! మిస్టర్ లయన్! మర్యాదగా మా ఏజెంటు నప్పజెప్పెయ్యి. పోలీస్‌కి సరెండర్ అయిపో! నీకు శిక్ష తక్కువపడేలా నే చూస్తాను."

అవతల చాలా కోపంగా ఫోన్ పెట్టేసిన చప్పుడు.

కిరణ్ ఆదేశానుసారం బయిటికి వెళ్ళిన శ్రీనివాస్ లోనికొస్తూ, "ఫోన్ జుహూ బీచ్ ఏరియానించి వచ్చింది. ఆపరేటర్ నడిగితే మన నెంబరు చెపుతున్నాడుగాని, ఆ ఫోన్ నంబరు చెప్పలేకపోయాడు" అన్నాడు.

కిరణ్ మెదడులో తన జేబులో వున్న కాగితంమీది ప్లాన్ ముద్ర పడిపోయింది. శత్రువు మాటల్లో అతని లయన్ అని చెప్పుకున్నాడు. ఎడమవైపు గీచిన 'సింహపు తల' బహుశా శత్రువుల సింబల్‌ని సూచిస్తున్నాయి. సముద్రకెరటాలు జుహూ బీచ్‌ని సూచిస్తున్నాయి. అంటే ఆ ప్లాన్ కాగితం శత్రువుల స్థావరాన్ని వివరిస్తోందన్న మాట!

అయితే కొలను, కొండలబారు, పడగవిప్పిన తాచు పాము, కొలనులోని కలువ పువ్వు-ఇవి వేటికి సంకేతాలో

తను తెలుసుకోవాల్సి వుంది!

అంతసేపూ మేనేజర్ అక్కడే నిలబడి వున్నాడు— అప్పటికి హోటల్ సిబ్బందికి రూం బాయ్ విషయం చూచాయగా తెలిసినట్టుంది. ఒకరొకరు అక్కడికి చేరు కుంటున్నారు.

కిరణ్ మేనేజర్ వంక తిరిగి, "అయామ్ సారీ! పోలీస్‌కి మేం చెప్పక తప్పదు. అయితే యిది పదిమందికీ పబ్లిసిటీ కాకుండా చూస్తాం లెండి. కాని పత్రికలవాళ్ళు సైలెంట్‌గా వుంటారని నేననుకోను. వాళ్ళకి ఏమాత్రం క్లూ అందినా మీ హోటల్‌తోబాటు అన్ని సంగతులు ప్రచురించి తీర్తారు" అన్నాడు.

"పత్రికలవాళ్ళ విషయం మేం యిదివరకే అనుభ వించి వున్నాం సార్! సరే, మీ బాధ్యత మీరు నిర్వ ర్తించండి!" అన్నాడు మేనేజర్.

కిరణ్ పోలీసులకి ఫోన్ చేశాడు.

# 6

హోటల్ కాంటినెంటల్ రూంలో డిటెక్టివ్ కిరణ్, శ్రీనివాస్ కూచుని వున్నారు.

"మనమింకా హోటల్ తాజ్‌లోనే వున్నామని లయిన్ వాళ్ళు పొరబడుతుండవచ్చు!" అన్నాడు శ్రీనివాస్. కిరణ్ వెంటనే మాట్లాడలేదు.

ఇద్దరు మారువేషాల్లో వున్నారు. కిరణ్ ముస్లిం యువకుడిలాగాను, శ్రీనివాస్ కాబూలీవాలా వేషం లోనూ వున్నారు.

"దివాకర్ రూంకి మళ్ళీ లయిన్ వచ్చివుంటా డంటావా?" అడిగాడు శ్రీనివాస్.

"ఇక రాకపోవచ్చు! ఆ రూంలో వాళ్ళకు పనికివచ్చే

సమాచారం ఏదీ దొరికి వుండదు. మనం వచ్చేటప్పటికి అతని నివాసమంతా వెరిఫై చేసేసుకున్నారు కదా! కాకపోతే దివాకర్ తెలివిగా పరుపులో దాచిన కాగితం వాళ్ళకంట పడలేదు. మనం మరోసారి దివాకర్ రూంకి వెళ్ళాల్సి వుంటుంది. లయిన్ మురా కార్యకలాపాలను గురించి కూడా వివరాలు ఎక్కడో రాసిపెట్టి వుంటాడు దివాకర్. అది కూడా ఏదో 'కోడ్'లోనో, మరో అర్థం కాని విధాలగానో రాసివుంటాడు...." కిరణ్ యింకా ఏదో అంటుండగానే 'సర్'మంటూ గాలిని కోసుకుంటూ బుల్లెట్ దూసుకొచ్చింది.

కిరణ్ శ్రీనివాస్ తలపట్టుకుని కిందికి అదిమి తనూ వంగాడు. బుల్లెట్ గోడకు తగిలింది.

కిరణ్ మెరుపులా కిటికీ దగ్గరకు పరుగెత్తి తొంగి చూశాడు. కింద డాట్సన్ కారు స్టార్టయింది. ఓ వ్యక్తి చటుక్కున కార్లోకి జొరబడ్డాడు. కారు మహావేగంగా వెళ్ళిపోయింది.

శత్రువులకి మన వునికి తెలిసిపోయింది. మనం ఈ హోటల్లో బసచేసిన విషయం కనిపెట్టేశారు" అన్నాడు శ్రీనివాస్‌తో కిరణ్.

శ్రీనివాస్ సాలోచనగా చూశాడు.

"మనం జుహూ బీచ్‌కి వెళ్ళొద్దాం. అదేవిధంగా ఓసారి పోర్టుకి కూడా వెళ్ళి ఈ మధ్య వారం పది రోజులుగా స్నేక్ లెదర్‌గాని, గంజాయివంటి యితర ప్రొహిబిటెడ్ గూడ్సు ఏవైనా కస్టమ్స్‌వాళ్ళు పట్టుకున్నారేమో కనుక్కోవాలి. దివాకర్ ప్లాన్ కాగితంలోని ఐటమ్స్‌ని డీకోడ్ చేసి చూడాలి. కొలను, తామర పువ్వు, తాచుపాము, కొండల బారు—యివన్నీ ఒక

దానితో మరొకటి యింటర్ కనెక్టుడ్‌గా వున్నాయి” అన్నాడు కిరణ్.

“ఆ కాగితం ఓసారి యిస్తావా?” చేయి చాపాడు శ్రీనివాస్.

“వద్దు. గోడలకి కళ్ళు, చెవులు వుంటాయి. మన శత్రువుల కంటపడనిదేమైనా వుందా అంటే, యిప్పటి వరకు ఆ కాగితం ఒక్కటే! అది కంటపడితే వాళ్ళు తమ స్థావరాన్ని చాలా అర్జంటుగా మార్చేసే ప్రమాద ముంది” అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ తలూపాడు.

“వేషం మార్చు” అన్నాడు కిరణ్, కిట్ పైకితీస్తూ.

మళ్ళీ వేషాలు మార్చుకోవటం మొదలు పెట్టారు.

కిరణ్ తల పండిపోయింది. మీసం గడ్డం తెల్లగా మారిపోయాయి. పంచె, లాల్చీ ధరించాడు. శ్రీనివాస్ పిల్ల జమిందారు దుస్తుల్లోకి మారిపోయాడు. ఎంబ్రాయిడరీ చేసిన ఖరీదైన సిల్కు లాల్చీ, పైజామా వేసుకున్నాడు.

మరో పదినిమిషాల తర్వాత బొంబే పోర్టులోని అధికారులతో మాట్లాడుతున్నారిద్దరు.

“నో సార్, అలాంటి గూడ్సు ఏవీ ఎక్స్‌పోర్టు కాలేదు” అన్నాడు కస్టమ్సు అధికారి.

“అనుమానాస్పదమైన పార్సిల్సుగాని, మనుషులుగాని యెదురుపడితే వెంటనే మాకు తెలియపర్చండి. వాళ్ళని ఎలాగైనా డిటెన్ చేసి వుంచండి. చాలా అవసరం” అన్నాడు కిరణ్.

తర్వాత యిద్దరు జుహు బీచ్‌కి వెళ్ళారు.

సాయంత్రం అయిదుగంటల సమయం. బీచ్‌లో కోలాహలం పెరుగుతోంది. జంటలు జంటలుగా యువతీ

యువకులు చెట్టాపట్టా లేసుకుని అటు యిటు తిరుగుతున్నారు. కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఎక్కడ చూసినా జంటలే! ఈ బీచ్ లవర్సుకి పెట్టింది పేరని గతంలో విన్నాను" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ దివాకర్ ప్లాన్ కాగితం గురించే ఆలోచిస్తున్నాడు. బీచ్ కి దగ్గర్లో ఎక్కడా కొండలు గుట్టలు కనిపించటంలేదు. కోలను కూడా ఏదీ వున్నట్టు లేదు. మరి అందులో అవి ఎందుకు సూచించాడు దివాకర్?

"దివాకర్ని వాళ్ళు యేమైనా చేస్తారేమో...." అన్నాడు శ్రీనివాస్ మెల్లగా.

"నేనూ అదే అనుమానిస్తున్నాను. ఇంతవరకు అతను వాళ్ళకు దొరక్కుండా తప్పించుకుని వాళ్ళ సమాచారాలు సేకరించాడు. ఇప్పుడు మన కారణంగా దొరికిపోయాడు. వాళ్ళు అతన్ని చిత్రహింస చేయకుండా వదలరు. అసలు ప్రాణాలతో అతన్ని కళ్ళ చూస్తామా అని అనుమానం నాకు!"

"ఈ లోపల వాళ్ళ స్థావరం తెలిస్తే బావుణ్ణు!"

"అదే నా ప్రయత్నం కూడా! బాంబే పోలీసుకి ఎలర్టుగా వుండమని చెప్పావు కదూ! యే క్షణంలో పిలిచినా ఒక్కుమ్మడిగా వచ్చేలా ఏర్పాటు చెయ్యి."

"అన్నీ వివరంగా కమిషనర్ తోను, డి.జి.పి.తోను మాట్లాడాను. యే క్షణంలో పిలిచినా పలుకుతారు. ప్రస్తుతం మన చుట్టుపక్కల మఫ్టీలో వున్నారు కొంతమంది. వాళ్ళను మనకు ఎస్కార్టుగా పంపారు. అవసరమైతే వాళ్ళని ఉపయోగించుకోవచ్చు."

కిరణ్ చుట్టూ పరిశీలనగా చూశాడు. పదిమీటర్ల పరిధిలో కొంతమంది పోలీసు సిబ్బంది మఫ్టీలో తిరుగు

తున్నారు. చూసీ చూడనట్టు తమ వంక చూస్తున్నారు. తాము కనుసైగ చేసినా అందుకునేటంత యెలర్టుగా వున్నారు.

"గుడ్! మంచి ఏర్పాట్లు చేశావు" అన్నాడు కిరణ్ ప్రశంసగా. శ్రీనివాస్ ఉబ్బిపోయాడు.

## 7

బీచ్ కి యెడమవైపు దృష్టిసారించిన కిరణ్ అక్కడి దృశ్యాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు. దూరానికి బంగారు రంగు అక్షరాలు మెరుస్తున్నాయి. 'హోటల్ లోటస్' అని! కిరణ్ మస్తిష్కంలో మెరుపులు మెరిశాయి.

లోటస్ అన్న పదం కలువ పువ్వును సూచిస్తోంది. అంటే ప్లాన్ లోని కలువ పువ్వు ఈ హోటల్ కి సంకేత పదంగా ఉపయోగించలేదుకదా! అతని అనుమానం మరి కొద్ది క్షణాల్లో తీరిపోయింది.

హోటల్ లోటస్ ఎత్తయిన కొండమీద కట్టబడి వుంది. హోటల్ బాక్ గ్రౌండ్ లో కొండలు బారులు తీరి కనిపిస్తున్నాయి. అదంతా రాత్రి ప్రదేశం!

కిరణ్ లేచాడు. కొంత దూరంగా కూచుని వున్న శ్రీనివాస్ కూడా లేచాడు.

వాళ్ళు ముందుకి సాగుతుంటే వెనకనుండి మఫ్టీలో వున్న పోలీసులు కూడా అడుగులో అడుగు వేసుకుంటూ దూరంగా వెంబడిస్తూ నడవసాగారు.

'హోటల్ లోటస్' వున్న కొండ చేరటానికి దాదాపు యిరవై నిమిషాలు పైనే పట్టింది. చాలా దూరంగా వున్నట్టు కనిపించిందేగాని దూరం కిలో మీటరుకి తక్కువలేదు.

కిరణ్ శ్రీనివాస్ విడివిడిగా నడుస్తున్నారు. కిరణ్

తన ఆకారంవంక చూసుకున్నాడు. గడ్డం మాసినట్టు కనిపించినా తను ధరించిన ఖరీదైన లాల్చీ, సిల్కుపంచె తను ఓ ఉన్నత కుటుంబంలోని వ్యక్తి అని చెప్పకనే చెప్పుతున్నట్టున్నాయి. శ్రీనివాస్ ఆకారం గాలికి తిరిగే షోకిల్లా జమిందారులా వుంది. కాబట్టి ఆ హోటల్లో ప్రవేశానికి తమని అభ్యంతరపెట్టే వాళ్ళు యెవరూ వుండరని అతనికి తెలుసు.

కిరణ్ కొండపైకి చక్కగా నిర్మించబడ్డ పాలరాతి మెట్లు యెక్కుతూ పరిసరాలు జాగ్రత్తగా గమనిస్తున్నాడు. అతనికి అయిదారు మెట్లు దిగువన శ్రీనివాస్ ఎక్కుతూ వస్తున్నాడు. వాళ్ళిద్దరికీ బాగా దూరంగా, కిందుగా మఫ్టీలో వున్న పోలీసులు!

కిరణ్ హోటల్ లోటస్ ఎంట్రన్స్ దగ్గర ఆగాడు. లోటస్ ఎంట్రన్స్‌కి యెడమపక్కగా లాన్స్ వున్నాయి. చక్కటి అశోక వృక్షాలు హోటల్‌కి యిరుపక్కలా స్వాగతం పలుకుతున్నాయి. లాన్స్ నిండా పూల తొట్టెలు, గులాబీ మొక్కలు విస్తారంగా వున్నాయి. గార్డన్ పార్టీ చేసుకోవటానికి వీలుగా రెండు పక్కలా చక్కగా టేబిల్సు అమర్చి వున్నాయి.

కిరణ్ ఒక్క క్షణం ఆలోచించి, యెడమపక్కగా వున్న దారిగుండా లాన్స్‌లోకి నడిచాడు. అక్కడ చెదురుమదురుగా కస్టమర్సు కూచుని వున్నారు. వాళ్ళు మద్యాన్ని సేవిస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆడ మగ తేడా లేకుండా తాగుతున్నారు, తింటున్నారు.

కిరణ్ వాళ్ళ పక్కగా ముందుకి వెళ్ళాడు. ఇప్పుడు వెనకపక్కనున్న కొండలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. కిందినుంచి చూస్తే హోటల్‌కి అంటిపెట్టుకున్నట్టు కని

పించిన కొండలు హోటల్ కి చాలాదూరంగా వున్నాయి.

హోటల్ కి, కొండల బాయకి మధ్య రకరకాల రంగుల దీపాలతో వెలిగిపోతోంది ఓ స్టాలు. దానిపైన రంగు దీపాల డిజైన్ తో 'అమ్యూజ్ మెంటు పార్కు' అని రాసివుంది. దానికి పక్కనే దీపాలంకరణతో మెరిసిపోతున్న బొమ్మని చూసి కిరణ్ కళ్ళు తళుక్కున మెరిశాయి.

అక్కడ పడగవిప్పిన తాచుపాము బొమ్మ నిజమైన తాచు బుసలుకొడుతున్నట్టే మెరిసిపోతోంది!

## 8

కిరణ్ కి సమస్య విడిపోయింది. బహుశా యీ అమ్యూజ్ మెంటు పార్కే శత్రువుల నివాసమయి వుంటుంది. మనసులోనే దివాకర్ దూరదృష్టికి, మేధా సంపత్తికి జోహార్లర్పించాడు కిరణ్.

కిరణ్ ఓ క్షణం వెనుతిరిగి చూసి, సరాసరి అమ్యూజ్ మెంటు పార్కులోకి నడిచాడు. శ్రీనివాస్ అతని చూపులోని సందేశాన్ని అందుకున్నాడు. అతను వెనుతిరిగి చూశాడు. అతని ఆదేశాల నందుకోవటానికి వెనక మఫ్టీ పోలీస్ సిద్ధంగా వుంది.

కిరణ్ పార్క్ లోపలికి ప్రవేశించాడు. లోపల రకరకాల జూదాలు జోరుగా సాగిపోతున్నాయి. రమ్మీ, మూడుముక్కలాట, రన్నింగ్ వీల్, లక్కీడిప్స్ రకరకాల ఆటలు.

దూరంగా డిమ్ గా వెలుగుతున్న లైట్ల మధ్య స్టేజి. స్టేజిపైన కాబరే డాన్సర్ అందంగా ఊగుతోంది. గోడల కమర్చిన మైక్రోఫోన్లగుండా మంద్రమైన సంగీతం. ఆ సంగీతం మత్తులో ఊగుతున్న జంటలు!

అదంతా ఓ ప్రత్యేకమైన లోకంలా వుంది.

కిరణ్ కాసేపు ఓ టేబిల్ ముందు కూచున్నాడు. డ్రింక్స్ సర్వ్ చేయబడ్డాయి. స్టేజీమీదున్న కాబరే డాన్సర్ని కళ్ళతోనే జుర్రేస్తున్న యువకులు ఓ పక్క హాట్ డ్రింక్స్ సిప్ చేస్తూ కూచున్నారు. కూచున్న చోటినుంచి లేచి డాన్స్ చేసి మళ్ళీ కూచుంటున్నారు.

కిరణ్ లేచాడు. సరాసరి టాయ్లెట్ అని రాసున్న రూంవైపు నడిచాడు. లోపల పూర్తి ఏర్ కండిషన్ చేయబడి, చలి వణుకుపుడుతున్నాయి. టాయిలెట్ పక్కనుంచి చిన్న ద్వారముంది.

కిరణ్ ఆ ద్వారంనుంచి అవతలిపక్క హాల్లోకి ప్రవేశించాడు. ఒక్క క్షణం పులినోట్లో తల దూర్చుతున్న అనుభూతి కలిగిందతనికి! అయినా వెనక్కుతియ్యలేదు. లాల్చీ జేబు తడుముకున్నాడు. రివాల్వర్ చల్లగా తగిలింది.

హాలు నిర్మానుష్యంగా వుంది. లోపలి హాలు ఎంత సందడిగా హడావిడిగా వుందో ఈ హాలు అంత సబ్ధంగా నిశ్శబ్దంగా వుంది. ఒక్కో అడుగే తీసివేస్తున్నాడు కిరణ్.

పక్కన ఏదో అలికిడి అయింది. తలతిప్పి చూసేసరికి ఆలస్యమయిపోయింది. నెత్తిపైన వెయ్యి మణుగుల బరువు సమ్మెట దెబ్బలాంటి దెబ్బ!

వెంటనే కుప్పలా కూలిపోయాడు కిరణ్. మరుక్షణం అతనికి స్పృహ తప్పిపోయింది.

* * *

శ్రీనివాస్ కిరణ్ కూచున్న టేబిల్కి నాలుగు టేబిల్స్ యివతల కూచున్నాడు. కిరణ్ లేచి టాయిలెట్

వైపు వెళ్ళటం గమనించాడు.

అయిదు నిమిషాల తర్వాత ఓసారి చుట్టూ పరిశీలనగా చూశాడు. దూరంగా మఫ్టీ కానిస్టేబిల్స్ వున్నారు. తక్కిన వాళ్ళంతా యెవరి పిచ్చిలో వాళ్ళున్నారు. తనని ప్రత్యేకించి యెవరూ గమనించటంలేదని అతను గ్రహించాడు.

లేచాడు. నాలుగడుగులు వేసి టాయిలెట్ పక్కకి చేరుకున్నాడు. ఆగి చుట్టూ చూశాడు. మఫ్టీ కానిస్టేబుల్స్ తన ఆదేశాలకోసం తనవైపే చూస్తున్నారు. తక్కిన వాళ్ళెవరూ గమనించటం లేదని నిర్ధారణ చేసుకున్నాడు.

టాయిలెట్ పక్కగా వున్న ద్వారంనుంచి అవతలి హాల్లోకి ప్రవేశించాడు. అక్కడ జనసంచారంలేదు. యెవరూ అటు యిటు వదుస్తున్న జాడకూడా లేదు.

ఒక్క క్షణం ఆగి చుట్టూ చూశాడు. కిరణ్ ఎటు వెళ్ళాడు? తను అతను లేచిన వెంటనే లేచి రావాల్సింది! ఆలస్యం చేయటంవల్ల కిరణ్ ఎటు పోయిందీ తెలీటం లేదు.

శ్రీనివాస్ అడుగులో అడుగువేసుకుంటూ హాల్లో నడవసాగాడు. హాలుకి రెండువైపుల గదులున్నట్టున్నాయి. తలుపులు లోపల్నుంచి గడియపెట్టి వున్నాయి.

శ్రీనివాస్ చటుక్కున ఆగాడు. యెక్కడినుంచో అడుగుల సవ్వడి వినిపిస్తోంది. చెవులు రిక్కించి విన్నాడు. గోడ పక్కగా కీ నీడలోనికి తప్పుకుని చూడసాగాడు.

* * *

కిరణ్ కళ్ళు భారంగా తెరిచాడు. అక్కడ వెలుగు చూడలేక మళ్ళీ కళ్ళు వాటంతటవే మూసుకుపోయాయి

కళ్ళు చికిలించుకుని చూశాడు. తల భారంగా వుంది. తల చిట్లి రక్తం అట్టగట్టినట్టు, ఆ ప్రదేశంలో తిమ్మిరిగా వున్నట్టు గమనించాడు.

చేత్తో గాయాన్ని తడుముకున్నాడు. చల్లగా తగిలింది రక్తం!

"హల్లో! మైడియర్ కిరణ్, హౌ ఆర్యూ?" అని వినిపించింది. కిరణ్ చటుక్కున అటు చూశాడు.

ఓ పక్కగా వున్న కుర్చీలో యెవరో వ్యక్తి కూచుని వున్నాడు. నోట్లో పైప్ వెలుగుతోంది. చేతులకి గ్లవ్స్ వేసుకుని వున్నాడు. కళ్ళకు రాత్రిపూట కూడా నల్ల కళ్ళద్దాలున్నాయి! నవ్వుతూ కిరణ్ వంక చూశాడు.

కిరణ్ కి అతన్ని యెక్కడో చూసినట్టనిపించింది. యెంత ఆలోచించినా గుర్తు రావటంలేదు. కాని ఆ ముఖం తనకి బాగా గుర్తు! యెవరతను?

"ఐయామ్ సారీ, నిన్ను బాధపెట్టాల్సి వచ్చింది" అన్నాడతను హిందీలో.

ఆ గొంతు గుర్తుపట్టాడు. తనని ఫోన్ లో సవాల్ చేసిన గొంతు. అవును, అతనే యితను! కాని ముఖం యెక్కడో చూసినట్టు అనిపిస్తోందిగాని, యిప్పటికీ జ్ఞాపకం రావటంలేదు.

"నేనెవరని ఆలోచిస్తున్నావు కదూ! నన్ను లయిన్ అంటారు. ఇంకో భాషలో చెప్పాలంటే ఎక్స్ జీరో టూ—ఏజెంట్ ఎక్స్ జీరో టూ!" అన్నాడతను నవ్వుతూ.

కిరణ్ మెదడులో స్పార్క్ వెలిగింది. అతనెవరో గుర్తొచ్చింది. శ్రీనివాస్ ఏజెంట్ ఎక్స్ జీరో టూ—దివాకర్—ఫోటో చూపించాడు. అంటే దివాకరే ఈ

ఘోరాలు చేస్తున్న లయినా?

"ఆశ్చర్యపోతున్నావు కదూ! లయన్ పేరుతో స్మగ్లింగ్ చేస్తున్న ది గ్రేట్ దివాకర్ నేనే! ఏజెంట్ ఎక్స్ జీరో టూ! నేనిక్కడికి స్మగ్లింగ్ ఇన్వెస్టిగేషన్ పేరుతో వచ్చాను. అప్పటికే దేశం నలుమూలలా నా ఏజెంట్సున్నారు. సీక్రెట్ ఏజెంటుని కాబట్టి నన్నెవరూ అనుమానించరు. అందుకే నేను చేస్తున్న ప్రొహిబిటెడ్ గూడ్సు స్మగ్లింగ్ యిన్వెస్టిగేషన్ చేయటానికి నేనే ఏజెంటుగా బయల్దేరాను.

"అలా ఆశ్చర్యపోకు మరి! దేశభక్తి మాతృభక్తి అంటూ నీతులు వల్లించటానికి బాగానే వుంటుందిగాని, నిజాయితీగా బతికినన్నాళ్ళు నేను బావుకున్న దేం లేదు. ఓ స్మగ్లింగ్ కేసు యిన్వెస్టిగేషన్ కోసం గతంలో ఓసారి బొంబే వచ్చాను. అప్పుడే ఈ స్మగ్లింగ్ మీద ఆసక్తి కలిగింది.

"స్నేక్ లెదర్, గంజాయి మొదలైన స్మగుల్డు ప్రొహిబిటెడ్ గూడ్స్‌కి విదేశాల్లో చాలా డిమాండు వుంది. అందుకే వాటిని స్మగుల్డు చెయ్యాలనుకున్నాను. అందుకు అనుకూల పరిస్థితులు చూసుకున్నాను. ఈ హోటల్ పక్కన ఖాళీస్థలంలో అమ్యూజ్‌మెంటు పార్కు పెట్టుకున్నాను. ఈలోపల స్నేక్ పార్కుని కూడా మెయిన్ టెయిన్ చేస్తున్నాను. చూడటానికి స్నేక్ పార్కులా విజిటర్స్‌కి ఆనందం కలగజేస్తూ, ఆ పాముల చర్మాలతో భారీగా వ్యాపారం చేస్తున్నాను.

"సో, మిస్టర్ కిరణ్! ఇప్పుడు నేను కోటీశ్వరుణ్ని. లోకం దృష్టిలో దివాకర్‌గా చచ్చిపోయి మరో అవతారం ఎత్తాలనుకున్నాను. విదేశాలకుపోయి సుఖంగా

బతకాలనుకున్నాను. అందుకే ఓ శవాన్ని ఖండాలుగా చేసి అది నా శవంగా నిరూపించాలని ప్రయత్నించాను. ఆ ఖండాలని హైదరాబాదు క్రైంబ్రాంచ్‌కి పంపాను. కాని దురదృష్టవశాత్తూ అది నాది కాదని నిర్ధారణ జరిగి పోయింది. కథ మళ్ళీ మొదటికి వచ్చింది.

"శత్రువులు చంపినట్లు నమ్మించాలని నేను ప్రేమించిన శకుంతలని కూడా పెట్రోలుపోసి తగలబెట్టించాను. అది నా అసిస్టెంటు చూసుకున్నాడు. అయితే అదీ ఫలించ లేదు. శకుంతలని రక్షించే ప్రయత్నంలో నా అసిస్టెంటు ఒళ్ళు కాల్చుకున్నాడుగాని శ కుం త ల ని రక్షించలేక పోయాడు. నిజానికి శకుంతల ఆత్మహత్య చేసుకున్నట్టు ప్రజల్ని నమ్మించి, ఆమెని యిక్కడికి తీసుకురావాలను కున్నాను. కాని నా అసిస్టెంటు అజాగ్రత్తవల్ల ఆమె ఆహుతి అయిపోయింది. నా అసిస్టెంటు తన అజాగ్రత్తకు ఫలితం నా చేతుల్లో అనుభవించాడు.

"శకుంతలని పోగొట్టుకున్న నా జీవితం వ్యర్థమనిపిం చింది. కాని, శకుంతలకోసం నా జీవితాన్ని మోడు చేసుకోలేను కదా! అందుకే నా ఫారిన్ ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు పూర్తిచేసుకున్నాను. ఈ లోపల అనవస రంగా యిన్వెస్టిగేషన్ బయల్దేరి నీ ప్రాణంమీదికి తెచ్చు కున్నావు.

"అదిగో నీ వెనకనే నీ ఫ్రెండు శ్రీనివాస్ కూడా లోపలికి వచ్చి నా ఆతిథ్యం స్వీకరించటానికి ఉబలాట పడుతున్నాడు. హల్లో, కమాన్ మైడియర్ జమిందార్ ఇన్‌స్పెక్టర్!" అన్నాడు దివాకర్ నవ్వుతూ గుమ్మం వైపు చూసి.

కిరణ్ తలతిప్పి చూశాడు. గుమ్మంలో శ్రీనివాస్‌ని

పెడరెక్కలు విరిచి లోపలికి తీసుకొస్తున్నారు యిద్దరు మనుషులు. అతని కళ్ళకు నల్లటి గంతలు కట్టారు. శ్రీనివాస్ గింజుకుంటున్నాడు. కాని వాళ్ళు పట్టు వదలటంలేదు.

శ్రీనివాస్, దివాకర్ వంక చూసి ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. "మిష్టర్ ఎక్స్ జీరో టూ, మీరా?" అన్నాడు.

"ఎస్! మైడియర్ ఇన్ స్పెక్టర్. నేనే అయామ్ దివాకర్!" అన్నాడు దివాకర్ నవ్వుతూ.

"మరి యిదేమిటి? నన్నిలా బంధించి తీసుకొస్తున్న ఈ మనుషులెవరు?"

"వాళ్ళు మనవాళ్ళేలే! నన్ను పట్టుకోవాలని మీరిద్దరు వస్తే మీ యిద్దర్నీ మావాళ్ళు పట్టుకున్నారు. ఒకే డిపార్టుమెంటు వాళ్ళంకదా! ఒకరినొకరు పరస్పరం గౌరవించుకోవటం ఫార్మాలిటీ కదా!" దివాకర్ నవ్వులో విషం తొంగిచూస్తోంది.

కిరణ్ దివాకర్ వైపు సూటిగా చూసి, "మిష్టర్ దివాకర్! నువ్వు చేస్తున్న ద్రోహం నీ దేశానికే కాదు, నీ ఆత్మకు కూడా! ఆత్మ ద్రోహం మంచిదికాదు. నీ అంతరాత్మే నిన్ను నిలదీసే గడియవస్తుంది. అప్పుడు నువ్వేం సమాధానం చెప్పుకుంటావో చెప్పుకో!" అన్నాడు.

దివాకర్ పగలబడి నవ్వాడు — "ఈ పనికిమాలిన సెంటిమెంట్సు నా దగ్గర పనికిరావు. ఆత్మ, ద్రోహం ఈ మాటలకు నా డిక్షనరీలో అర్థాలు లేవు. సో, లివ్ దెమ్ టు డాగ్స్!" అన్నాడు.

కిరణ్ లాల్చి జేబులోకి చేయి పోనివ్వబోయాడు.

దివాకర్ ఫెళ్ళున నవ్వి, "వృథా ప్రయాస! నీ

రివాల్వర్ యెప్పుడో మా స్వాధీనమయింది. మిస్టర్ కిరణ్! నువ్విలాంటి పనేదో చేస్తావని మాకు ముందే తెలుసు. శ్రీనివాస్ జేబులో కూడా పిస్తోలుతీసి, మా వాళ్ళు అట్టే పెట్టుకున్నారు" అన్నాడు.

కిరణ్‌కి ఏదో అనుమానం వచ్చింది. నోరు తెరిచి అడగ బోయి అంతలోనే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

శ్రీనివాస్‌కి యెక్కడో మెలిక వున్నట్టనిపిస్తోంది. కాని లింక్ అందటంలేదు.

"తెల్లవారేవరకు మా అతిథులుగా వుండండి. తెల్ల వారేసరికి మేము యెక్కిన ఫ్లైట్ గల్ఫ్ కంట్రీస్‌లో ల్యాండవుతుంది. తెల్లవారేసరికి మీ యిద్దరి ప్రాణాలు పరలోకంలో, మరో జన్మ ఎత్తటానికి మీ ఆత్మలు మరో రెండు శరీరాలకోసం వెతుక్కుంటూ వుంటాయి" అంటూ పడిపడి నవ్వాడు దివాకర్.

ఆ నవ్వు, ఆ మాటతీరు—అంతా అగమ్యంగా అనిపి స్తోంది శ్రీనివాస్‌కి. కిరణ్ తన అనుమానం బయట పెట్టబోయి, అది సమయంకాదని విరమించుకున్నాడు.

"వీళ్ళిద్దర్నీ అండర్ గ్రౌండ్‌లో వేసెయ్యండి. నేను మళ్ళీ చెబుతాను — అప్పుడు మొసళ్ళకు ఆహారంగా వేసేద్దురుగాని!" అన్నాడు దివాకర్ తన అనుచరులతో.

కిరణ్ శ్రీనివాస్‌లను చేతులు వెనక్కి విరిచి కట్టేసి మళ్ళీ గంతలు కట్టారు కళ్ళకు.

## 9

ఏకాంతం లభించగానే తన మనసులోనిమాట అడిగే శాడు కిరణ్ శ్రీనివాస్‌ని.

"ఎంతసేపూ దివాకర్ హిందీలోనే మాట్లాడాడు.

తెలుగు రాదా?" అని.
శ్రీనివాస్‌కి లింక్ అందింది.
"బ్రదర్, అసలు విషయం తెలిసిపోయింది.
"ఏమిటి?"
"మనం చూసిన దివాకర్ అసలు దివాకర్ కాదు. ఏజెంట్ ఎక్స్ జీరో టూ కాదు."
"అదే నా అనుమానం కూడా. ఎంత సేపూ అతను హిందీలో మాట్లాడుతున్నాడు. తెలుగువాడు కాదేమోనని అనుమానం వచ్చింది. అడగబోయి రెండుసార్లు విరమించుకున్నాను."
"నాకు ఆ కంఠం విన్నప్పుడే అతను దివాకర్ కాదని తట్టవలసింది. కాని అతను అచ్చం దివాకర్‌లాగానే వుండటంతో ఆ అనుమానం బయటికి రాలేదు. ఆ నవ్వు, కంఠం అన్నీ దివాకర్ కాదని ఓ పక్క చెప్తూనే వున్నాయి. దివాకర్‌ది సన్నటి గొంతు. హిందీ సరిగ్గా రాదుగాని, నేర్చుకుంటున్నాడు."
"సో, మనల్ని రాంగ్ ట్రాక్ పట్టించటానికి శత్రువు భలే నాటకం ఆడాడు. దానివల్ల అతనికొచ్చిన లాభమేమిటో అర్థంకాదు. అసలు దివాకర్ ఏమయినట్టు? బతికున్నాడా, చంపేశారా? ఈ విషయాలు కన్ఫర్మ్ కావలసి వుంది."
"తను సంపాదించినదంతా తీసుకుని ఈ గ్రేట్ స్మగ్లర్ గల్ఫ్ కంట్రీస్‌కిపోయే మాటమాత్రం నిజం! బెదిరికున్నాదేగాని, మనల్ని చంపకపోవచ్చు"
"యు ఆర్ రైట్! ప్రభుత్వం దృష్టిలోను, ప్రజల దృష్టిలోను దివాకర్ 'విలన్' అని యిమేజ్ సృష్టించటానికి మనల్ని వాడుకుంటాడు. ఈ విషయం బయట

లోకానికి చెప్పటానికి మనం బతికే వుండాలి కదా! అంచేత మనకి ఎలాంటి హాని చెయ్యడు. తను తప్పించుకు పోయేంతవరకు మనకీ బందిఖానా తప్పదు. బహుశా వాడు వెళ్ళిపోయేముందు మనకి స్పృహతప్పించి ఎక్కడో రోడ్డున వదిలేస్తాడు" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ ఏదో చెప్పబోయేంతలో చేత్తో వారించాడు కిరణ్. యెక్కడో సన్నటి మూలుగు శబ్దం వినిపిస్తోంది. ఎవరిది?

శ్రీనివాస్ చెవులు రిక్కించి విన్నాడు. కిరణ్ వంక సాభిప్రాయంగా చూశాడు.

కిరణ్ చుట్టూ చూశాడు. గాలి వెలుతురులేని యిరుకు గది అది. ఒకే ఒక ద్వారం వుంది. సన్నటి ద్వారం. దానికి యినప తలుపు. బయట తాళం పెట్టేశాయ. తప్పించుకోవటము నేడి చాలా కష్టం!

కిరణ్ యినప తలుపుకున్న చువ్వల్లోనించి బయటికి చూశాడు. యమకింకరుల్లాంటి పోతపోసిన విగ్రహాల్లా వున్న వ్యక్తులిద్దరు బయట విస్కీమత్తులో జోగుతున్నారు. వాళ్ళ చేతుల్లో ద్రవంతో వున్న సీసా లున్నాయి.

కిరణ్ తలుపుమీద చప్పుడు చేశాడు. అందులో ఒకడు ఇటు చూసి "క్యాహోనాబే?" అన్నాడు నిర్లక్ష్యంగా.

కిరణ్ వేలు చూపించాడు.

వాడు దగ్గరగా వచ్చాడు. తాళంతీశాడు. కిరణ్ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా వాడ్ని లోపలకులాగి వాడి మెడకు వెనకనుంచి చేతులు పెనవేసి తలముందుకి బలంగా వంచాడు.

వాడి మెడనరాలు పటపటమన్నాయి. వాడి మూడు

మీద రెండు చేతులు బిగించి ఒక్క దెబ్బ వేశాడు కిరణ్.

అంత పెద్ద పహిల్వానులాంటి మనిషీ నేల కరిచాడు.

ఈలోపల రెండోవాడు చకచక వచ్చాడు తూలు తుంటూ. ఉత్తరక్షణంలో పూని వాడి పొట్టలోను ముఖం మీద పిడికిళ్ళు బిగించి కొట్టాడు కిరణ్. శ్రీనివాస్ వాళ్ళిద్దర్నీ, కిరణ్‌ని మార్చి మార్చి చూశాడు.

రెండోవాడు కూడా నేలకూలిపోయాడు. శ్రీనివాస్ కిరణ్ హస్త నైపుణ్యం ఆశ్చర్యంగా చూస్తున్నాడు. తనకి పోలీస్ ట్రయినింగ్‌లో కూడా ఇలాంటి సులువైన ఫైట్సు నేర్పలేదు. కిరణ్‌కి ఎలా పట్టుబడ్డాయి?

"పద, శ్రీనివాస్! ఆలోచనల కిది సమయంకాదు. ఇక్కడే యెక్కడో దివాకర్‌ని బంధించి వుంటారు. మనం అతన్ని రక్షించాలి! ఈ రాత్రికి రాత్రే యీ లయిన్‌గాడి అంతు తేల్చెయ్యాలి! చరమగీతం పాడ టానికి ఈ రాత్రే ముహూర్తం" అన్నాడు కిరణ్ ముందుకి ఉరుకుతూ.

అది నేల మాళిగ. పైకి మెట్లున్నాయి. కిరణ్ యిందాకా మూలుగు శబ్దం వినిపించినవైపు చకచక అడుగులు వేశాడు. చుట్టుపక్కలంతా నిశ్శబ్దం రాజ్య మేలుతోంది.

కిరణ్ తమని బంధించిన గదిలాంటిదే మరొకటి అక్కడ వుండటం గమనించి, లోపలికి తొంగిచూశాడు. మూలుగు శబ్దం అక్కడినించే వస్తోంది.

కిరణ్ ఆనందంతో సన్నగా అరిచాడు లోపలి మనిషిని చూసి.

అతను దివాకర్! సీక్రెట్ ఏజెంట్ ఎక్స్ జీరో టూ!

# 10

అతని కాలివేళ్ళు ముక్కలుగా కోసేశారు. చెవులకి చిల్లులు పెట్టారు. ముక్కు సగంకోసి, మాంస ఖండరం వేలాడేలా అలాగే వదిలేశారు. చేతివేళ్ళు కణుపుల వరకు నరికేశారు.

ఆ దృశ్యం యెంతోసేపు అలా చూడలేకపోయాడు కిరణ్. శ్రీనివాస్ దివాకర్ వంక దీనంగా చూస్తూండి పోయాడు.

కిరణ్ రెండు అంగల్లో తమని బంధించిన చీకటిగది దగ్గరకొచ్చి, తలుపుకున్న తాళాలగుత్తి తీసుకొచ్చాడు. అందులో దివాకర్ని బంధించిన గదితాళముంది. రెండు క్షణాల్లో తెరిచి లోనికివెళ్ళారిద్దరు.

దివాకర్ బాధతో మూలుగుతున్నాడు. గాయాల మీద కారం చల్లినట్టున్నారు. ఆ బాధను అతను తట్టుకో లేక మూలుగుతున్నాడు. చిత్రహింసపెట్టి అతన్నుంచి ఏదో సమాచారం రాబట్టాలని లయన్ ముఠా ప్రయ త్నించినట్టు అర్థంచేసుకున్నారు వాళ్ళు.

"మిష్టర్ దివాకర్ ....ఏజెంట్ ఎక్స్ జీరో టూ ..." అంటూ పిలిచాడు కిరణ్ అతని చెవిలో.

దివాకర్ భారంగా కళ్ళెత్తి చూశాడు.

"అయామ్ డిటెక్టివ్ కిరణ్. ఈయన ఇన్స్పెక్టర్ శ్రీనివాస్!" అన్నాడు కిరణ్ అతని చెవిలో.

దివాకర్ కళ్ళు మెరిశాయి.

"మా అజాగ్రత్త కారణంగా మీరు వీళ్ళకు దొరికి పోయారు. వీళ్ళ వెంటనే మేమూ హోటల్ తాజ్కి వచ్చాం. కాని అప్పటికే మిమ్మల్ని కిడ్నాప్ చేసి తీసు కొచ్చేశారు లయన్ ముఠా!" అన్నాడు కిరణ్.

దివాకర్ తలూపాడు.

"మీ వేషంలో లయిన్ మాకు దర్శనమిచ్చాడు. మీరే ఈ దురాగతాలన్నిటికీ కారణమని మమ్మల్ని నమ్మించాడు. కాని వాడ్ని మేము కనిపెట్టేశాం. చూడబోతే వీళ్ళు మిమ్మల్ని చిత్రహింసలపాలు చేసినట్టు కనిపిస్తోంది. ఎందుకు చేశారిలాగ? మీరు వాళ్ళ రహస్యాలు కనుక్కోవటానికి వచ్చారనా? మాకు వీళ్ళ గురించి యిన్ఫర్మేషన్ యిచ్చారనా? యెందుకు?" అడిగాడు శ్రీనివాస్.

దివాకర్ జాలిగా చూశాడు. బాధగా మూలిగాడు.

నాలిక చాపి చూపించాడు.

చూస్తూన్న యిద్దరికీ గుండెలు ద్రవించాయి. గుండెల్ని పిండినట్టనిపించింది.

దివాకర్ నాలుక సగం తెగ్గొట్టేశారు.

ఎంత దారుణం! యెన్నోరకాల చిత్రహింసలు చూసిన శ్రీనివాస్‌కి దివాకర్‌కి వాటిల్లిన దురవస్థ చూసి కంట నీరు తిరిగింది.

కిరణ్ శ్రీనివాస్‌ని తొందరచేశాడు. "మనకున్న సమయం చాలా తక్కువ. అమూల్యమైనది కూడా. ఈ రాత్రే లయిన్ తనవాళ్ళతో ఫారిన్ పోవటానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాడు. చేజారిపోతే మళ్ళీ మనకు చిక్కడు. ఇక ఎన్నటికీ మనకు దొరక్కుండా తప్పించుకుపోతాడు. దివాకర్ గారు యిప్పుడేమీ చెప్పలేరు. ఏదయినా చెప్పాలనుకున్నా రాసిచూపించగలరు. మన ప్రస్తుత కర్తవ్యం ఈయన్ని బయటికి సురక్షితంగా చేర్చటం! రెండోది లయిన్ ముఠాని పూర్తి సాక్ష్యాధారాలతో బంధించి, అతని దారులన్నీ కట్టెయ్యటం!

హారియప్! యిందిక్కడినుంచి బయటపడటం చాలా ముఖ్యం!" అన్నాడు.

"ఎలా? నాకు దారి తెలీదే! మనిద్దరికీ గంతలు కట్టి తీసుకొచ్చారు కదా!" అన్నాడు శ్రీనివాస్.

డిటెక్టివ్ కిరణ్ వాచీ చేతినుంచి తీసి, వెనకపక్క కప్పు ఊడదీశాడు. లోపల చిన్నసైజు ట్రాన్స్‌మీటర్ వుంది. దాంట్లో వైర్‌లెస్ మెసేజ్ పంపే సౌకర్య ముంది. వెంటనే పెట్రోలింగ్ వాన్‌కి సంకేతాలు పంపించాడు.

బొంబే పెట్రోలింగ్ వాన్‌కి కదలికన్ని మొదలయ్యాయి. క్షణాలమీద హోటల్ లోటస్ వెనుక పక్కనున్న అమ్యూజ్‌మెంట్ పార్కు విషయం మెసేజ్ వెళ్ళిపోయింది మొబైల్ పెట్రోలింగ్ వాన్‌కి. తగిన సిబ్బందితో వెంటనే పార్కుని, హోటల్ని ముట్టడించ బోతున్నట్టు జవాబు వచ్చింది.

"మనం యిక్కడికొచ్చేముందు జుహూ బీచ్‌పక్కనున్న మొబైల్ స్క్వాడ్‌కి యిన్ఫర్మేషన్ యిచ్చాను. ఈ ట్రాన్స్‌మీటర్లో వాళ్ళ వైర్‌లెస్ సెట్‌కి అనుగుణంగా చిన్న మార్పులు చేశాను. అవసరమైతే మనల్ని ఫాలో కావలసిందిగా ఆదేశాలు యిదివరకే జారీ చేయబడ్డాయి కదా! ఇప్పుడు వాళ్ళ పని పడింది" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ ప్రశంసగా ఏదో అనబోతుండగానే కిరణ్ వారించి, "ముందు జరగాల్సిన పని చూడు. ఎవరి కళ్ళబడకుండా దివాకర్ గార్ని బయిటికి చేర్చగలగటం సామాన్యమైన విషయంకాదు. నేను ముందు బయటికి పోయేదారి చూస్తాను. నువ్వు ఈయన్ని బయటికి చేర్చు"

అన్నాడు లేచి నిలబడుతూ.

దివాకర్ చటుక్కున కిరణ్ చెయ్యి పట్టి ఆపాడు. ఏదో వ్రాయాలని సైగ చేశాడు. కిరణ్ లాల్చీ లోపలి జేబునుండి కాగితం తీశాడు. అది దివాకర్ రాసిచ్చిన ప్లాన్ కాగితం! ఎందుకో దాన్ని లయిన్ మనుషులు తీసుకోలేదు. ఏదో పిచ్చిబొమ్మలా కనిపించి వుంటుంది వాళ్ళ కళ్ళకి!

శ్రీ ని వా స్ పైజమాకి తగిలించుకున్న పెన్ తీసి అందించాడు.

దివాకర్ దానిమీద రెండేమాటలు రాశాడు అచ్చ తెలుగులో. "శకుంతల కులాసా నా?" అని.

అది చదివిన డిటెక్టివ్‌ల మనసు కరిగిపోయింది.

కిరణ్ నెమ్మదిగా అన్నాడు. "ఆమెని లయిన్ మనుషులు హత్య చేశారు. పెట్రోల్ పోసి తగలబెట్టారు."

దివాకర్ చిగురాకులా ఒణికిపోయాడు.

"అయామ్ సారీ మిష్టర్ దివాకర్, సో సారీ!" అన్నాడు కిరణ్ అతని భుజం తట్టి.

దివాకర్ కళ్ళు సంతతధారగా స్రవిస్తున్నాయి.

కిరణ్ చకచక మెట్లవైపు నడిచాడు. అక్కడ కాపలా మనుషులెవరైనా వున్నారేమో చూశాడు. యెవరూ లేకపోవటంతో చకచక మెట్లెక్కాడు. చప్పుడుకాకుండా నడవాలోకి నడిచాడు. అక్కడంతా చీకటిగా వుంది.

తడుముకుంటూ నడుస్తూ కాలికి గట్టిగా ఏదో తగలటంతో చటుక్కున ఆగాడు. అది చెక్కపెట్టె. కేష్ పెట్టె. పెమూత ఊడిపోయింది కిరణ్ తాకిడికి.

కిరణ్ చెయ్యిపెట్టి తడిమి ఒళ్ళు గగుర్పాటు చెందగా

చటుక్కున చెయ్యి తీసేశాడు.

పాము చర్మాలు! ఆ స్పర్శకి అతని వెన్నున జరజర ఏదో పాకినట్టయింది. ఇలాంటి పెట్టెల్లో ప్యాక్ చేసి పైన మరేదో పెట్టి, ఓడల్లో ఎక్స్‌పోర్ట్ చేస్తూండి వుండవచ్చు.

కిరణ్ ఆలస్యం చెయ్యలేదు. వరండాలోనించి సన్నగా వెలుతురు పడుతోంది. ఆ పక్కగా పిల్లిలా నడిచాడు. వెలుతురు లోపలి హాల్లోంచి పడుతోంది. ఆ హాలు గుర్తుపట్టాడు. తను, శ్రీనివాస్‌లు తీసుకురాబడ్డ లయిన్‌ని దివాకర్‌గా పరిచయం చేసుకున్న హాలు అది! అక్కడినుంచి బహుశా అమ్యూజ్‌మెంటు పార్కు ముందరి హాలుకి కనెక్షన్ ఉండివుండాలి!

కిరణ్ ఊహ నిజమయింది. అక్కడ్నించి తనకు తల మీద మోది స్పృహతప్పించిన హాల్లోకి సరాసరి దారి వుంది. ఇక ముందుకి పోవలసిన పనిలేదు. ఆ తర్వాత జూదాలు, కాబరే డాన్సులు, అవన్నీ తనకి తెలిసిన వారే!

కిరణ్ వెనుతిరిగాడు. ముందరి హాల్లోంచి మెట్లవైపు నడవాకి చేరుకున్నాడు. కాని అతనికేదో అనుమానం తడుతోంది మనసుకి. వాతావరణంలో ఏదో తేడా వచ్చినట్టు స్పష్టంగా తెలుస్తోంది. అందుకు కారణం— అంతవరకు చీకటి కోణంగా వున్న లయిన్ స్థావరమంతా దేదీప్యమానంగా వెలుగుతోంది.

మెట్లు దిగబోతూ ఆగిపోయాడు కిరణ్.

పై మెట్టుమీదనే ఓ మనిషి చేతిలో గన్ పట్టుకుని నించున్నాడు. మెట్ల దిగువ నేలమాళిగ కూడా వెలుగు కాంతుల్లో పట్టపగలులా వుంది.

మధ్యగా దివాకర్, శ్రీనివాస్‌లు యిద్దరు పెడ

రెక్కలు విరిచికట్టబడి నిలబడి వున్నారు. వాళ్ళిద్దరికీ గురిచూసి చుట్టు వలయాకారంగా లయన్ మనుషులు గన్స్‌తో సిద్ధంగా వున్నారు. వాళ్ళ చేతుల్లోని గన్స్ ఏ క్షణంలోనైనా దివాకర్ని, శ్రీనివాస్‌ని కాల్చేయటానికి సిద్ధంగా వున్నాయి.

ఓ పక్కగా అంతదాకా దివాకర్‌లాగా నటించిన లయన్ తన సహజరూపంతో నించుని వున్నాడు. అతని చేతిలో రివాల్వర్ వుంది. అది కూడా వాళ్ళిద్దరికీ గురి పెట్టి వుంది.

లయన్ నల్లగా వున్నాడు. మిడిగుడ్లు ఎర్రగా రక్తం చిందిస్తున్నాయి. అతని ఛాతీమీద తెల్లటి బనీను, ఆ బనీనుమీద సింహాంతల ముద్రవేసి వుంది!

"దివాకర్, నిన్ను యెందుకు బతికించి వుంచానో తెలుసా! నా రహస్యాలు పేపరుమీద రాసి ఎక్కడో దాచివుంచావన్నావు. అది యింకా బయటివాళ్ళెవరికీ పోలేదని నాకు తెలుసు. అందుకే నీ హోటల్ రూం అంతా వెతికించాను. కాని అదెక్కడా కనిపించలేదు. దాన్ని నాకు అందచేసేవరకు నీకు కూడు లేకుండా మాడ్చి చిత్రహింసపెట్టాను. అయినా నువ్వు మొండి వాడివి. అది అందచేయలేదు. కాని యిప్పుడు యీ డిటెక్టివ్‌లతో చేతులుకలిపి తప్పించుకు పోవాలనుకున్నావు. ఇక నిన్ను క్షమించేదిలేదు. నా చేతుల్తో నే నిన్ను ఈ లోకంనించి పంపెయ్యాదలచుకున్నాను. దేవుడ్ని ప్రార్థించుకో!" అంటూ సేఫ్టీ కాచ్ తప్పించి ట్రిగ్గర్ మీద వేలుంచాడు లయన్.

కిరణ్ స్ప్లిట్ సెకండ్‌లో పై మెట్టుమీదున్న కాపలావాడి చేతిలో గన్ లాక్కుని, వాడ్ని మెట్ల

మీదినుంచి కిందికి తోసేశాడు. మరుక్షణంలో దివాకర్ కి రివాల్వర్ గురిపెట్టిన లయిన్ చెయ్యి రక్తంతో ధారలు కట్టింది. రివాల్వర్ కిందపడిపోయింది. కిరణ్ చేతిలోని గన్ ఒకసారి గర్జించింది.

కిరణ్ మెట్లుకిందికి దూశాడు. సరాసరి లయన్ ముందుకొచ్చి అతని గుండెలపై తుపాకీ గురిచేశాడు.

"మిష్టర్ లయిన్! నీవాళ్ళనందర్నీ గన్స్ కిందపడేయ్యమని ఆదేశించు—లేకుంటే నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను" అన్నాడు కిరణ్.

లయిన్ ఉక్రోషంతోను కోపంతోను సింహనాదం చేశాడు. తనవాళ్ళవంక సైగచేశాడు. చేతులు రెండూ పైకెత్తేశాడు.

అయితే ఇంతలో వూహించనివిధంగా ఓ మూలనుండి ఓ అనుచరుడు దొంగదెబ్బతీశాడు. కిరణ్ కి గురిచూసి కాల్చాడు. అయితే అమాంతం దివాకర్ కిరణ్ కి అడ్డొచ్చేశాడు. గుండు దివాకర్ భుజంలోనుంచి దూసుకుపోయింది.

కిరణ్ కళ్ళు కృతజ్ఞతతో మెరిశాయి. రెండో బుల్లెట్ తన గన్ నించి బయటికి రాకముందే ఆ అనుచరుడి గుండెల్లోంచి కిరణ్ గన్ లోని గుండు దూసుకుపోయింది.

సరిగ్గా అదే సమయంలో మొబైల్ పెట్రోలింగ్ వాన్ స్టాఫ్ తోబాటు ఒక్కసారిగా వందల సంఖ్యలో పోలీసులు ఆ నేలమాళిగనిండా నిండిపోయారు.

ఎక్కడివాళ్ళనక్కడే అదుపులోకి తీసుకున్నారు.

లయిన్ రహస్యంగా దాచిన ప్యాకేజీ పెట్టెలన్నీ స్నేక్ లెదర్సుతోబాటు దొరికిపోయాయి. మరో పక్క

గంజాయికూడా పట్టుబడిపోయింది.

దివాకర్ నోటినుంచి రక్తం కారుతోంది. భుజంనించి రక్తం కారుతోంది. అతని కాలివేళ్ళనుంచి, చేతివేళ్ళనుంచి రక్తం కారుతోంది. కాని అతని కళ్ళుమాత్రం తేజోవంతంగా వెలిగిపోతున్నాయి. మాతృదేశం మీద భక్తితో పవిత్రతను సంతరించుకున్నాయి.

కిరణ్ కి సైగచేశాడు. అదే కాగితంమీద పెన్ తో స్కెచ్ గీశాడు. అది హోటల్ తాజ్ రూంలోని వస్తువుల్ని సూచించే స్కెచ్, రాక్ లోని ఓ పుస్తకం పేరు రాశాడు. దాని రేపర్ వెనుక లయిన్ ఏజెంట్ల లిస్టు, వాళ్ళ వివరాలు అడ్రసులతో బాటు పదిలపరిచిన విషయం ఆ కాగితంమీద రాశాడు.

కిరణ్ అతన్ని అక్కున చేర్చుకున్నాడు. దివాకర్ లాంటి దేశభక్తుడ్ని, కార్యదీక్షాపరుడ్ని కన్న భారత మాత జన్మ ధన్యమయిందనుకున్నాడు.

దివాకర్ కళ్ళు కిరణ్ వంక నిశ్చలంగా చూస్తున్నాయి. అవి యింకా తేజస్సును వెదజల్లుతూనే వున్నాయి. పవిత్రతను, కార్యదీక్షను ప్రతిఫలిస్తూనే వున్నాయి.

—:ఐ పో యిం ది:—

# బందిపోటు నాయకుడు

## బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

తెల్లవారింది.

తెల్లవార్లూ ఆలోచనలతోనే సతమతమయ్యాడు కిరణ్. గజేందర్ వుంటున్న రహస్య స్థావరం యెక్కడుందో అతని కంతుబట్టలేదు.

మొదట బయలుదేరిన స్థలంలోనే కళ్ళకు గంతలు కట్టేశాడు గజేందర్. కాసేపు వెనక్కి కాసేపు ముందుకి పక్కలకు నడిపించాడు. ఆ తర్వాత ఇక్కడికి నడిపించు కుంటూ తీసుకొచ్చాడు. అప్పుడుకూడా రెండుసార్లు ఎడమ పక్కకి మూడుసార్లు కుడిపక్కకి మలుపులు తిప్పించి అక్కడికి తీసుకొచ్చాడు.

కిరణ్ మస్తిష్కంలో అతనొచ్చిన దారి, గుర్తులు ముద్రపడిపోయాయి. బయటికి పోయేదారి పదేపదే మననం చేసుకున్నాడు. పెన్‌పహాడ్ కొండ ప్రాంతంలో ఎక్కడి నుంచో దారివుందిక్కడకు. అది యెక్కడ ప్రారంభ

మయిందో, సారంగ మార్గానికి స్టాపింగ్ పాయింట్ యెక్కడో—అదే అంతుబట్టడంలేదు.

గజేందర్‌లాంటి వాళ్ళు ఇంకా నలుగు రున్నారు—అతనుకాక వీళ్ళ అయిదుగురిమీద ఓ నాయకు డున్నాడు. అతడే సూత్రధారి. అరాచక పరిస్థితుల్ని సృష్టించి దేశ పరిస్థిని అల్లకల్లోలం చేస్తూ ఖజానా నింపిస్తూన్న వ్యక్తి వేరేవున్నాడు.

ఎవరతను? స్వదేశీయుడా? విదేశీయుడా? యెందుకీ దేశాన్ని ముఖ్యంగా తమ రాష్ట్రాన్ని దోచుకుంటు న్నాడు.

సవాలక్ష ప్రశ్నలతో కిరణ్ మస్తిష్కంలో వేడెక్కి పోయింది.

"హల్లో బ్రదర్, రాత్రి నిద్ర బాగా పట్టిందా?" అంటూ లోనికొచ్చాడు గజేందర్.

కిరణ్ పలకరింపుగా నవ్వాడు.

"ఆc. చాలాబాగా పట్టింది. చక్కటి విందు భోజనం పెట్టించావు. ఆ తర్వాత మెత్తటి పరుపులతో పక్క ఏర్పాటుచేశావు. ఏనుగుల చేత తొక్కించినా మెలకువ రానంత గాఢంగా నిద్రపట్టేసింది" అన్నాడు.

గజేందర్ నవ్వాడు.

"నిన్ను మా ముఠాలో చేర్చుకోవటానికి బాస్ అనుమతి తీసుకోవాల్సి వుంది. నువు కాలకృత్యాలు తీర్చుకున్నాక బాస్ దగ్గరకు వెళ్దాం. ఆయన ఓ.కే. అన్నారంటే ఇక అంతా లైన్ క్లియరే! యెవరైనా బాస్‌ముందు ఓకే చేస్తేనేకాని మాలో కలవ నివ్వరు. మొదట్లో నేను మరో ముఠా - ఇద్దరమే వుండేవాళ్ళం. తక్కిన ముగ్గురు తర్వాత బాస్ చేర్చుకున్నారు. వాళ్ళు

ఒకరు మహారాష్ట్ర, మరొకరు మధ్యప్రదేశ్, మరొకడు చంబల్ లోయ ప్రాంతానికి చెందిన పెద్ద గజదొంగల ముఠాకి చెందినవాడు. బాస్ ఈ మూడు ముఠాలని తమ ఆధిపత్యం కిందికి తెచ్చుకున్నాడు.

"ప్రస్తుతం అయిదు ముఠాలు ఇక్కడే అంటే ఆంధ్రాలోనే పనిచేస్తున్నాయి. ముఖ్యంగా మూడు ముఠాలు రాజధానిలో వున్నాయి. తక్కిన రెండు సంచార కేంద్రాల లాగా రాష్ట్రంలో అక్కడక్కడ దారిదోపిడీలు, మేజర్ బ్యాంకి దోపిడీలు కండక్ట్ చేస్తున్నారు" చెప్పాడు గజేందర్.

కిరణ్ శ్రద్ధగా వింటున్నాడు.

గజేందర్ చెప్పిన ప్రతి విషయం అతని మెదడులో శాశ్వతంగా రికార్డయిపోయాయి. అసలు సూత్రధారుడు యెక్కడుంటాడో, ఎలా వుంటాడో చూడాలి. అతన్ని పట్టుకుంటే చాలు, తక్కిన అందరి జాతకాలు బయటికొస్తాయి.

గజేందర్ కిరణ్‌తో మళ్ళీ మరోసారి సిద్ధంగా వుండమని చెప్పి, ఎలక్ట్రానిక్ పరికరాలున్న చెంతకు వెళ్ళాడు.

కిరణ్ అతనికి కనిపించకుండా అనుసరించాడు. గజేందర్ టి.వి.వంటి సాధనం ముందు కూచుని ఏదో మీటను నొక్కాడు.

తెరమీద చలనం ఆరంభమయింది. కాసేపు అడ్డగీతలు వచ్చి స్క్రీన్ మీద అంతా గందరగోళంగా కనిపించింది. తర్వాత చిత్రం స్థిరంగా కనిపించింది. అందులో ముఖం కనిపించకుండా వీపుమాత్రమే కనిపించేటట్టు వెనక్కి తిరిగి కూచున్నాడో వ్యక్తి.

బహుశా అతనే గజేందర్ చెప్పిన సూత్రధారుడు-బాస్ కావచ్చునని వూహించాడు కిరణ్.

గజేందర్ యెదురుగా వున్న మైక్రోఫోన్ తీసి చేత పట్టుకున్నాడు. అందులో తన గురించే మెసేజ్ పంపిస్తూ తను సాధించిన ఘనకార్యాల్ని గురించి వాళ్ళ బాస్‌తో వర్ణించి చెపుతున్నాడు.

బాస్ గట్టిగా నేలతన్ని లేచినిలబడ్డాడు. ఆ చర్యను బట్టి అతనికి కోపం వచ్చిందని గ్రహించాడు కిరణ్.

అతనికెందుకు కోపం వచ్చిందో గజేందర్‌కి అర్థం కాలేదు మొదట్లో. అప్పుడు కూడా బాస్ ఇటు' తిరగలేదు. వెనక పెట్టుకునే వున్నాడు.

హిందీలో గంభీరంగా వినపడింది. "నువ్వు నీ స్థావరంలోకి తీసుకొచ్చిన వ్యక్తి దొంగ కాడు, బందిపోటూ కాదు. అతను పోలీసుల తాలూకు మనిషి కావచ్చునని నే ననుమానిస్తున్నాను. బాగా అబ్జర్వ్ చెయ్యి. అనుమానమొస్తే నా ప్రమేయం లేకుండానే అక్కడికక్కడే పారెయ్యి. బీ కాషస్!" అని.

గజేందర్ ముఖంలో చకచక రంగులు మారిపోయాయి.

"మీ దగ్గరకు తీసుకువద్దామనుకున్నాను. అయితే అక్కర్లేదా సార్?" అనడిగాడు గజేందర్.

"నో. అతని నిజస్వరూపమేమిటో నువ్వే ముందు కనిపెట్టు. నమ్మకస్తుడని అనిపిస్తేనే తీసుకురా! యే మాత్రం పిచ్చివేషాలు వేసినా నిర్దాక్షిణ్యంగా అతన్ని, అనుచరుల్ని కాల్చిపారెయ్యి" ఆజ్ఞాపించాడు బాస్. అతనుకూడా హిందీలోనే మాట్లాడుతున్నాడు.

కిరణ్‌కి పరిస్థితులు చేజారిపోతున్న అనుమానం వచ్చింది. బాస్‌కి అనుమానం వచ్చింది. గజేందర్ ఆ అను

మానాన్ని నివృత్తి చేసుకోవటానికి తనని ఏదైన పరీక్షలకి గురిచేయవచ్చు. ఒకసారి అనుమానం తలెత్తిదంటే ఇక తన ఉనికికే ప్రమాదం. వెంటనే ఈ చోటు వదిలిపోవాలి.

కిరణ్ వెంటనే తన ఆలోచనను అమల్లో పెట్టేశాడు. పోలీసు సిబ్బందికి రహస్య సంకేతాలు పంపించాడు. వాళ్ళందరి దుస్తుల్లోను వైర్‌లెస్ పరికరాలు మినీవాచ్ రూపంలోను భద్రపరచబడ్డాయి. అవసరమైనపుడు సంకేతాలు పంపించుకోవటానికి ముందుజాగ్రత్త చర్యగా తనే అవి ఏర్పాటు చేశాడు—ఇక్కడి కొచ్చేముందు.

గజేందర్ ఇంకా స్క్రీన్ ముందే కూచుని ఏవేవో మాట్లాడుతున్నాడు. కిరణ్ అటు ఇటు చూశాడు. తన సిబ్బంది సిద్ధపడుతున్నారు. కిరణ్‌కి తాము లోనికివచ్చిన దారిని గుర్తుపెట్టుకుని మెల్లగా అటు అడుగులు వేశాడు. ఇదివరకు కుడిపక్కకు తిరిగిన మలుపులు ఇప్పుడు యెడమ పక్కకు వస్తాయి. అలాగే యెడమవైపు రెండూ కుడివైపుకొస్తాయి.

కిరణ్ ముందు దారితీశాడు. వెనక సిబ్బంది అయితే వాళ్ళు రెండు మలుపులు తిరిగారో లేదో అలారంలాంటి సిగ్నల్ అదే పనిగా వినిపించింది. చకచక గజేందర్ మనుషులు చుట్టుముట్టేశారు. వారి వెనుకనుంచి గజేందర్ నవ్వుతూ ముందుకి వచ్చాడు.

“మైడియర్ ఫ్రండ్! నువ్విలాంటి సాహసమేదో చేస్తావని నాకు ముందే తెలుసు. అందుకనే నేను నా మనుషులకి సిగ్నల్స్ పంపించాను. నువ్వు తప్పించుకు పారిపోతావు” అన్నాడు గజేందర్. నవ్వుతున్న అతని ముఖం అకస్మాత్తుగా సీరియస్‌గా అయిపోయింది.

"నన్ను ఆకర్షించుకోవటానికి నీవైపు డైవర్టు చెయ్యటానికి నా వేషం వేసుకుని ఏవేవో దోపిడీలు చేసినట్టు చక్కగా నటించావన్నమాట! నేను నిజంగానే నువ్వు డెకాయిట్ వనుకుని నా స్థావరంలోకి తీసుకొచ్చి నా గుట్టుమట్లన్నీ చెప్పేశాను. బాస్‌తో మాట్లాడుతుండగానే నాకు ముఖ్యమైన అనుమానం వచ్చింది.

"నువ్వు నా వేషం వేసుకుని దోపిడీలు చేశావు. నేను ఇలా వుంటానని నీకు నన్ను చూడకముందే ఎలా తెలుసు? అంటే నన్ను చూసిన వాళ్ళెవరో నీకు నా గురించి చెప్పివుండాలి. ఆ అవకాశం ఎవరికుంది? ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్‌కి! అతనే నన్ను ముఖాముఖి కల్సుకున్న పోలీసు ఆఫీసరు. మొన్న ఆ సంఘటన జరిగాకనే నువ్వు రంగంలోకి దిగావు. చకచక ఓ బ్యాంకుని, బస్సుని, శ్రీనివాస్ ఇంటినీ దోచావు ఉత్తుత్తినే.

"ఇప్పుడు బాస్‌తో నిన్ను అక్కడికి తీసుకురమ్మంటారేమోనని అడిగితే నీ గురించి అనుమానం వెలిబుచ్చాడు. అప్పుడు స్ట్రైక్ అయింది—నా రూపం నీకెలా తెలిసిందా అని! సరిగ్గా అదే సమయంలో నువ్వు, నీ పోలీసు సిబ్బందితో పారిపోవటానికి ప్రయత్నించావు. కాని అమాయకుడివి. ఈ కత్తుల బోను నుంచి తప్పించుకోవటం తేలికకాదన్న నిజం నీకు తెలియదు పాపం! నీకు, నీ సిబ్బందికి ఇక్కడే సజీవసమాధి హోల్ సెల్‌గా ఏర్పాటు చేస్తున్నాను. బీ రెడీ!"

గజేందర్ నవ్వు చాలా విచిత్రంగా వుంది.

# 9

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ చేతికున్న ఎలక్ట్రానిక్ వాచీలో అలారం మోగింది. అతను ఉలిక్కిపడ్డాడు. ఇది

కిరణ్ దగ్గరున్న సెట్‌తో సంబంధాలు కలిగివుంది. కిరణ్ ప్రమాదంలో ఇరుక్కుంటే తనకి సిగ్నల్స్ పంపిస్తానన్నాడు.

ఇప్పుడు తన దగ్గరున్న అలారం మోగుతోంది. అంటే కిరణ్ ఏదైనా ప్రమాదంలో ఇరుక్కున్నాడా? అయితే యెక్కడ? ఆ విషయం తెలియదు. అయితే కిరణ్ పెన్ పహాడ్ దగ్గరకు వెళ్ళున్న విషయం తనకి తెలుసు. అక్కడ గజేందర్ స్థావరం యెక్కడుందో గుర్తు తెలుసుకుని తర్వాత తనకొచ్చి చెపుతా నన్నాడు. ఆ ప్రయత్నంలో ప్రమాదంలో ఇరుక్కున్నా డన్నమాట!

శ్రీనివాస్ ఏమాత్రం ఆలస్యం చెయ్యలేదు. పదిమంది సిబ్బందితో బయల్దేరాడు. అవసరమైతే వెంటనే పెన్ పహాడ్ దగ్గరకు బయల్దేరి రావలసివుంటుందని మరో వంద మందికి ఆదేశాలిప్పించాడు హెడ్‌క్వార్టర్స్‌కి ఫోన్ చేసి. వందమంది కాదు, యెంతమంది కావలసివచ్చినా వెంటనే పంపుతామని మెసేజ్ వచ్చింది అక్కడినుంచి.

శ్రీనివాస్ సరాసరి పెన్ పహాడ్ దగ్గరికి చేరుకున్నాడు. కొండచుట్టూ నిర్మానుష్యంగా వుంది. రోడ్‌కి దూరంగా వుండటంవల్ల వాహనాల రద్దీ తక్కువ వున్నా దూరంనించి పోతుంటాయి. అక్కడ ఏం జరుగుతున్నదీ పట్టించుకోే అజవుండ దెవరికీ.

శ్రీనివాస్ కొండచుట్టూ ప్రతి అంగుళం వెతకవలసిందిగా సిబ్బందికి సూచన లిచ్చాడు. తనూ వెతకటం మొదలుపెట్టాడు. చుట్టూ రాళ్ళూ రప్పలు. బూట్లు స్లిప్ అయే అవకాశాలే యెక్కువ. జాగ్రత్తగా నిలదొక్కుకుని అందరూ కొండప్రాంతమంతా చకచక పరిశీలనగా వెతుకుతున్నారు.

అక్కడినుంచి రహస్య ద్వారమో, బిలంలాంటిదేదో వుంటుందని శ్రీనివాస్‌కి గట్టి నమ్మకం.

• • •

"మమ్మల్ని నమ్మి మాతో కలిసి మెలిసి ఆత్మీయంగా వుండే వాళ్ళకోసం ప్రాణం పెడతాం. మమ్మల్ని మోసగించిన వాళ్ళని మరణ హోమం చేస్తాం. మేం యెంత మంచివాళ్ళమో అంతటి రాక్షసులం! మనుషుల్ని దోచుకు తినే మాకు జాలి, కనికరం, కరుణ దయలాంటి మాటల కర్థాలు తెలియవు. నీ సిబ్బందితోబాటు భగవంతుడ్ని ప్రార్థించుకో! మీ అందరి సామూహిక సజీవ సమాధికి సన్నాహాలు పూర్తయ్యాయి" అన్నాడు గజేందర్ ఇంకా వికృతంగా నవ్వుతూ.

"మమ్మల్ని చంపడంవల్ల నీకేమిటి లాభం" కిరణ్ తాపీగా అడిగాడు.

"మిమ్మల్ని చంపకుండా వదిలేస్తే మాకంతా నష్టమే! మా స్థావరం గురించిన రహస్యం తెలుసుకున్నాక మళ్ళీ బతికి బయటపడటమే! అది జరగని పని. నీ కథ నీ అనుచర పోలీసు సిబ్బంది కథా ఇంతటితో సమాప్తం."

"నన్ను ప్రాణాలతో వదిలెయ్యి. నేను పోలీసులకి మీ సంగతి చెప్పను. వాళ్ళు అడిగినా తెలియదని చెబుతాను."

గజేందర్ పడీపడీ నవ్వాడు.

"పోలీసుల తరుపున ఇక్కడికొచ్చిన పోలీసువాడికి ఈ సంగతి చెప్పననటం భలే తమాషాగా వుంది."

"నేను పోలీసువాడిని కాదు."

"మరి....?" గజేందర్ కళ్ళలో ఆశ్చర్యం.

"వాళ్ళకు సాయం చేయటానికొచ్చిన ప్రయివేట్

డిటెక్టివ్ ని."

"వ్వాట్? నీ పేరు ...?"

"కిరణ్."

"ఐ.సీ. ప్రఖ్యాత డిటెక్టివ్ కిరణ్ నువ్వేనా?"

"అవును. శ్రీనివాస్‌కి నాకు దోస్తీ వుంది. అతను కోరితే కాదనలేక ఇందులో దిగాను. అనవసరంగా తల దూర్చానని ఇప్పుడు బాధపడుతున్నాను. నువ్వు నన్ను ప్రాణాలతో వదిలేస్తే ఇప్పుడే పోయి నా పని నేను చూసుకుంటాను. మీ జోలికి రాను. మీరెవరో ఏం చేస్తారో యెవరికీ యెంతమాత్రమూ చెప్పను."

"మరి నీ పోలీసు సిబ్బంది....?"

"వాళ్ళని నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో. నాకేం అభ్యంతరం లేదు."

"నిన్ను నమ్మమంటావా?"

"అది నీ ఇష్టం. ఇంత చెప్పినా నమ్మకపోతే నేనింకేం చెప్పి నిన్ను నమ్మించగలను?"

"ఇది మరో ప్లాన్ కు ప్రారంభం కాదుగదా?"

"నిన్ను నమ్మించటానికేం చెయ్యమంటావ్ చెప్పు!"

"ఇదిగో, నీ అనుచరుడ్ని ఒకడ్ని—ఒకడ్ని చాలు—కాల్చి చంపెయ్యి, నమ్ముతాను."

"ఆల్ రైట్. ఇదిగో ఇప్పుడే చంపేస్తాను!" డిటెక్టివ్ కిరణ్ రివాల్వర్ ఓ పోలీసుకి గురిచేశాడు.

"అహ, ఆ రివాల్వర్‌తో కాదు, ఈ గన్‌తో!" గజేందర్ తన దగ్గరున్న గన్ ఇచ్చాడు.

గన్ తీసుకుంటూనే మెరుపు వేగంతో దాన్ని తిరిగి గజేందర్‌కే గురిపెట్టాడు డిటెక్టివ్ కిరణ్. ఒక్క క్షణంలో పోలీసు అనుచరులు పొజిషన్‌లోకి వచ్చేశారు.

అందరి చేతుల్లోనూ గన్స్ వున్నాయి.

గజేందర్‌తో పాటు అతని అనుచరులంతా నిర్ఘాంత పోయారు ఊహించని ఈ చర్యకు.

"మీ రెవరైనా వెర్రివెర్రి వేషాలు వెయ్యబోతే నిరాక్షిణ్యంగా మీ నాయకుడ్ని కాల్చి పారేస్తాను. బీ కేర్‌ఫుల్!" అన్నాడు కిరణ్ గజేందర్ అనుచరుల్ని ఉద్దేశించి.

ఆయుధాలు తీసుకోబోయిన గజేందర్ అనుచరు లంతా నిస్సహాయంగా చేతులు పైకెత్తేశారు. తనని కవ్వించి రెచ్చగొట్టి తనమీదకే యెదురుతిరిగిన ఆ డిటెక్టివ్ సమయస్ఫూర్తికి, మేధాసంపత్తికి ఆశ్చర్యంతో తలమునక లవుతున్నాడు. మళ్ళీ పరిస్థితిని ఎలా అదుపు లోకి తీసుకోవాలా అని ఆలోచిస్తున్నాడు.

"కదలకు గజేందర్! నీ కాలికిందో గోడపక్కనో రహస్య మీటలో, స్విచ్‌లో వుంటాయని నాకు బాగా తెలుసు. అతి తెలివికి పోయి ప్రాణాలు పోగొట్టుకోకు. యెంతోమంది ప్రాణాలుతీసిన నీవు అంత తేలిగ్గా చావ టానికి సిద్ధపడవని నా నమ్మకం" అన్నాడు కిరణ్.

కాలుపక్కకి జరపబోయిన గజేందర్ ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

కిరణ్ తన సిబ్బందితో వున్న వైర్‌లెస్ ఆపరేటర్ని పక్కగా పిలిచి ఏదో సూచన లిచ్చాడు. అతను తలూపి పక్క గదిలో వున్న టీవీ సెట్ దగ్గరకు వెళ్ళాడు. అక్కడి వైర్లు డిస్‌కనెక్టు చేశాడు. అక్కడున్న గజేందర్ మనుషుల్ని అప్పటికే పోలీసు సిబ్బంది గన్స్‌తో కవర్ చేసేశాడు. అక్కడి విషయాలు గ్రహించటానికి గజేం దర్ బాస్ స్థావరంలో వైర్‌లెస్ రిలేషన్స్ లేకుండా

చేసేశాడు ఆపరేటరు. రహస్యంగా గోడల్లో అమర్చ బడ్డ కెమరాల్ని కనుక్కున్నాడు ఆపరేటరు. వాటిని కూడా తీసేశాడు.

అక్కడ ఆ క్షణంలో ఏం జరుగుతున్నదో బయట ప్రపంచానికి తెలిసే అవకాశం లేకుండా చేశాక తిరిగి పాడవు హాల్లోకి వచ్చాడు వైర్ లెస్ ఆపరేటర్. కిరణ్ వంక చూసి తలూపాడు.

ఈ లోపల గజేందర్ అనుచరుల్ని ఓ పక్కగా నిలబెట్టాడు. కిరణ్. పోలీసు సిబ్బంది గన్స్ వాళ్ళందరికీ గురిపెట్టబడే ఉన్నాయి. గజేందర్ని కవర్ చెయ్యటానికి మరో వ్యక్తిని ఆదేశించి కిరణ్ వెనక వెనగ్గా అడుగులు వేస్తూ రహస్య ద్వారం వైపు నడిచాడు.

మూడు మలుపులు యెడమవైపు, రెండు మలుపులు కుడికి తిరిగాక ఓ చోట ఆగాడు. బహుశా ఇక్కడినించే తమను లోపలికి ప్రవేశపెట్టాడు. అంటే ఈ పరిసర ప్రాంతాల్లోనే యెక్కడో వుండాలి ప్రవేశ ద్వారం!

ఇంతలో కిరణ్ చేతిలవున్న ఎలక్ట్రానిక్ పరికరంలో సిగ్నల్ రావటం మొదలయింది-అతని కళ్ళు మెరిశాయి. ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ తన మెసేజ్ రిసీవ్ చేసుకున్నా డన్నమాట. బయల్దేరి వస్తున్నాడని సంకేతాలు పంపిం చాడు. గుడ్!

కిరణ్ కి గోడపక్కగా మీట కనిపించింది. దాన్ని ఒత్తాడు. కర్ మన్న చప్పుడుతో మనిషి పట్టేంత ద్వారం తయారయింది. అంతవరకు వున్న రాతిగోడ పక్కకు జరిగింది.

అయితే ఇంతలో హాల్లోనించి కాల్పులు విన్పించి నిర్ఘాంతపోయాడు. బయిటికి తొంగిచూడబోయిన వాడల్లా

ఒక్క ఉదుటన పరుగెత్తుకుని హాల్లోకి వచ్చాడు.

గజేందర్ చేతిలో గన్ పొగలు కక్కుతోంది.

"స్టాప్ దేర్ మిష్టర్ కిరణ్! అనవసరంగా ప్రాణాలు పోగొట్టుకోకు. నా గురి వ్యర్థంకాదు. నీ అనుచరుల్ని తుపాకీలు కిందపారెయ్యమని చెప్పు. లేకపోతే నేను నీ ప్రాణాల్ని నిలువునా తీసేస్తాను" అరిచి చెప్పాడు గజేందర్.

క్షణంలో పరిస్థితి తలకిందు లవటంతో ఏమనటానికి నోటమాటరాలేదు కిరణ్‌కి. అజాగ్రత్తగా వున్న తన అనుచరుడ్ని దొరబుచ్చి అతని చేతిలోని గన్‌ని తన స్వాధీనంలోకి తెచ్చుకున్నాడు గజేందర్. ఇద్దరు పోలీసుల్ని నేల కరిపించాడు కూడా.

చుట్టూ వున్న పోలీసు సిబ్బంది చేతుల్లో గన్స్ ఉన్నాయి. అవి గజేందర్ బృందానికి గురిచేయబడి ఉన్నాయి. అందుకే గజేందర్ తనకి తుపాకీ గురిచేసి ఆజ్ఞాపించగలుగుతున్నాడు.

కిరణ్ మస్తిష్కం తీవ్రంగా ఆలోచిస్తోంది. ఈ విపత్కర పరిస్థితి నెలా యెదుర్కోవాలి? చూడగా శ్రీనివాస్ ఇంకా ఇక్కడికి చేరినట్టులేదు!

"ఊ! వెంటనే ఆదేశాలివ్వు. ఒన్....టూ...."

• • •

శ్రీనివాస్ తన సిబ్బందితో పెన్‌పహాడ్ చుట్టూ వెతుకుతున్న సమయంలో కర్‌మన్న చప్పుడు దాని వెంట చిన్న బిలంలాంటి ద్వారం తెరుచుకోవటం కనిపించింది.

సరిగ్గా అదే సమయంలో సొరంగం లోపలినుంచి గన్ పేలిన శబ్దాలు వినిపించాయి.

మౌనంగా తన సిబ్బందికి సైగచేసి పిలిచాడు. అందరు

బిలం దగ్గరకు చేరారు. ముందు శ్రీనివాస్, ఆ తర్వాత ఒకరొకరుగా బిలం లోపలికి దిగారు. లోపల పొడవు పాటి వాలు అక్కడ జనం కనిపించారు. అందరూ రివాల్వర్స్ పొజిషన్‌లోకి తెచ్చుకున్నారు.

శ్రీనివాస్ మెల్లగా అడుగులువేస్తూ ముందుకి నడిచాడు. అక్కడ ఎదురుగా గజేందర్, పక్కగా నిలబడి కిరణ్ వున్నారు. గజేందర్ గన్ కిరణ్‌కి గురిపెట్టి ఉన్నాడు.

"వన్....టూ...." అంటున్నాడు గజేందర్.

సరిగ్గా అదే సమయంలో శ్రీనివాస్ చేతిలోని రివాల్వర్ రెండుసార్లు గర్జించింది. గన్ వదిలేసి 'అబ్బా' అంటూ రెండో చేత్తో గన్ పట్టుకున్న చేతిని అదిమి పట్టుకుని నేలమీద కూర్చుండిపోయాడు గజేందర్.

కిరణ్ వెనుతిరిగిచూసి శ్రీ ని వా స్ ని పలకరింపుగా చూసి నవ్వాడు.

క్షణంలో పరిస్థితి అదుపులోకి వచ్చేసింది.

# 10

టీవీ ముందు కుర్చీలో గజేందర్ కూచుని ఉన్నాడు. కిరణ్, శ్రీనివాస్ బంధింపబడి ఉన్నారు. ఓ పక్కగా వరసగా గోడకు చేర్చి పోలీసులు రెడరెక్కలు విరిచి కట్టబడి నిల్చున్నారు. వాళ్ళందరికీ గురిపెట్టిన గన్స్‌తో గజేందర్ అనుచరులు వేటకుక్కల్లా చూస్తున్నారు.

టీవీ స్క్రీన్‌మీద మళ్ళీ చలనం ఆరంభమయింది. అక్కడున్న యెలక్ట్రానిక్స్ యంత్రాలు మళ్ళీ పని చెయ్యటం ప్రారంభమయ్యాయి.

స్క్రీన్‌మీద బాస్ వీపు వెనక్కి పెట్టుకుని అలవాటైన తీరులో కూచుని వున్నాడు.

"సార్, గజేందర్ మాట్లాడుతున్నాను" అన్నాడు గజేందర్.

"చూస్తున్నాను. దాదాపు గంటసేపు నీతో కమ్యూనికేషన్స్ తెగిపోయాయి. కారణమేమిటి?" అడిగాడు బాస్.

"చూస్తున్నారు కదా సార్, ఈ పోలీసువాళ్ళ ఆగడం! వీళ్ళంతా మనమీదికి దాడి వచ్చారు. ముందుగా కిరణ్ అనబడే ఓ డిటెక్టివ్ మన జాడ కనుక్కోవటానికి వచ్చాడు. మీరు హెచ్చరించాక తెలిసింది—నా వేషంలో ఇన్ని హోపిడీలు చేసినవాడే ఈ కిరణ్ అని!

సరే, మీరు చెప్పిన వెంటనే అతన్నీ అతని అనుచరుల వేషంలో వచ్చిన పోలీసుల్ని పట్టి బంధించాం. ఇంతలో ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ మరి కొంతమంది పోలీసులతో యెలా కనిపెట్టాడో మన స్థావరం కనిపెట్టి లోపలికొచ్చేశాడు. ఇదిగో ఈ పక్కన శ్రీనివాస్ అతని డిటెక్టివ్ ఫ్రెండు కిరణ్‌ని బంధించేశాం. ఆ పక్కన పోలీసుల్ని బంధించాం. కిరణ్‌తో వచ్చిన పోలీసు అనుచరుల్ని బంధించి పక్క గదిలో పడేశాను. ఏం చెయ్యమంటారో అర్ధర్సివ్వండి బాస్!" అన్నాడు గజేందర్.

"వెరీగుడ్! మిష్టర్ గజేందర్! నాకున్న అయిదుగురు అసిస్టెంట్సులోను నువ్వు నాకు నచ్చావు. నిన్ను త్వరలో నా పార్ట్‌నర్‌గా చేసుకుంటాను. నీకు తక్కిన నలుగురు అసిస్టెంట్సుగా ఉంటారు. ఈ పోలీసువాళ్ళు మరీ జిత్తులమారి వాళ్ళు. వీళ్ళని ఏవిధంగా చంపెయ్యాలో నేను ఆలోచించి చెపుతాను.

"మన స్థావరం వాళ్ళ దృష్టిలో పడిపోయింది. కాబట్టి ఇకమీదట ఆ స్తమాను వాళ్ళు వెన్‌పహాడ్ చుట్టూ

మాటు వేస్తూంటారు-కాబట్టి మన స్థావరాన్ని నాశనం చేసి షిఫ్టు అయిపోవటం మంచిది. అది ఈ రాత్రే జరగాలి. ఈ రాత్రికి నీకు అవుట్ డోర్ డ్యూటీ వెయ్యటంలేదు. ఆ డ్యూటీస్ తక్కిన నలుగురు తమ టీమ్‌తో చూసుకుంటారు. నువ్వు అటెంటివ్‌గా ఈ పోలీసువాళ్ళను కనిపెట్టుకునివుండు. యెప్పుడు నీ పని మొదలుపెట్టాలో నేను మళ్ళీ చెబుతాను" అన్నాడు బాస్.

"అలాగే బాస్ మీ ఆర్డర్స్ కోసం యెదురు చూస్తుంటాను" అన్నాడు గజేందర్.

స్క్రీన్ మీద సీన్ చెదిరిపోయింది.

ఆ హాలులో బయటి ప్రపంచానికి మళ్ళీ రిలేషన్స్ తెగిపోయాయి.

అంతవరకు గజేందర్ కూచున్న కుర్చీకింద పడుకుని అతని వెన్నుకి గురిచూసి గన్ పట్టుకుని వున్న పోలీసు కాన్‌స్టేబిల్ బయటికి వచ్చాడు.

గజేందర్ గాజు కళ్ళలో కిరణ్ వంక చూసి, "మీరు చెపుతున్నట్టే చెప్పానుకదా? ఇకనైనా నన్ను ప్రాణాలతో వదిలెయ్యండి" అన్నాడు గజేందర్.

కిరణ్ పకపక నవ్వాడు. "ఎందరో అమాయకుల ప్రాణాలు నిర్దాక్షిణ్యంగా తీసేసిన నువ్వు నీ ప్రాణం అనేసరికి యెంత తీపి చూపిస్తున్నావు? అమాయకుల్ని దోచుకుని వాళ్ళ ప్రాణాలు హరించినపుడు నీకు అలాంటి ఒకరోజు యెదురవుతుందని అనిపించలేదా?" అన్నాడు.

ఇంతలో సార్జెంట్ శివం శ్రీనివాస్ దగ్గరకొచ్చి, "సార్, వీడి అనుచరులందర్నీ పగ్గాలతో లింకు చేసి కదలకుండా కట్టేశాం. ఏం చేద్దామంటారు? అనడిగాడు.

"పక్క గదిలో వుంచండి. ఇదిగో ఈ పోలీసుల

వేషంలో ఉన్న అనుచరుల్ని కూడా లింకుచేసి అక్కడే పడెయ్యండి" అన్నాడు శ్రీనివాస్.

అంతవరకు పోలీసు వేషాల్లో గోడకు బంధింపబడి ఉన్న గజేందర్ అనుచరుల్ని, గజేందర్ అనుచరుల వేషాల్లో వుండి గన్స్ పోలీసు వేషగాళ్ళకి గురిచేసిన శ్రీనివాస్ సిబ్బంది డ్యూటీలు మార్చుకున్నారు. వాళ్ళ యూనిఫారమ్స్ తిరిగి ధరించారు.

"నిన్ను క్షేమంగానే వదిలేస్తాం. అయితే మీ బాస్ పేరు, అతనుండే చోటు, నీలాంటి నలుగురు అసిస్టెంట్సు వివరాలు, వాళ్ళ స్థావరాలు మాకు చెప్పు, చాలు. తక్కిన పని మేము చూసుకుంటాం" అన్నాడు కిరణ్.

"చెప్పకపోతే...." మొండితనం ధ్వనించింది గజేందర్ గొంతులో.

శ్రీనివాస్, కిరణ్ ఒక్క క్షణం ఆశ్చర్యపోయారు. అంతవరకు పిల్లిలా ఉన్న గజేందర్ గొంతులో వూహించని ధైర్యం, తెగింపు ధ్వనించటం చూసి కారణం వూహించటానికి విఫలప్రయత్నం చేశారు.

"చెప్పకపోతే ఏం చేస్తామో నీకు తెలుసు. నిన్ను చిత్రవధ చేస్తాం. నీ గోళ్ళు మాంసంతోపాటు నరికి కారం పూస్తాం. నీ ముఖానికి నిలువుగా అడ్డుగా కత్తితో కోసి రక్తంబొట్లు పెడతాం. దానిమీద కూడ చల్లగా వుండేందుకు కారం వగైరా అద్దుతాం. తర్వాత ఒక్కొక్కటిగా నీ అవయవాలు చిన్న చిన్న ముక్కలుకోసి తీసేస్తాం. ఇంకా...." శ్రీనివాస్ మాటలు ఇంకా పూర్తి కానేలేదు. గజేందర్ జుస్తుల్లోంచి ఓ ఎర్రటి కాప్సుల్ తీసి నోటిలో వేసుకున్నాడు. మరుక్షణం విరుచుకుని పడిపోయాడు.

కిరణ్ శ్రీనివాస్ ఒక్క ఉదుట్న పోయి అతన్ని పట్టుకునేలోపల నిలువుగా నేలమీద పడిపోయాడు. కిరణ్ అతని నాడిపట్టుకుని చూశాడు.

గ జేందర్ లో చలనం ఆగిపోయింది. నోటివెంట నురుగు వచ్చింది.

"పూర్ క్రీచర్! సైనేడ్ కాప్సుల్స్ మింగేశాడు" అన్నాడు కిరణ్.

శ్రీ ని వా స్ అయోమయంగా చూశాడు. "ఉన్న ఒక్క ఆధారమూ పోయింది. వీడినడ్డు పెట్టుకుని వీడి బాస్‌ని, తక్కిన నలుగురు నాయకుల ముఠాని పట్టుకుందా మని యెంతగానో ఆశపడ్డాను. అంతా తలకిందు లయింది" అన్నాడు నిరాశగా.

"డోంట్ అప్‌సెట్ మై డి య ర్ ఇన్‌స్పెక్టర్! 'బాస్' స్థానంలో ఉన్న వ్యక్తి యెవరో నాకు క్లూ అందిపోయింది. అయితే అది కన్ఫర్మ్ కావాలి అంతే!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ విస్మయంగా చూశాడు. "ఎవరో తెలిసి పోయిందా, వాటే వండర్! ఆ బాస్ ఎవడో ముఖ్యం మొహం కనపడకుండా జాగ్రత్త తీసుకుంటున్నాడు కదా! ఎలా గమనించావు?" అన్నాడు.

"మొహం చాటేసినంతమాత్రాన గొంతు గుర్తించ లేమా? ఎంత మార్చి మాట్లాడాలని ప్రయత్నించినా ఒక్కొక్కరికి ఒకో రకమైన మేనరిజం ఉంటుంది. మాటతీరులోనో, నిల్చున్నతీరులోనో, మూవ్‌మెంట్స్ లోను ఓ ప్రత్యేకమైన అలవాటు ప్రదర్శిస్తుంటారు. ఈ బాస్ మాటిమాటికీ యెడమ చెవిని నులుముకుంటున్నాడు. ఇలాంటి అలవాటు అతి కొద్దిమందికి ఉంటుంది. అటు

వంటి వ్యక్తి నీకెవరైనా తటస్థపడ్డారా?"

శ్రీనివాస్ ఆలోచిస్తున్నాడు.

"వెనకనుంచి కూచునివున్నా అతను చెవి నులుము కోవటం స్పష్టంగా కనిపిస్తోంది. అంతేకాదు, కొంచెం అతని ముఖ కవళికలు కూడా చూచాయగా నాకు కని పించాయి. దాన్నిబట్టి కూడా ఆ వ్యక్తి యెవరో నేను గుర్తుపట్టాను" అన్నాడు కిరణ్.

"అదెలా?" శ్రీనివాస్ అడిగాడు.

"వెరీ సింపుల్. ఆ బాస్ కూచున్న కుర్చీకి ఎదురుగా గ్లాస్ డోర్స్ వున్న అల్మాయిరా వుంది. ఆ అల్మాయిరా అద్దంగుండా అతని ముఖం కనిపిస్తోంది. అయితే మామూలు అద్దంలో కనిపించినంత స్పష్టంగా వెనక కెమికల్ పూయని అద్దంలో ప్రతిబింబం స్పష్టంగా కనపడదుకదా! అయినా ఆ కాస్త అస్పష్టతలోనే అతని పోలికలు నేను గుర్తుపట్టాను. అతను మనందరికీ బాగా తెలిసిన వ్యక్తే!"

శ్రీనివాస్ టెన్షన్ భరించలేక, "ఎవరో గుర్తు పట్టలేకపోతున్నాను. యెవరతను?" అనడిగాడు. కిరణ్ చిన్నగా చెప్పాడు. శ్రీనివాస్ నమ్మలేనట్లు చూశాడు.

ఇంతలో ఎలక్ట్రాన్ మెషీన్ల పైభాగంలో ఎర్రటి బల్బు వెలిగింది.

కిరణ్ ఆపరేటర్ని పిలిచాడు. "బాస్‌నుంచి మెసేజ్ వస్తున్నట్టుంది. పైన బల్బు వెలిగింది...." అన్నాడు.

పోలీసు ఆపరేటరు చకచక బాస్‌తో రిలేషన్స్ రీస్టోర్ చెయ్యటానికి ప్రయత్నించాడు. కాని యెక్కడో పొరపాటు జరిగింది. ఎంతకీ కనెక్షన్ దొరకలేదు. స్క్రీన్ మీద సీన్ పడలేదు. మెషీన్‌కున్న లైట్సుకూడా వెలగ లేదు.

ఆపరేటర్ కంగారుగా పరీక్ష చేస్తున్నాడు. కిరణ్ అతని అవస్థ గమనించాడు. శ్రీనివాస్ వంక తిరిగి, "ఇక్కడ పనిచేసే గజేందర్ ఆపరేటర్ ఒకామె వుందిగా ఆమెని పిలిపించు" అన్నాడు.

శ్రీనివాస్ సార్జెంటు శివాన్ని పిలిచి చెప్పాడు. శివం కాసేపట్లో ఆ అమ్మాయిని తీసికొచ్చాడు. ఆమెను కూడా చేతులు కట్టేసి బంధించి వుంచారు

ఆమె హాల్లోకి వస్తూనే, "మెసేజ్ ఫ్రంబాస్!" అన్నది.

"మెషీన్ ఆపరేట్ చెయ్యొద్దు. ఆ మెసేజ్ బాస్ నించి వస్తున్నదేనా, కాదా అన్న విషయం కన్ఫర్మ్ చెయ్యి, చాలు!" అన్నాడు కిరణ్.

"ఎస్సార్! ఇటీస్ ఫ్రం బాస్!" అన్నదామె కచ్చితంగా.

కిరణ్ తనతో తీసుకొచ్చిన పోలీసు సిబ్బందిని పిలిచి, "మీరందరూ గజేందర్ అనుచరుల వేషాలు వేసుకోండి. ఈ హాల్లో అక్కడక్కడ గన్స్ పట్టుకుని ఓ నలుగురు నిల్చోండి" అన్నాడు.

వాళ్ళు వెంటనే దుస్తులు మార్చుకునే పనిలో నిమగ్నమయ్యారు. కిరణ్ చకచక గజేందర్ దుస్తులు తను వేసుకుని, మేకప్ కిట్ తెరిచి అప్పటికప్పుడు గజేందర్‌గా మేకప్ చేసుకున్నాడు. శ్రీనివాస్ అతనివంక ఆరాధనగా చూస్తున్నాడు. అతని చేతులు వేగానికి, అతి చురుగ్గా కదులుతున్న అతని చర్యలకి ముగ్ధుడవుతూ చూస్తున్నాడు.

కిరణ్ మూడు మూర్తులా గజేందర్‌లా వేషం మార్చుకున్నాక గజేందర్ ఆపరేటర్‌తో, "మెషీన్ రూములో

అవుటాఫ్ ఆర్డర్‌లో వుంది. మా ఆపరేటర్‌కి ఫాల్టు యెక్కడుందో చెప్పి పక్క గదిలోకి వెళ్ళిపో! ఇక్కడ మా పని కాగానే నిన్ను క్షేమంగా వదిలేస్తాం" అన్నాడు.

ఆమె కృతజ్ఞతగా నమస్కారం పెట్టి, "నన్ని గజేందర్ బలవంతంగా కిడ్నాప్ చేసి తెచ్చాడు సార్! నేను టెలికమ్యూనికేషన్స్‌లో డిప్లమా కోర్సు చదువుతున్నాను. నేను ఈ మెషిన్స్ ఆపరేట్ చేయటానికి తనకి అవసరమని నన్ను తీసుకొచ్చాడు. నా తల్లిదండ్రుల్ని చంపుతానని బెదిరించి నాచేత బలవంతాన ఇక్కడ పని చేయిస్తున్నాడు" అన్నది.

కిరణ్ ఆమెవంక కరుణగా చూసి, "అలాగా! మేం ఇంతసేపూ నిన్నుకూడా శత్రువుగానే పరిగణిస్తున్నాం. అయితే ఆడపిల్లవనే జాలితో నిన్నుమాత్రం వదిలెయ్యాలనుకున్నాం—అదికూడా మా పనంతా పూర్తయ్యాక. నీ సంగతి తెలిసిందికదా, నిన్ను మీవాళ్ళ వద్దకు మా మనుషుల్ని తోడిచ్చి క్షేమంగా పంపిస్తాం" అన్నాడు.

"మీరే నాకు దేవుడు. మీ మేలు ఈ జన్మలో గుర్తుపెట్టుకుంటాను" అన్నదామె.

కిరణ్ ఈలోపల ఏదో గుర్తొచ్చి "చూడమ్మా, నీకు బాస్ గురించి, గజేందర్‌లాంటి మరికొంతమంది బందిపోటు నాయకుల గురించి వివరాలు తెలుసా?" అనడిగాడు.

"బాస్ ఎవరో, ఏమిటో ఎవరికీ తెలియదు సార్! ఏ ప్రాంతం వాడోకూడా తెలీదు. హిందీలో మాట్లాడుతాడుకాని తెలుగు ఏక్సెంట్ వినిపిస్తుంది. గజేందర్ లాంటివాళ్ళు మరి నలుగురు నాయకులున్నారు. వీళ్ళు

అయినగురు బాస్ చెప్పే ఆజ్ఞలను అమలు పరుస్తుంటారు" అన్నదామె.

"వాళ్ళ పేర్లు వివరాలు చెప్పగలవా?"

ఆమె వరసగా వాళ్ళ పేర్లు వాళ్ళ స్థావరాల వివరాలు చెప్పింది. శ్రీనివాస్ చకచక నోట్ చేసుకున్నాడు.

"ఇప్పుడు చూడు, మెషీన్ ఎక్కడ పాడయిందో?" అన్నాడు కిరణ్.

ఆమె మెషీన్ వంక చూస్తూనే, "ఈ మెషీన్ కి సెపరేట్ మెయిన్, ఫ్యూజ్ ఉన్నాయి సార్! అవి ఆఫ్ చేసి ఉన్నాయి. సరే ఎలా ఉంటుంది?" అన్నది.

శ్రీనివాస్ తమ వైర్ లెస్ ఆపరేటర్ వైపు కోపంగా చూశాడు. అతను తల దించుకున్నాడు.

కిరణ్ కూల్ గా చూసి, "అదే మంచిదయింది. లేకుంటే మనం మన నిజ స్వరూపాలతో 'బాస్' కళ్ళ పడిపోయుండేవాళ్ళం! మెషీన్ పని చెయ్యలేదు గాబట్టి బతికిపోయాం. ఈలోపల వేషాలు మార్చుకుని జాగ్రత్త పడదాం" అన్నాడు. శ్రీనివాస్ ప్లీజింగ్ గా చూశాడు.

"చాలా థాంక్సమ్మా! నీకు డిపార్టుమెంటు ఋణపడి ఉంటుంది. వీలైతే డిపార్టుమెంటులోనే ఆపరేటరుగా అబ్జార్బ చేసుకోవటానికి రికమెండ్ చేస్తాను" అన్నాడు కిరణ్. ఆమె కృతజ్ఞతగా చూసింది.

"గజేందర్ శవాన్ని కూడా పక్క గదిలో ఉంచండి" అన్నాడు కిరణ్ సార్జెంట్ తో.

## 11

"క్యా గజేందర్, ఇతానా దేర్ హోగయా క్యోం? హై పంద్రామినట్స్ సే మెసేజ్ భేజ్ రహాహూఁ

రెస్పాన్స్ నహీఁ హైఁ క్యా కర్ రహే తుమ్‌లోగ్?"
అంటున్నాడు బాస్ కోపంగా.

కిరణ్ గజేందర్ గొంతు అనుకరిస్తూ హిందీలోనే జవాబిచ్చాడు. "ఏం చెయ్యమంటారు సార్, మెషీన్ ట్రబుల్ ఇచ్చింది. ఇప్పుడే మీనుంచి మెసేజ్ వస్తున్న సిగ్నల్స్ వచ్చాయి. వెంటనే అటెండవుతున్నాను" అన్నాను అపాలజిన్‌గా.

శ్రీనివాస్ బాస్ ముఖ కవళికల్ని మాటని గుర్తు పెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు. అతనే ఈ బాసా? ఎంత ఘోరం! శ్రీనివాస్ రక్తం మరిగింది.

ఇంతలో ఉరుములా వినిపించింది బాస్ కంఠస్వరం.

"మిస్టర్ కిరణ్, గజేందర్‌లా ఎంత బాగా నటించాలనుకున్నా నువ్వెవరో తెలిసిపోయింది" అని.

కిరణ్ శ్రీనివాస్ నివ్వెరపోయారు.

"ఏమిటి బాస్, ఏమిటి మీరంటున్నది?"

"గజేందర్ మహారాష్ట్రంవాడు. అతను హిందీలో మాట్లాడినా మరాఠీలానే వుంటుంది. నీ గొంతులో అచ్చమైన తెలుగుదనం ధ్వనిస్తున్నది. నువ్వు హిందీలో ఎంతగా గొంతుమార్చి మాట్లాడినా అది నీ నిజ స్వరూపాన్ని బయటపెట్టింది. అదీకాక నీ వెనక నిల్చుని వున్న ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ చాలా ఫ్రీగా, యెలాంటి బంధనాలు లేకుండా ఉన్నాడు. ఈ రెండూ నిన్ను పట్టిచ్చాయి. కాసేపట్లో మీ అందరి కథా ముగిసిపోతుంది...." అన్నాడు బాస్.

తెరమీద సీన్ మాయమయింది. లోపల అంతా అంధకార మయిపోయింది.

కిరణ్ ఒక్కసారిగా కూచున్న చోటునుంచి లేచి

"మిస్టర్ శ్రీనివాస్! ఆపద ముంచుకొస్తోంది. మనసంగతి బాస్ మహాశయుడికి తెలిసిపోయింది. అక్కడనుంచే ఈ అండర్ గ్రౌండ్‌ని ఆపరేట్ చేయగలుగుతున్నాడు. మనల్ని బయటికి తప్పించుకోకుండా ఇక్కడే సమాధి చేసేస్తాడు—కమాన్ హారియప్!" అన్నాడు.

"మనవాళ్ళతో బాటు, గజేందర్ మనుషుల్ని కూడా బయటకు తీసుకుపోవాలా?" అన్నాడు శ్రీనివాస్.

"అందర్నీ బయిటకి తీసుకుపోవాలి. గజేందర్ మనుషులు సంఘవిద్రోహులు. అయినా వాళ్ళను శిక్షించే హక్కు మనకిలేదు. అది కోర్టు చెయ్యాల్సిన పని!...." కిరణ్ చెప్పుండగానే యెక్కడినుంచో గాస్ బుసబుస మంటూ చొచ్చుకురాసాగింది.

"శ్రీనివాస్! గాస్ వదులుతున్నాడు. స్విచ్‌లుగాని, మాటలుగాని నొక్కవద్దు. లైటర్స్‌గాని, మేచ్ బాక్స్ గాని వెలిగించొద్దు సజీవ సమాధి అయిపోతాం" హెచ్చరించాడు కిరణ్.

అందరు ఒక్కసారిగా బిలద్వారంవైపు పరుగులు పెట్టారు. సారంగంటు శివం మరికొందరు కానిస్టేబిల్స్ సహాయంతో గజేందర్ అనుచరుల కాళ్ళబంధాలు తెంచేసి చేతుల బంధాలు మాత్రం అలాగే వుంచి బిల ద్వారం దగ్గరకు పరుగులెత్తించాడు.

ముందుగా పోలీసు సిబ్బంది ఆ' వెనక గజేందర్ సిబ్బంది బిలందాటుతుండగా ఒక్కసారిగా సొరంగంలో మంటలు లేచాయి. పెద్ద పేలుడు సంభవించింది. గజేందర్ అనుచరులు సొరంగం దాటేలోపలే పైనుండి పెద్ద పెద్ద బండలు మీదపడి సొరంగమంతా కిందికి కూలిపోయింది. ప్రాణాలు దక్కించుకున్నది ఆపరేటర్ ఒక్కతే!

బయటకి వస్తూనే కిరణ్ శ్రీనివాస్‌ను తొందర పెట్టాడు. "ఈసరికి బాస్ తక్కిన బందిపోటు నాయకులకి ఆదేశాలిచ్చి వుంటాడు. వాళ్ళు కూడా తమ స్థావరాలు వదిలి సురక్షిత ప్రాంతాలకు పారిపోయి వుంటారు. మనం సరాసరి బాస్ నివాసానికి వెళ్ళాలి. అతన్ని అదుపులోకి తీసుకుంటే అన్ని విషయాలు బయట పడతాయి" అన్నాడు.

కిరణ్ శ్రీనివాస్‌లు సరాసరి బాస్ నివాసానికి సిబ్బందితో బయట నిలిచి వున్న వాహనాల మీద దూసుకుపోయారు.

## 12

"దొరగారు ఇంట్లో లేరు" అన్నాడు గేట్ దగ్గరున్న వాచ్‌మాన్.

"ఆ విషయం తెలుసు" అంటూ కిరణ్, శ్రీనివాస్‌లు అతన్ని తోసుకుని లోపలకు వెళ్ళారు. లోపల పనివాళ్ళు అడ్డుపడబోయారు. వాళ్ళని సార్జంటు శివానికి అప్పగించి లోపలకి దూసుకుపోయారు కిరణ్, శ్రీనివాస్.

పదినిమిషాల తర్వాత కిరణ్ కళ్ళు మెరిశాయి. నేల మీద గుల్లగా ఉన్నచోట బూటుకాలితో గట్టిగా తొక్కాడు. అతని అనుమానమే నిజమయింది. కింద ఏదో సొరంగమార్గముండి ఉండాలి! నేలమీద పరచబడి వున్న ఖరీదైన కార్పెట్‌ని తొలగించాడు.

గచ్చుమీద మూడడుగుల పొడవు మూడడుగుల వెడల్పు వున్న చతురస్రాకారపు రాతిపలక వుంది. దాన్ని పక్కకు తీసి పెట్టారు. కిందికి మెట్లున్నాయి.

గజేందర్ స్థావరాన్ని పోలిన పెద్ద హాలు, ఎలక్ట్రానిక్ పరికరాలు, దానిముందు బాస్ హోదాలో కూచున్న

వ్యక్తి వాళ్ళ కళ్ళబడ్డారు.

"శ్రీనివాస్, ఎటాక్!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్, కిరణ్ ఓకేసారి గాల్లోకి పిస్తోళ్ళు పేల్చారు. హడావిడిగా మెషీన్‌లోకి వంగి ఏవో ఆదేశాలిస్తూన్న బాస్ అదిరిపడి చూశాడు. అతని చుట్టూ చాలామంది అనుచరులు సాయుధులై ఉన్నారు. వాళ్ళు గన్స్ గురి పెట్టారు. అప్పటికే బిలబిలమంటూ పోలీసు బలగం నేల మాళిగలోకి దిగిపోయింది.

"మెడియర్ మాజీ నాయకా, కళాలరావ్! నీ మనుషుల్ని ఆయుధాలు కింద పారెయ్యమను. లేకుంటే నీ శరీరం తుపాకీ గుళ్ళతో శిథిలమైపోతుంది, జాగ్రత్త!" అన్నాడు కిరణ్ హెచ్చరికగా. అతను, శ్రీనివాస్ తమ రివాల్వర్సు బాస్‌కే గురిపెట్టి ఉన్నారు.

చేసేదిలేక బాస్ యెడమచెవిని గట్టిగా నులిమేసు కుంటూ కసిగా బుసకొట్టాడు.

"మిష్టర్ కళాలరావ్! ఇంతా పంతాలకు పోయి ప్రాణంమీదికి తెచ్చుకోకు. ప్రజానాయకుడిగా ఎంతో ప్రజాధనాన్ని స్వాహా చేశావు. ఈ రాష్ట్రానికి కీలకమైన హోదాలో కొన్నాళ్ళు పనిచేశావు. చివరికి ఆ ప్రజల మాన ప్రాణాలనే హరిస్తూ వాళ్ళ ఆస్తుల్ని, సర్వస్వాన్ని కొల్లగొడుతూ నువ్వు ఇంకా ఇంకా ఆస్తుల్ని కుళ్ళబెట్టు కుంటున్నావ్! నిన్ను ప్రజలు క్షమించరు. మారుమాట్లాడ కుండా సరెండరయిపో!" అన్నాడు కిరణ్.

కళాలరావు అనబడే బాస్ చేసేదిలేక తన మనుషుల వంక చూశాడు. వాళ్ళు ఆయుధాలు కింద పారేశారు.

"అలాగే ఆ మెషీన్‌లో మీ అసిస్టెంట్సు రహమాన్, జోసెఫ్, ప్రసాద్ భోస్లే, బల్వంత్ రావులను కూడా నీ

నివాసానికి అర్జంటుగా రమ్మని కబురుచెయ్యి. మేము మళ్ళీ వాళ్ళను వెతుక్కుంటూ పోలేం. ఇప్పటికే బాగా అలిసిపోయాం" అన్నాడు శ్రీనివాస్ వ్యంగ్యంగా.

కళాలరావు శ్రీనివాస్ వంక గుర్రుగా చూశాడు.

# 13

"నీకు మన రాష్ట్రం, మనదేశంకూడా చాలా ఋణపడి ఉంది బ్రదర్! కళాలరావే బాస్ అని చాలా తెలివిగా ట్రేస్ చేశావు. దాంతో కేసు ముడివిడిపోయింది. మన రాష్ట్రానికి బందిపోటు దొంగల బెడద వదిలించి ప్రజా జీవితాన్ని మళ్ళీ ప్రశాంత వాతావరణానికి తీసుకొచ్చావు.

ఐ. జి. పి, కమిషనర్, పోలీసు ఉన్నతాధికారులు, మన ముఖ్యమంత్రి నిన్ను చాలా అభినందించారు. నీతో బాటు ఆ ఘనత నాకూడా దక్కింది. కళాలరావే బాస్ అని ఎలా గ్రహించావో నా కిప్పటికీ సస్పెన్స్ గానే వుంది" అన్నాడు శ్రీనివాస్.

డిటెక్టివ్ కిరణ్ ఇంట్లో ఇద్దరు కూచుని ఉన్నారు. అప్పటిదాకా అభిమానులు, ఆత్మీయులు పువ్వగుచ్ఛాలు వేసి కిరణ్ సాధించిన అపూర్వ విజయానికే అభినందనలు, హర్షాన్ని వెలిబుచ్చి వెళ్ళారు.

పరిస్థితి ప్రశాంతం కాగానే శ్రీనివాస్ కిరణ్ ముందు తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

కిరణ్ మందహాసంచేసి, "నేను ఇదివరకు చెప్పాను కదా ప్రతి మనిషికి కొన్ని మేనరిజమ్స్ జన్మత పట్టు బడతాయని, అవి చివరకు వాళ్ళని అంటిపెట్టుకుని వుంటా యని! కళాలరావు ఒక నాటి ప్రజానాయకుడు. అతనికి యెడమ చెవిని కుడిచేత్తో నులుముకునే అలవాటుంది. అతను ప్రజానాయకుడిగా మనందరికీ తెలుసు. అతని

అలవాట్లు కూడా మనందరికీ తెలిసే ఉంటాయి.

"అటువంటి అలవాటున్న మనిషెవరాని ఆలోచిస్తే నాకు వెంటనే కళాలరావే స్ఫురించాడు. ఆ అనుమానంతో పరిశీలించి చూడగానే అతని ముఖకవళికలు కూడా గుర్తు తెలిశాయి. అంతే, ముడి విడిపోయింది.

కళాలరావు ఒకప్పుడు రాజకీయాల్లో ప్రముఖ పాత్ర వహించిన రాజకీయ నాయకుడు. అధికారం చేతిలో ఉండేది, లంచాలు బాగా మేశాడు.

గత ఎన్నికల్లో అతని పార్టీ ఘోరపరాపజయాన్ని చవిచూసింది. అధికారం వూడిపోయింది. గత ఎన్నికల్లో కొన్ని కోట్లు తనకోసం, తన పార్టీకోసం ఖర్చు పెట్టాడు. అదంతా మట్టిలో కలిసిపోయిన పన్నీరులా అయిపోయింది.

దాంతో డబ్బుకోసం కటకట ఏర్పడింది. కళాలరావు డబ్బు సంపాదించే మార్గాలు అన్వేషించాడు. తన పార్టీ సహచరులతో మంతనాలు సాగించాడు. చివరికి దారి దోపిడీలు, బ్యాంకి దోపిడీలు, ఇళ్ళ దోపిడీలు అయితే లాభసాటిగా ఉంటుందని భావించాడు. మహారాష్ట్ర చంబల్ లోయల్లో ఉన్న బందిపోట్లు ఈ మధ్య మన రాష్ట్రంమీద, ముఖ్యంగా రాజధానిమీద పడి దోచుకుంటున్నారు. జనాన్ని భయభ్రాంతుల్ని చేస్తున్నారు. వాళ్ళని మెల్లిగా తమ చెప్పు చేతుల్లోకి తెచ్చుకున్నాడు కళాలరావు. తదితర పార్టీ సహచరుల అండదండలతో దిగ్విజయంగా దోపిడీలు నడిపిస్తున్నాడు.

కళాలరావు జరిపిస్తున్న దోపిడీల వెనక అంతర్గతంగా మరో అయిడియా వుంది. అదేమిటంటే ప్రస్తుత పాలనా యంత్రాంగాన్ని తారుమారు చేసి, ప్రజల్లో

ప్రస్తుత ప్రభుత్వానికున్న అఖండ విశ్వాసాన్ని, పేరు ప్రఖ్యాతుల్ని పాడుచెయ్యటానికి ఈ దోపిడీలు, హత్యలు, మత కలహాలు ఎంతో ఉపయోగపడతాయి. ఆ విధంగా ప్రభుత్వాన్ని అపఖ్యాతి పాలుచేయ్యాలని కుశాలరావు వంటి మాజీనాయకులు తలపన్నటంలో ఆశ్చర్యమేముంది?

ఓపక్క దోపిడీలవల్ల వచ్చే అపారమైన ఆస్థి, మరో పక్క తాము తిరిగి గద్దెనెక్కటానికి తీవ్రప్రయత్నం! వీటితో కుశాలరావు ఉచ్చం నీచం కూడా మరిచిపోయి, ఒకప్పుడు తనకు బ్రహ్మరథం పట్టిన ప్రజలకే ద్రోహం తలపెట్టాడు.

మరో అనుమానం నీలో తలెత్తవచ్చు. కుశాలరావు తన నివాసం నుంచే ఈ ఘోరాల్ని నడుపుతున్నట్టు నాకెలా తెలిసిందని. కుశాలరావు నివాస గృహం పక్కగా రైల్వేట్రాక్ వుంది కదా! అతను గజేందర్‌కి ఆదేశా లిస్తున్నప్పుడు ట్రెయిన్ కూత వినిపించింది సన్నగా.

అతను సొరంగంలో ఉండొచ్చునని అనుమానం రావ టానికి కారణం, ట్రెయిన్ నడుస్తూండగా నేల అదు రుంది కదా! అతనున్న నేలమాళిగ అదిరిన శబ్దం టీవీలో స్పష్టంగా వినిపించింది నాకు! దాంతో కుశాలరావు నివాస గృహం నా దృష్టిలో మెదిలింది. అంతే, కుశాల రావు తన నివాసంలోనే నేల మాళిగ తవ్వించి అక్కడి నుంచే కథంతా నడుపుతున్నాడని గ్రహించాను" అని చిరునవ్వుతో ముగించాడు డిటెక్టివ్ కిరణ్.

—: అయిపోయింది: —

# మరుపురాని మగువ

టెంపోరావ్

గదిలో లైటు వెలుగుతోంది. కిటికీ పక్కనే అతడు ఒంటరిగా పేము కుర్చీలో కూర్చున్నాడు. నేలమీద అరక్ బాటిల్ వుంది. గ్లాసులోని అరక్‌ను కొద్దిగా తాగి అతడు చార్మినార్ సిగరెట్ వెలిగించాడు.

బాటిల్ వైపు చూశాడు. సగం పైన తాగేశాడు. బాగా నిషాలో వున్నాడు. అయినా ఇంకా తాగుతూనే వున్నాడు.

టైమ్ చూశాడు. పదకొండు దాటింది. కిందనున్న గ్లాసును అతను అందుకున్నాడు. పూర్తిగా తాగేసి గ్లాసులో మళ్ళా అరక్ పోశాడు.

ఎవరో తలుపుమీద దబదబా కొట్టారు. యెవరై వుంటారు?

"తొందరగా తలుపు తెరువు బాబూ!" అర్చింది ఒక స్త్రీ కంఠం అటువైపునుంచి.

అతను తూల్తూ లేచాడు. గుమ్మంవైపు అడుగులేసి

తలుపు తెర్చాడు.

బయట నిలబడిన యాభై ఏళ్ళ స్త్రీ అతడివైపు గాభరాగా చూసింది.

"బాబూ, అమ్మాయికి నొప్పులు వస్తున్నాయి. వెంటనే హాస్పిటల్ కు తీసుకెళ్ళాలి. సమీపంలో టాక్సీ దొరక్క ఇక్కడికొచ్చాను" అందామె.

ఎర్రటి కళ్ళతో అతడామెవంక చూశాడు. ఎందుకో ఆమె త్రుళ్ళిపడింది. వెనక్కు తిరిగింది.

"హాస్పిటల్ కు తీసుకువెళ్తాను" అన్నాడతను. ఆమె తిరిగి అతడివైపు చూసింది.

"ఈ స్థితిలో టాక్సీ నడపగలవా?" అనుమానంతో అడిగింది.

"నడపక తప్పదుగా! అని అతడు నవ్వాడు.

"వద్దు బాబూ!" అందామె.

"మీరు భయపడకండి! మీ అమ్మాయి ఎక్కడుంది? డోసులోవున్నా సరిగ్గా కారు నడపడం నాకలవాటే."

"పక్కవీధిలో మూడో ఇల్లు!"

అతడు తలుపు మూసి తాళంవేశాడు. టాక్సీ ఇంటి ముందు రోడ్డు వారగా వుంది. తలుపు తెర్చి ఆమెను ఎక్కమన్నాడు.

టాక్సీని వేగంగా పక్కవీధిలోకి పోనిచ్చి మూడో ఇంటిముందు ఆపాడు. బయటకు దిగి ఆమె పరుగెత్తింది. ఇరవైరెండేళ్ళ యువతిని తీసుకొచ్చి కారు వెనక సీటు మీద పడుకోబెట్టింది. టాక్సీ పక్కనే నిలబడిన అతడికి ఆమె మూలుగలు వినిపిస్తున్నాయి . ఒక ప్లాస్టిక్ బుట్ట పట్టుకుని, ఇంటికి తాళంవేసి తల్లి కారులో కూర్చుంది.

తలుపుమూసి అతడు టాక్సీని పోనిచ్చాడు. అతడు

ఎలా నడుపుతాడో అని వెనక కూర్చున్న తల్లి గాభరా పడ్తోంది. కాస్సేపట్లో ఆమె గాభరా అదృశ్యమైంది.

బాగా తాగివున్నా అతడు టాక్సీని సవ్యంగానే పోనిస్తున్నాడు. కాస్సేపట్లో అతడు టాక్సీని హాస్పిటల్ కాంపౌండులో ఆపి, తొందరగా దిగి తలుపు తెర్చాడు.

ప్లాస్టిక్ బుట్టను అతడు తీసుకున్నాడు. ఆమె కూతుర్ని లోపలకు తీసుకువెళ్ళింది. తిరిగివచ్చి ప్లాస్టిక్ బుట్టను అందుకుంది.

అతడివంక దీనంగా చూసింది.

“బాబూ, నీకెంత ఇవ్వాలి? మీటరులో యెంత యింది?”

“మీటరులో నాలుగున్నరయింది.”

“ఎంతివ్వమంటావు?”

“నేను మీతో బేరమాడలేదు. ఇవ్వండి ఎంతో కొంత.”

“ఆయన ఇంట్లో లేరు. చేతిలో ఎక్కువగా డబ్బు లేదు. తర్వాత పట్టుకొచ్చి యిస్తాను” అందామె.

“అలాగే చేయండి” అని అతడు వెనక్కు తిరిగాడు.

ఆమె లోపలకు వెళ్ళిపోయింది. అతడు సీటుమీద కూర్చుని తలుపుమూశాడు. టాక్సీని పోనిచ్చాడు.

అతడి మెదడులో ఏవేవో దృశ్యాలు ఫిలిమ్ షాట్స్‌లా కదుల్తున్నాయి. ఒక యువతి ముఖం మెదడులో మెదిలింది. ఏదో బాధ! అతడు బ్రేక్ నొక్కి టాక్సీని రోడ్డువారగా ఆపాడు. గుండెల్లో నొప్పి! కొన్ని నిమిషాల పాటు అతడు అలాగే కూర్చుండిపోయాడు.

గతంలో జరిగినది గుర్తొస్తోంది!

ఆమె అతడి పక్కనే టాక్సీలో వుంది. ఆమె తీయగా

నవ్వుతోంది. ఆమె నడుంచుట్టూ చేయిపోనిచ్చి దగ్గరగా లాగి పట్టుకున్నాడు. కుడిచెయ్యి స్టీరింగ్ వీల్ మీదవుంది.

"మంజూ!" పిల్చాడతను.

అది ఆమె పేరుకాదు. అతడామెకిచ్చిన ముద్దుపేరు.

"చెప్పు రామ్" అందామె.

"నువ్వు లేకుండా క్షణంకూడా నేను బ్రతకలేను!" అన్నాడతను.

"నేను బ్రతగ్గలనా?" ప్రశించిందామె.

ఆడవాళ్ళ మాటలకు అర్థాలు వేరని అంటారు. తనని మర్చిపోయి ఆమె మరో వ్యక్తిని పెళ్ళిచేసుకుంది. తను కలలుగన్నా మంజూ తనకు శాశ్వతంగా దూరమైంది.

ఈ జీవితంలో ఇక ఆమె తనకు దొరకదు. తనొక భగ్న జీవి!

ఎవరో కారుమీద వేళ్ళతో కొట్టారు. అతడు కళ్ళు తెరిచి చూశాడు. ఒక ఆంగ్లో ఇండియన్ యువకుడు, యువతీ టాక్సీ పక్కనే నిలబడివున్నారు.

"వస్తావా?"

"ఎక్కడికి?"

"బీచ్‌కి. అక్కడ మేము గంటసేపు వుంటాం. అంత వరకూ వుండాలి. మళ్ళా ఇక్కడ దింపాలి."

"ఇరవై అయిదు రూపాయలు ఇవ్వాలి!" అన్నాడతను.

"యాభై అడుగుతావేమో అని భయపడ్డాను. కమాన్ డార్లింగ్" అన్నాడా యువకుడు.

"ఓ మైడియర్" అంటూ ఆమె టాక్సీలోకి దూరింది.

ఆమె పక్కనే కూర్చున్నాడతను. కారు కదిలింది స్పీడుగా వెళ్తోంది. వెనుకనుంచి విచిత్రమైన చప్పుళ్ళ

వినిపిస్తున్నాయి.

"ఇంకా బీచ్ రాలేదు!" అన్నాడు టాక్సీ నడిపే అతను వెనక్కు చూడకుండా.

"నీ టాక్సీ బాగుంది, మిస్టర్, మూవింగ్ బీచ్‌లా వుంది" అన్నాడా యువకుడు నవ్వుతూ.

అతడు ఆలోచిస్తూ టాక్సీని పోనిస్తున్నాడు. ఈనాడు జంట చిలకల్లా వాళ్ళిద్దరూ వెనక వున్నారు. కాని ఎప్పుడో ఆమె అతడిని వదిని వెళ్ళిపోతుంది!

సముద్రపు హోరు వినపడుతోంది. బీచ్ లోపల రోడ్డుకి పోనిచ్చి అతడు టాక్సీ ఆపాడు. వుషారుగా వాళ్ళిద్దరూ కిందికి దిగారు.

యాంగ్లో ఇండియన్ యువకుడు అతడివైపు చూస్తూ క్వార్టర్ బాటల్ను అందించాడు.

"మిస్టర్, అందులో కొంత రమ్ వుంది. తాగుతూ కూర్చో!" అని వెళ్ళిపోయాడు.

అతడు బాటిల్ని చూశాడు. సంగం పైన వుంది రమ్ అందులో. మూతతీసి కొంచెం తాగాడు. ఘాటుగా, వేడిగా రమ్ గొంతులోకి దిగింది. అతడు వాళ్ళవైపు చూశాడు.

ఇసుకలో నడుస్తూ ఇద్దరూ వెళ్తున్నారు. కొంత సేపట్లో వాళ్ళ రూపాలు అదృశ్య మయ్యాయి.

వాళ్ళకింకా పెళ్ళయి వుండదు. ప్రేమ వలలోపడి ఇద్దరూ రహస్యంగా, పెద్దలకు తెలియకుండా, బీచ్‌కి వచ్చుంటారు. పెదానికి ఎంత దగ్గరగా వెళ్ళినా కప్పుకీ, పెదానికీ మధ్య ఎంతో దూరం వుంది!

రమ్ సేవిస్తూ ఆలోచిస్తూ అతడు కూర్చున్నాడు.

# 2

సెంట్రల్ స్టేషన్‌లో టాక్సీ ఆపి అతడు బేరంకోసం చూస్తున్నాడు. కాని ఎవ్వరూ తన టాక్సీవైపు రాలేదు.

పట్నంలో టాక్సీలు ఎక్కువయ్యాయి. ఒక్కొక్కసారి కస్టమర్లు దొరకరు. అతడు చార్మినార్ సిగరెట్ పీలుస్తూ టైమ్ చూశాడు. ఏడైంది.

ఒక యువతి సూట్‌కేసు పట్టుకుని టాక్సీ పక్కకు వచ్చింది. అతడామెవైపు చూశాడు.

ఆమె వయస్సు యిరవై వుంటుంది. టాక్సీలో ప్రయాణంచేసే మనిషిలా ఆమె కనబడ్డంలేదు. అంత అందమైనది కాకపోయినా అనాకారి కాదు.

"ఎక్కడికెళ్ళాలి?" ప్రశ్నించాడతను.

ఆమె టాక్సీ దగ్గరగా వచ్చింది. అతడివంక సూటిగా చూసింది.

"ఒంటరిగా విజయవాడనుంచి వచ్చేశాను" అందామె.

అతడు ముందు తలుపు తెరిచి ఆమెను ఎక్కమన్నాడు. అతడి పక్కనే కూర్చుని ఆమె తలుపు మూసింది. అతడు టాక్సీని పోనిచ్చాడు.

"ఒంటరిగా ఎందుకొచ్చావు?"

"నా మొగుడు తప్ప తాగి రోజూ తన్నుతాడు. జీవితంలో విసుగెత్తింది. ఆతడు మారడు. అందుకని వచ్చేశాను" అందామె.

టాక్సీ స్పీడుగా వెళ్తోంది. ఆమెవైపు అతడు ఓరగా చూశాడు.

"నీ, మెళ్ళో మంగళ సూత్రంలేదు!"

"ఎప్పుడో అమ్మి తాగేశాడు. పసుపుకొమ్ములు వుండేవి. వాటిని కృష్ణానదిలో పారేసి ఇలా వచ్చేశాను."

"ఈ మహాపట్నంలో యెక్కడుంటావు? ఏం చేస్తావు?" అడిగాడతను.

"ధనవంతుల ఇళ్ళలో పనిమనిషిగా వుంటాను. తిండి పడేసి ఎంతో కొంత జీతం ఇస్తారు."

"అన్నీ ఆలోచించే వచ్చావన్నమాట!"

"విజయవాడలో ఒక డాక్టర్ గారి ఇంట్లో నేను పనిచేసేదాన్ని. నా భర్త దెబ్బలబాధ భరించలేక నేను ఏడుస్తూంటే ఆయనే ఇక్కడకు పొమ్మన్నారు. నౌఖర్లు దొరకడం ఇక్కడ కష్టంగా వుందట."

తన గదిముందు అతడు టాక్సీ ఆపాడు. ఆమెను గదిలోకి తీసుకువెళ్ళాడు. ఏమాత్రమూ భయపడకుండా ఆమె గదిలోకి వెళ్ళింది.

అతడామెవైపు నవ్వుతూ చూశాడు.

"నీ పేరు?"

"మాధవి"

"మంచి పేరు. నీకు ఉద్యోగం దొరికిందాకా ఇక్కడ వుండొచ్చు."

ఆమె అతడివంక నవ్వుతూ చూసింది.

"నువ్వు చాలా మంచివాడివి. నిన్ను నేను మర్చిపోను" అందామె.

అతడు టైమ్ చూశాడు.

"మాధవీ, వంటచేయడానికి అన్నీ వున్నాయి. నేను బయటకు పోయి ఒంటిగంట కొస్తాను. ఈలోపల వంట ముగించు. నువ్వు తిని విశ్రాంతి తీసుకో. నాకోసం కూర్చోవద్దు!" అని అతను బయటకు పరుగెత్తాడు.

టాక్సీ కదిలిన శబ్దం ఆమెకు వినబడింది. ఆమె తలుపు మూసి గడియలు పెట్టింది. గది విశాలంగా వుంది.

పక్కనే బాత్ రూమ్, లాట్రిన్ వున్నాయి. ఈ ఫ్లాట్ కి అద్దె ఎంతో?

ఆమె ముందు గదిలోకి తిరిగివచ్చి నలువైపులా చూసింది. కిరోసిన్ స్టవ్, వంటపాత్రలు కనిపించాయి. బుట్టలో కూర లున్నాయి.

అలమారులో ఎన్నో డబ్బాలున్నాయి. వాటిని ఆమె తెరిచి చూసింది. పప్పులు, మిరపకాయలు, వుప్పు, చక్కెర వగైరా అన్నీ వున్నాయి.

ప్రతిరోజూ అతడు వంట చేసుకుని తింటాడేమో! రోజంతా టాక్సీ తోలేవాడికి వంట చేసుకోడానికి టైమ్ ఎలా వుంటుంది?

ఆమె ఆలోచిస్తూ కుర్చీలో కూర్చుంది. అతడికి పెళ్ళయిందా? పెళ్ళయితే భార్య ఎక్కడుంది? అనేక ప్రశ్నలు!

తనకు ఆశ్రయమిచ్చిన వ్యక్తితో అబద్ధాలు చెప్పినందుకు ఆమె లోలోపల విచారించింది.

తనకింకా పెళ్ళికాలేదు. దిక్కులేక తను మావయ్య ఇంట్లో పెరిగింది. అతడికి తనమీద మోజు ఎక్కువ. తనని పొందడానికి అతడు యెప్పుడూ ప్రయత్నిస్తూనే వున్నాడు. కాని అత్తయ్య గుడ్డిదికాదు. అదంతా గమనించింది.

“పిల్లా, ఇహ నువ్వు ఇక్కడుంటే ప్రమాదం. నీ జీవితం పాడవుతుంది. నా సంసారం నాశన మవుతుంది. నువ్వు మరో చోటకి పో!” అంది అత్తయ్య ఒకరోజున.

“సరే, పోతాను” అందామె.

తను దాచుకున్న డబ్బుతో అత్తయ్య తనకు రైలు టికెట్ కొని ఇచ్చింది. పైన పది రూపాయలు ఇచ్చింది.

అత్తయ్య స్వయంగా వచ్చి తనను ట్రెయిన్ ఎక్కించింది.

ఏడుస్తూ అత్తయ్య తన చెయ్యి పట్టుకుంది. "నీ మేలు కోరే వెళ్ళమన్నాను, పిల్లా! అతడి కామానికి నువ్వు బలిపశువు కావడం నాకిష్టంలేదు. నువ్వు ఎక్కడున్నా దుర్గమ్మ నీ జీవితాన్ని సరిదిద్దుతుంది. ధైర్యంగా వెళ్ళి జయించి, సుఖపడు!" అంది అత్తయ్య కన్నీళ్ళతో.

"అత్తయ్యా, నిన్ను మళ్ళీ ఎప్పుడు చూస్తానో?" అంది తను ఏడుస్తూ.

"బెంగెట్టుకోకు, పిల్లా! మొగదిక్కు లేని ఆడదాన్ని ఆటవస్తువుగా చూడ్డం మనదేశంలోని పురుషులకు అలవాటైపోయింది. ఎవరో నిన్ను ఆదరించి పెళ్ళాడతారు. నీ భర్తతో నువ్వు ఇక్కడకు వచ్చి మమ్మల్ని చూడొచ్చు!" అంది అత్తయ్య.

ట్రెయిన్ కంపార్టుమెంటు కిటికీలోంచి బయట నిలబడిన అత్తయ్యవైపు ఆమె చూసింది.

"అత్తయ్యా, నేను ఎక్కడకి వెళ్ళానని మావయ్య అడిగితే ఏం చేస్తావు?"

"నాకు తెలియదంటాను. నీ రాకకోసం ఎదురుచూస్తూ అతడు కూర్చుంటాడు. కాని నువ్వు రావుగా! ఏమైందని గొణుగుతాడు. నీ పోరు పడలేక యెక్కడికో పోయి వుంటుందని చెప్తాను. దానితో అతడు నోరు మూసుకుంటాడు."

"నా మూలంగా మీకే ప్రమాదమూ రాకూడదని దుర్గమ్మను ప్రార్థిస్తున్నాను" అందామె.

"అతడు నన్నేం చేస్తాడు? నువ్వు కంటబడకపోతే అతడికి నేనే రంభలా కనిపిస్తాను."

అటు వైన రైలు కదిలింది. ప్లాట్ ఫామ్‌మీద నిలబడిన ఆ తెయ్యాక తను దూరమైపోయింది.

"దుర్గమ్మా, నన్ను రక్షించు!" అనుకుందామె లోలోపల.

## 3

కొత్తగా కొన్న అరక్ బాటిల్ని తెరిచి అతడు గ్లాసులో పైదాకా పోసుకున్నాడు. మెల్లిగా తాగడం ప్రారంభించాడు.

రైటు వెలుగుతోంది. టైమ్ తొమ్మిది దాటింది. మాధవి అతడికెదురుగా చాపమీద కూర్చుంది.

ఆమె బాటిల్ వైపు ఆశ్చర్యంగా చూసింది.

"అదంతా తాగేస్తావా?" అడిగిందామె.

అతడు పకపక నవ్వాడు.

"తాగలేనా?"

"ఎక్కువ తాగడం మంచిదికాదు. నా గతి ఏమైందో చూడు! అతడలా తాగి తన్నడంవల నేగా ఇంతదూరం వచ్చేశాను" అందామె.

"మాధవీ, నువ్వు భయపడకు! తాగినవాళ్ళందరూ భార్యలను తన్నరు. తన్నే అలవాటున్నవాళ్ళు తాగక పోయినా తంతారేమో!"

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది. అతడు గ్లాసులోని అరక్‌ను తాగేసి మళ్ళీ పోసుకున్నాడు.

"చక్కగా టాక్సీ నడుపుకుని బతుకుతున్నావు. మంచి ఇల్లుంది. నీకు ఏ లోటూలేదు. రోజూ ఇలా తాగితే నీ ఆరోగ్యం చెడిపోతుంది" అందామె.

"తాగితేగాని నేను బతికుండలేను. తాగక తప్పదు. ఈ తాగుడే జీవంపోసి నన్ను బతికిస్తోంది" అన్నాడతను.

"నీ మాటలు వింటూంటే గతంలో ఏదో జరిగుండాలి అనిపిస్తోంది. ఏమైంది?" ప్రశ్నించిందామె.

"ఎప్పుడో నీతో చెప్తాలే!" అని ఆగి అతడు ఆరక్ తాగుతూ వుండిపోయాడు.

గ్లాసులోని ఆరక్‌ను తాగేసి ఆమెవైపు చూశాడు. ఆమె తల దువ్వుకుని, పూలు పెట్టుకుంది. నుదురుమీద ఎర్రటి బొట్టు. అందంగా, అమాయకంగా కనిపిస్తోంది.

"నువ్వు పనిచేయడానికి ఒక ఇల్లు కనిపెట్టాను" అన్నాడతను.

"ఎక్కడ?"

"అదంతా తర్వాత చెప్తాను. ఆ ఇంట్లో వాళ్ళకు పనిమనిషి కావాలని తెలుసుకున్నాను. నా గురించి వాళ్ళకు నువ్వేమీ చెప్పకూడదు. ఆ ఇంట్లో వుండి అక్కడి వివరాలు నువ్వు నాకు అందిస్తూ వుండాలి."

"ఎందుకు?"

"ప్రశ్నలు వేయకూడదు. నేను చెప్పినట్లు చేస్తే ఆ ఉద్యోగం నీకు వస్తుంది."

"అలాగే చేస్తాను" అందామె.

"నీ గురించి నాకు చెప్పినదే వాళ్ళకు చెప్పు. భర్త తన్నులు భరించలేక వచ్చేసిన యువతికి ప్రజల సానుభూతి బాగా లభిస్తుంది. నిన్ను ఆ ఇంట్లోనే వుండి పని చేయమంటారు. అక్కడ వుండి రహస్యంగా నాకు కావలసిన సమాచారం నువ్వు అందించవచ్చు."

ఆమె తలాడించింది. గ్లాసులో ఆరక్ పోసుకుని అతడు సగంపైన తాగేశాడు.

"అక్కడికెళ్ళాక ప్లేటు మార్చకూడదు."

ఆమె తీయగా నవ్వింది.

"భోజనం చెయ్యకూడదమ్మా? వంకాయి వేపుడు చల్లారితే బాగోదు!" అందామె.

"ఈ గ్లాసులోది తాగాక తింటాను."

"నేను వడ్డిస్తూ వుంటాను" ఆమె లేచింది.

అతడు గ్లాసును ఖాళీచేసి సిగరెట్ పొగ పీల్చి ఆమెవైపు చూశాడు. మెల్లిగా లేచి బాత్ రూమ్‌లోకి వెళ్ళి కాళ్ళూ, చేతులూ కడుక్కొని వచ్చాడు. నేల మీద కూర్చున్నాడు.

"అలమారులో మరో కంచం వుంది. నువ్వూ పెట్టుకో ఇద్దరం తిందాం" అన్నాడతను.

"తర్వాత తింటాలే" అందామె.

అతడు లేచి అలమారులో వున్న కంచాన్ని నేలమీద పెట్టాడు.

"వడ్డించుకో" అన్నాడతను.

ఇద్దరూ తినడం ప్రారంభించారు.

"నీ వంట చాలా బాగుంది" అన్నాడతను.

"నా వంటను మెచ్చుకునేవాడు ఒకడున్నందుకు సంతోషం" అందామె.

అతడామెవైపు చూశాడు.

"నీ భర్త ఎప్పుడూ మెచ్చుకోలేదా?"

ఆమె వెంటనే జవాబివ్వలేదు. అతడివైపు సూటిగా చూసింది.

"నీతో అబద్ధం చెప్పాను. నన్ను క్షమించు. నాకు పెళ్ళికాలేదు. నేను దిక్కు లేని కన్నెపిల్లని."

అతడామెవైపు ఆశ్చర్యంగా చూశాడు.

"ఎందుకిలా వచ్చేశావు?"

ఆమె నిజం చెప్పేసింది. ఆమె కళ్ళమ్మట నీళ్ళు

కారుస్తున్నాయి.

"మాధవీ, ఏడవకు! మనదేశంలో కొందరు పురుషులు నీ మామయ్యలా వుంటారు. వాళ్ళు చేసే కీచక చర్యలు బ్రయట పడవు!"

ఇద్దరూ భోజనాలు ముగించారు. అతను చాప తలగడ పట్టుకుని ఆమెవైపు చూశాడు.

"నువ్వు గదిలో నిద్రపో! నేను బయట పడుకుంటాను. నీకు ఇక్కడే పక్క వుంది."

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"నాకు భయంలేదు. నువ్వు ఇక్కడే పడుకో" అందామె.

"ఆ మాట విని చాలా ఆనందిస్తున్నాను. తాగిన వాడిని చూసి స్త్రీలు భయపడ్తారు."

దూరంగా పక్క వేసుకుని అదే గదిలో ఇద్దరూ పడుకున్నారు. గదిలో చీకటిగా వుంది."

ఆమె ఆలోచిస్తూ పడుకుంది. కాని అతడికి క్షణంలో నిద్రపట్టేసింది.

## 4

పోర్టికోలో కారు ఆగివుంది. మోహనరావు వుషారుగా కారువైపు నడిచాడు. అతడి భార్య సుందరి వెనకనే వెళ్ళింది. ఆమె చేతుల్లో వున్న కొడుకును అతడు వంగి ముద్దుపెట్టుకున్నాడు.

"బై డార్లింగ్" అని అతడు కారులో ఎక్కి తలుపు మూశాడు.

కారు కదలింది. గేటువైపు పోతున్న కారుకేసి చూస్తూ సుందరి నిలబడింది. గేటుదాటి కుడివైపుకు తిరిగి కారు వెళ్ళిపోయింది.

అదే సమయంలో యెవరో స్త్రీ లోపలకు వస్తోంది. పోర్టికో మెట్టుమీద నిలబడి సుందరి ఆమెకేసి చూస్తూ వుండిపోయింది. కాస్సేపట్లో ఆమె పోర్టికోలోకి వచ్చింది. నవ్వుతూ సుందరికి నమస్కారించింది.

"ఏం కావాలి?" అడిగింది సుందరి.

"విజయవాడనుంచి వచ్చానమ్మా. ఏదేనా పని దొరుకుతుందేమో అని చూస్తున్నాను" అందామె.

"ఇంత దూరం ఎందుకొచ్చావు?"

"అక్కడ బతకలేకమ్మా. అక్కడ జీవితం దినదిన గండంగా గడిచేది. తాగొచ్చి నా మొగుడు నన్ను చావగొట్టేవాడు. ఎంతకాలం భరించడం? విసుగెత్తి ఇలా వచ్చేశాను."

ఆలోచిస్తూ సుందరి ఆమెవంక చూసింది. ఆమె చేతిలో చిన్న సూటుకేసు వుంది.

"ఈ పట్నంలో తెలిసినవాళ్ళు ఎవరేనా వున్నారా?"

"లేరమ్మా."

"ఆయన ఆఫీసుకెళ్ళారు. ఆయన్ని అడిగి చెప్తాను."

"మరికొన్ని ఇళ్ళకు వెళ్ళి అడిగివస్తానమ్మా" అని ఆమె వెనక్కు తిరిగింది.

"వుండు! అలా కూర్చో!" అని సుందరి లోపలకు పరుగెత్తింది. కొడుకును సోఫాలో పడుకోబెట్టి హాల్లోని టెలిఫోన్ దగ్గరకు నడిచింది. రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పింది.

"హాలో, మోహన్ అసోసియేట్స్!" అందో స్త్రీ కంఠం అటువైపునుంచి.

"మావారితో మాట్లాడాలి" అందామె. వెంటనే కనెక్షన్ ఇవ్వబడింది.

"సుందరీ, ఏం కావాలి?"

"ఎవరో పనిమనిషి వచ్చింది. మంచిదానిలా వుంది. మనింట్లోనే వుండి అన్ని పనులు చేసిపెడ్తుంది" అందామె.

"దాన్ని ఎక్కడికీ పోనీయకు! వెంటనే పనిలో చేరమను. టిఫిన్, కాఫీ, తిండి జీతం అన్నీ ఇస్తామని చెప్పు. పనిమనిషి దొరక్క చస్తున్నాం" అన్నాడతను.

"అలాగే."

"అబ్బాయి ఎలా వున్నాడు?"

"సోఫాలో పడుకుని డాన్స్ చేస్తున్నాడు."

"ఆల్‌రైట్, అంతేనా?"

"అంతే" అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

సోఫాలో కొడుకు పక్కనే కూర్చుని పనిమనిషిని పిలిచింది. ఆమె వినయంగా లోపలికి వచ్చింది.

"నీ పేరు?"

"మాధవి."

"నువ్వు వెంటనే పనిలో చేరొచ్చు. టిఫిన్, కాఫీ, రెండు పూట్లా భోజనం ఇస్తాం. జీతం 50 రూపాయలు. అన్ని పనులూ నువ్వు చూసుకోవాలి. వంటకి మరొకామె వుంది."

"అలాగేనమ్మా" అంది మాధవి.

"ప్రస్తుతం యీ హాల్లోనే వుండు. ఎవరైనా వస్తే పైకొచ్చి నాకు చెప్పు. వెనకనున్న గదిలో నీ సూట్‌కేసు పెట్టుకోవచ్చు. అక్కడే రాత్రిళ్ళు పడుకోవచ్చు."

"మంచిదమ్మా."

"సావిత్రమ్మగారూ!" సుందరి పిల్చింది.

నలభై ఏళ్ళ స్త్రీ లోపలనుంచి హాల్లోకొచ్చింది.

"పిల్చారా?"

"ఈమె కొత్త పనిమనిషి. మనింట్లోనే వుంటుంది. వెనక గది చూపించండి. అక్కడ వుంటుంది."

సావిత్రమ్మ ఆమెకేసి ఎగాదిగా చూసింది.
"రా నాతో" అందామె. వాళ్ళిద్దరూ లోపలకు వెళ్ళారు. సుందరి కొడుకును ఎత్తుకుని పైకి వెళ్ళింది.

"నీ పేరు?"

"మాధవి అమ్మగారూ."

"పెళ్ళయిందా?"

"అయిందండి."

"నీ భర్త ఏడీ?"

"అతడు విజయవాడలో వున్నాడండి. ఇద్దరం విడిపోయాం. అతడు తాగుబోతు, అమ్మగారూ. అందుకే ఇక్కడికొచ్చేశాను."

సావిత్రమ్మ తన భర్త గురించి ఆలోచించసాగింది. అతడూ బాగా తాగుతాడు. కాని భార్యను కొట్టడు. తాగి, తిని గుర్రుపెడుతూ నిద్రపోతాడు.

"నువ్వు ఇంకా చిన్నదానవు. భర్తను వదలడం మంచిదికాదు" అంది సావిత్రమ్మ.

"ఎముకలు విరిగేటట్లు కొడ్తావుంటే విడిపోక మరేం చెయ్యగలనమ్మా?"

తాగినా తన భర్త మంచివాడని సావిత్రమ్మ సంతోషించింది.

"పొద్దుట టిఫిన్ తిన్నావా?"

"లేదమ్మా."

"అయితే రా, వుప్మా వుంది, ఇస్తాను" అని ఆమె వంటగదివైపు కదిలింది.

పెద్ద మేడ. ఒకవైపున పూలమొక్కలు, మరోపక్క చక్కటి తోట. నలువైపులా ప్రహారీ. గోడ ముందు గేటు ప్రాంతంలో గూర్ఖా పచార్లు చేస్తూ వుంటాడు.

కిందా, పైనా మాధవి తిరిగి చూసింది. అంత పెద్ద ఇంట్లో వుండేవాళ్ళు కోటీశ్వరులై వుండాలి. సుందరి చాలా అదృష్టవంతురాలు, అనుకుంది మాధవి.

సాయంత్రం ఆరు కావస్తోంది. "మాధవీ!" పిల్చింది సుందరి. పనిమనిషి వుషారుగా హాల్లోకొచ్చింది.

"బాబుతో అలా బీచ్‌కి వెళ్ళాలి" అని పనిమనిషి దుస్తులవైపు చూసింది.

పక్కనున్న గదిలోకి సుందరి వెళ్ళింది. రెండు చీరలు, రెండు జాకెట్లు తెచ్చి పనిమనిషికిచ్చింది.

"ఇటువైపెన ఇవి నీవి. ఈ రెండింటిలో ఏదో ధరించి తొందరగా రా" అంది సుందరి.

లోపలకు పరుగెత్తుకెళ్ళి కాస్సేపట్లో మాధవి తిరిగి వచ్చింది. ఆమెవైపు సుందరి సంతోషంగా చూసింది.

"ఇప్పుడు చక్కగా వున్నావు. బాబును తీసుకో" అందామె.

మాధవి బాబును తీసుకుంది. సుందరి కారు షెడ్ వైపు వెళ్ళింది. కాస్సేపట్లో ఫియట్ కారును తోలుకొచ్చి పోర్టికోలో ఆపింది.

"ఆపక్క ఎక్కు" అంది సుందరి తలుపు తెరుస్తూ.

సుందరి కారును పోనిచ్చింది. పక్కనే వుంది మాధవి. ఆమె ఒళ్ళో ఆడుకుంటున్నాడు బాబు.

గేటు ముందున్న గూర్ఖా సుందరికి వినయంగా నమస్కరించాడు.

రోడ్డమ్మట కారు స్పీడుగా వెళ్తోంది. బాబు మాధవి ఒళ్ళో కూర్చుని బయటకు చూస్తున్నాడు.

"అయ్యగారు బీచ్ కి రారా?" అడిగింది మాధవి.

"అయ్యగారు పొద్దుట వెళ్తారు. రాత్రి ఏ పన్నెండింటికో వస్తారు" అంది సుందరి.

"ఆయన ఉద్యోగం ఏమిటమ్మా?"

"ఆయన వ్యాపారంలో ఉన్నారు. ఆయనకు పంచదార, సిమెంట్ ఫ్యాక్టరీలు వున్నాయి."

"మగమహారాజమ్మా" అంది మాధవి.

బీచ్ లోపల రోడ్డుమీద కారు ఆగింది. ఇద్దరూ కిందికి దిగారు. బాబు ఇసుకలో మెల్లిగా అడుగులు వేస్తున్నాడు. మాధవి అతడి చెయ్యి పట్టుకుంది.

చక్కటి దుస్తుల్లో బాబు చాలా అందంగా వున్నాడు. అందరూ అతడినే చూస్తున్నారు.

"ఇంటికెళ్ళాక వుప్పుదిష్టి తీసి పారేయాలమ్మా. అందరి కళ్ళూ బాబుమీదే వున్నాయి" అంది మాధవి.

"అది నువ్వే చెయ్యాలి" అంది సుందరి.

వాళ్ళు సముద్ర పొడ్డుకు నడిచి ఆగారు.

హోరుమంటూ కెరటాలు ముందుకొచ్చి, పగిలి, నురుగులు కక్కుతూ వెనక్కి పోతున్నాయి. సముద్రపు గాలి హాయిగా వుంది. కొంచెం వెనక్కి నడిచి ఇద్దరూ ఇసుకలో కూర్చున్నారు. బాబు ఇసుకలో ఆడుకుంటున్నాడు.

"మీ పెళ్ళయి ఎన్నేళ్ళయిందమ్మా?"

"ఇంకా మూడేళ్ళు కాలేదు. సీజరియన్ ఆపరేషన్ చేసి యీ బిడ్డను బయటకు తీయవలసి వచ్చింది. ఈ జీవితంలో ఈ ఒక్క బిడ్డా చాలనిపిస్తోంది" అంది సుందరి.

"అలా అంటారేమిటమ్మా! మీలాంటి ధనవంతులకు

ఎంతమంది పిల్లలున్నా ఫరవాలేదు."

"ధనం ఒక్కటే కాదు, పిల్లల్ని కనే ఆరోగ్యం కూడా వుండాలి. ప్రతిసారీ సీజరియన్ ఆపరేషన్‌తో బిడ్డను కనడం కష్టతరమైన పని" అంది సుందరి.

"మీరు గొప్పింటి కోడలయారమ్మా. మీ తండ్రిగారు కూడా ధనవంతులై వుండాలి" అంది మాధవి.

సుందరి నవ్వింది. "మా నాన్నగారు ధనవంతులు కారు. ఉద్యోగంలో వున్నారు. మా ఆయన కంపెనీలోనే నాన్నగారు పనిచేస్తున్నారు."

మాధవి చెవులప్పగించి వింటోంది.

"నాకొచ్చిన సంబంధం వెతికితే ఎక్కడా దొరకదు. విధి చేకూర్చిందని చెప్పాలి. ఒకనాడు హోటల్ పార్టీలో నాన్నగారు నన్ను ఆయనకు పరిచయం చేశారు. అంతే. అటుపైన విధి రథచక్రాలు వేగంగా తిరిగిపోయాయి. నన్ను పెళ్ళాడ్తానని ఆయన పట్టుబట్టి కూర్చున్నాడు. అలాగే మా పెళ్ళయిపోయింది. నాన్నగార్కి పైసా కూడా ఖర్చులేదు. మా పెళ్ళిని నా మామగారే జరిపించారు."

"అదృష్టం వస్తే వరదలా వస్తుందమ్మా" అంది మాధవి.

చీకటిపడింది. దూరంలో రోడ్డు లైట్లు వెల్గుతున్నాయి.

"మాది పెద్ద కుటుంబం. నాకు ముగ్గురు అన్నలు వున్నారు. ఇద్దరు అక్కలు, ముగ్గురు చెల్లెళ్ళు. నన్ను బి.ఏ. దాకా చదివించడానికే నాన్నగారు ఎంతో కష్టపడ్డారు. నెలజీతాలమీద జీవించే కుటుంబాలు అలాగే వుంటాయి."

మాధవి నవ్వుతూ ఆమెవైపు చూసింది.

"విధి నన్ను మీ ఇంటికి రప్పించిందమ్మా. మీ దగ్గర

పనిచేసేవాళ్ళు కూడా అదృష్టవంతులు అవుతారమ్మా”
అంది మాధవి.

“అందరూ ఆనందంగా వుండాలని నా ఆశ! పద, పోదాం” అంది సుందరి.

బాబును తీసుకుని వాళ్ళు కారువైపు నడిచారు.

# 6

అతడు వుషారుగా గదిలోకి వచ్చాడు. స్విచ్ ఆన్ చేశాడు. లైటు వెల్గింది. అలసటతో అతడు పేము కుర్చీలో కూర్చున్నాడు.

పొద్దుటనుంచీ అతడు టాక్సీని నడుపుతూనే వున్నాడు. బేరంమీద బేరం!

సరిగ్గా తిండికూడా తినలేదు. కాని అతడు బాధ పడలేదు. తిండిమీద మోజు అతడికెప్పుడో పోయింది.

అతడు లేచాడు. బాత్‌రూంలోకి వెళ్ళి స్నానం చేశాడు. పేము కుర్చీలో కూర్చుని కొత్త అరక్ బాటిల్ని తెరిచాడు. గ్లాసులో అరక్ పోసుకుని గడగడ తాగేశాడు. సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ ఆలోచిస్తున్నాడు.

అతడికి మిత్రులు లేరు. మంజూ తన జీవితంలోంచి తొలగిపోయాక స్నేహితులమీద అతడి నమ్మకం మాయ మైంది. అతడు ఒంటరివాడై పోయాడు. అతడి ప్రియ నేస్తం ఇప్పుడు అరక్ బాటిల్!

దేవదాసులా అతడు తాగేస్తున్నాడు. కాని పార్వతిలా మంజూ అతడికోసం బాధపడిన సూచనలు యెక్కడా లేవు. పెళ్ళికిముందు ఆమెను ఒకసారి రోడ్డుమీద అతడు చూశాడు. బీచ్‌కి రమ్మన్నాడు. వస్తానని ఆమె వెళ్ళి పోయింది.

రాత్రి పన్నెండుదాకా అతడు బీచ్‌లో కూర్చుని

ఆమెకోసం ఎదురు చూశాడు. కాని ఆమె రాలేదు. వచ్చి తనని కల్సుకోవాలనే వుద్దేశం ఆమెకు వుండి వుండదు! మంజూ హృదయం పాషాణంగా ఎలా మారి పోయింది?

గ్లాసులో అరక్ పోసుకుని అతడు గడగడ తాగే శాడు. గొంతు కాలిపోయినట్లనిపించి మెల్లిగా సర్దుకుంది.

బీచ్‌లో ఒక వెన్నెల రాత్రి అతడికి జ్ఞప్తికొచ్చింది. అప్పట్లో ఒక కంపెనీలో టాక్సీ డ్రయివర్‌గా ఉద్యోగం చేసేవాడతను. ఇప్పటిలా స్వంత టాక్సీ లేదు.

టాక్సీలో ఆమెను అతడు బీచ్‌కి తీసుకెళ్ళాడు. పడవ పక్కనే ఇసుకలో వాళ్ళిద్దరూ కూర్చున్నారు.

సముద్రపు గాలి ఆహ్లాదంగా వుంది. చంద్రకాంతి వాళ్ళలో వింత కోర్కెలను రేకెత్తిస్తోంది.

ఆమె తల అతడి ఒళ్ళో వుంది. ఆమె ఇసుకలో పడుంది, వెల్లకిలా.

"మంజూ, నువ్వు బి.ఎ. పాసయ్యావు. నాకు చదువు లేదు. నేనొక టాక్సీ డ్రయివర్ని. మన పెళ్ళికి మీ నాన్న గారు ఒప్పుకుంటారా?" అన్నాడతను.

ఆమె నవ్వింది.

"ఊరుకో రాజ్! మన పెళ్ళి అయి తీరుతుంది. దాన్ని ఎవ్వరూ ఆపలేరు. నీ కోసం పంచభూతాల్ని కూడా నేను ఎదిరిస్తాను" అందామె.

అతడు ముందుకు వంగి ఆమె ఎర్రటి పెదిమలను ఆవేశంతో ముద్దుపెట్టుకున్నాడు. ఆమె చేతులు అతడిని బలంగా చుట్టేశాయి!

"మంజూ!" అర్చాడతను. గుండె నొప్పి! కొంతసేపు అతడు మౌనంగా వుండిపోయాడు.

ఎవరో తలుపును తట్టారు. అతడు వెళ్ళి తలుపు తెర్చాడు. చక్కటి దుస్తుల్లో మాధవి లోపలకువచ్చింది.

అతడు తలుపు దగ్గరగా మూశాడు. కుర్చీలో కూర్చుని ఆమెవంక చూశాడు. ఆమె ఇప్పుడు అందంగా కనిపిస్తోంది. అతడు స్టేషన్‌లో చూసిన మాధవిలా లేదు!

"అమ్మగారు సినిమా చూడమని డబ్బిచ్చారు. సినిమాకి వెళ్ళకుండా ఇలా వచ్చాను" అంది మాధవి.

"ఎంత త్యాగం!" అన్నాడతను.

ఆమె అతడి కళ్ళలోకి చూసింది.

"నిన్ను చూసినప్పటినుంచీ ఏదో ఆప్యాయత నాలో ఏర్పడింది. కాస్త టైమ్ దొరికితే నిన్ను చూడాలనిపిస్తుంది" అందామె.

అతడు గ్లాసులో ఆరక్ పోసుకుని వేగంగా తాగేశాడు. బాగా నిషాలో వున్నాడు.

"ఏం కనుక్కున్నావు, చెప్పు!" అన్నాడతను.

"ఆమె భర్తతో చాలా ఆనందంగా జీవితం సాగిస్తోంది. ఆమెకు ఒక్కగా నొక్క కొడుకు. ఆ కుర్రాడు చాలా బాగుంటాడు. మరో బిడ్డ పుట్టే అవకాశంలేదు. సీజరియన్ ఆపరేషన్ చేసి ఈ బిడ్డను బయటకు తీశారట" అంది మాధవి.

అతడు మౌనంగా వింటున్నాడు.

"వాళ్ళుండే ఇల్లు స్వర్గంలా వుంది."

"ఇంట్లో వాళ్ళమీద చెప్పు" అన్నాడతను.

"ఆమె రాణీలా జీవిస్తోంది. భర్త పొద్దుట పోయి రాత్రి పన్నెండింటికి వస్తాడు."

"ఆమె కొడుకు గురించి చెప్పు!"

"అప్పుడప్పుడు ఆమెతో నేను బీచ్‌కి వెళ్తాను.

బిడ్డను కూడా తీసుకువెళ్తాం. బీచ్ కి వెళ్ళినప్పుడు పెరాంబులేటర్ లో బాబుని కూర్చోబెట్టి నేను తిప్పుతాను."

"ఎక్కడ తిప్పుతావు?"

"కాంపౌండులో. ఒక్కోసారి రోడ్డుమీదకు కూడా ప్రామ్ని తోసుకెళ్తాను" అంది మాధవి.

అతడు వుషారుగా ఈల వేశాడు. గ్లాసులో అరక్ పోసుకున్నాడు. ఎత్తబోయాడు. ఆమె చెయ్యి అడ్డు తగిలింది. "ఇంక తాగొద్దు" అందామె.

"తాగితే ఏమవుతుంది?"

"ఆరోగ్యం పాడవుతుంది. అకాలంగా చస్తావు!" అందామె వుద్రేకంతో.

"పోతే పోనీ! ఇక్కడుండి చేసేదేమిటి? అనుకున్నదంతా పేక మేడలా కూలిపోతుంటే చూడ్డంకంటె చావడం మంచిది."

చాపమీద కూర్చున్న మాధవి అతడివైపు సూటిగా చూసింది.

పుట్టిన ప్రతి వ్యక్తికీ చావక తప్పదు. కాని చావడానికి మనం ప్రయత్నించకూడదు. జీవించడానికి ప్రయత్నించాలి!"

"నువ్వు బాగా చెప్తున్నావు. నువ్వు పనిమనిషివంటే నేను నమ్మను" అన్నాడతను.

"బి.ఎ. పాసయిన వ్యక్తి పనిమనిషిగా వుండొచ్చు. మనం ఏం పని చేసినా మనలో వుండేది మన సంస్కారం" అందామె.

అతడు కుర్చీలోంచి లేచి ఆమెవైపు చూశాడు.

"మాధవీ, నువ్వు ఎవరు? నిజం చెప్పు!" అరిచాడతను.

"ఎప్పుడో ఒకప్పుడు నా కథ పూర్తిగా నీకు చెప్తానులే. ఆ సమయం ఇంకా రాలేదు" అందామె.

అతడు గ్లాసువైపు చూశాడు. అందులో పైదాకా ఆరక్ వుంది. అమాంతంగా గ్లాసు తీసుకుని అతను ఆరక్ తాగేశాడు. ఆమెవైపు చూశాడు.

"బాబుని రేపు నువ్వు పెరాంబులేటర్‌లో రోడ్డు మీదకు తీసుకురా" అన్నాడతను.

"ఎందుకు?"

"అది నేను చెప్పను. తర్వాత నీకే తెలుస్తుంది. తప్పక తీసుకొస్తావుగా?"

"తీసుకొస్తాను" అందామె.

గదిలో క్షణకాలం నిశ్శబ్దంగా వుంది.

"బాబుకి ఏ విధంగానూ హాని జరగకూడదు!" అందామె.

"జరగదు". అన్నాడతను.

ఆమె లేచింది. "నేను వెళ్ళాలి" అందామె.

"టాక్సీలో దింపనా?" అడిగాడు.

"వద్దు బస్సులో వెళ్ళగలను" అని ఆమె వెళ్ళిపోయింది.

## 7

సాయంత్రం సమయం. పెరాంబులేటరులో ఆమె బాబుని కూర్చోబెట్టింది. సుందరి బాబును రెండుసార్లు ముద్దెట్టుకుంది.

"మాధవీ, ఎక్కువ దూరం తీసుకెళ్లొద్దు. జాగ్రత్త!" అంది సుందరి.

ప్రామ్‌ను తోసుకుంటూ మాధవి రోడ్డు మీదకు వెళ్ళింది. మెల్లిగా బండిని తోస్తోంది. బాబు నవ్వు

తున్నాడు.

విశాలమైన రోడ్డు. కార్లు దూసుకుపోతున్నాయి.

చటుక్కున ఒక టాక్సీ పెరాంబులేటర్ పక్కనే ఆగింది. అతడు కిందకు దిగాడు. చక్రాలబండిలో వున్న బాబును అతడు ఎత్తుకున్నాడు. టాక్సీవైపు పరుగెత్తాడు.

ఆమె టాక్సీ పక్కకు వెళ్ళింది.

"ప్లీస్, బాబును నాకిచ్చేయి!" అందామె.

"బాబును నేను తిప్పుతాను."

"వద్దు. బాబు లేకుండా ఇంటికెళ్తే వాళ్ళు నన్ను చంపుతారు" అందామె. అతడు పిశాచంలా నవ్వాడు.

"నిన్ను చంపరు. వాళ్ళు చస్తారు. బాబును నేను తీసుకుపోతాను. నా గురించి చెప్పకు" అరిచాడతను.

ఆమె జవాబివ్వలేదు. టాక్సీ దూసుకు వెళ్ళిపోయింది.

పెరాంబులేటర్ని వెనక్కి తిప్పి ఆమె ఇంటివైపు పోనిచ్చింది. అతడు ఎందుకిలా చేశాడు?

ఏడుస్తూ ఆమె ఇంటికి చేరుకుంది. పోర్టికోలో పచార్లు చేస్తున్న సుందరి ఆమెవైపు వెళ్ళింది.

పెరాంబులేటర్ లోకి చూసింది. బాబు లేడు.

"ఏమైంది? బాబు ఏడీ?" అరిచింది సుందరి.

"వాళ్ళెవరో కారులో వచ్చి బాబును ఎత్తుకు పోయారమ్మా" అంది మాధవి ఏడుస్తూ.

సుందరి చెయ్యి పైకి లేచింది. మాధవి చంపమీద ఛెళ్ళుమంది.

"కావలిస్తే నన్ను చంపండి! నేను పాపిష్టిదాన్ని. వాళ్ళను ఆపలేకపోయాను" అరిచింది మాధవి.

"ఆ కారు నంబరు చూశావా?"

"లేదమ్మా! నాకు నంబర్లు సరిగ్గా అర్థంకావు" అందామె. సుందరి హాల్లోకి పరుగెత్తింది. రిసీవర్ ఎత్తి నంబరు తిప్పింది.

"హలో!" అందో స్త్రీ కంఠం.

"మా ఆయనతో మాట్లాడాలి" అందామె.

సుందరి ఏడుస్తోంది.

"సుందరీ, ఏమైంది?"

"బాబును ఎవరో ఎత్తుకుపోయారు."

"ఎప్పుడు?"

"మాధవి వాడిని పెరాంబులేటర్లో రోడ్డుమీదకు తీసుకు వెళ్ళింది. కార్లో కొంతమంది వచ్చి వాడిని తీసుకు పోయారు" అందామె'

"డార్లింగ్, ఏడవకు! ఇదేదో బ్లాక్ మెయిల్ అయి వుంటుంది. వాళ్ళు డబ్బు అడుగుతారు. అది పారేస్తే బాబును మనకు ఇచ్చేస్తారు" అన్నాడతను.

"బాబు నా ప్రాణం! వాడు లేకుండా నేను బతక లేను" అంది సుందరి.

"మైడియర్, డోంట్ బాదర్! అవసరమైతే నేను మినిష్టర్తో మాట్లాడ్తాను. గాభరాపడకు!"

"మీరు వెంటనే ఇక్కడకు రండి!" అందామె.

"నాకు చాలా పనులున్నాయి. రాలేను."

"అంతేనా?"

"అక్కడికొచ్చి నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. ఇక్కడినుంచే అంతా చేస్తాను. నువ్వు ధైర్యంగావుండు! నాలాంటి కోటీశ్వరుల బిడ్డల్ని ఎత్తుకుపోతూ నేవుంటారు. ఇదంతా డబ్బుకోసం జరుగుతుంది. డబ్బు పారేస్తే మన బాబు తిరిగి వస్తాడు. అంతే" అన్నాడతను.

"అంతేనంటారా? బాబులేని ఇల్లు నరకంలా వుంది" అందామె.

"డోంట్ బాదర్!" అని అతను రిసీవర్ని పెట్టేశాడు.

చాలా సేపటివరకూ "హలో!" అని ఆమె అరుస్తూనే వుంది. కాని అటువైపునుంచి జవాబులేదు.

ఆమె హాల్లోని సోఫాలో కూర్చుంది. ఆమె పక్కనే నేలమీద మాధవి కూర్చుంది. ఇద్దరూ ఏడుస్తున్నారు.

బ్లాక్ మెయిలర్ ఫోన్ చేస్తాడు! ఫోన్ కాల్ కోసం సుందరి ఎదురుచూస్తోంది.

పది దాటింది. భర్త ఇంకా ఇంటికి రాలేదు. టెలిఫోన్ మ్రోగింది. "హలో!" అందామె.

"మీ బాబు క్షేమంగా వున్నాడు" అందో గంభీరమైన పురుష కంఠం.

"మీ కెంత కావాలి?" అడిగిందామె.

అటువైపు పిశాచంలా ఎవరో నవ్వారు.

"నవ్వకండి. ఎంత కావాలో చెప్తే వెంటనే ఇస్తాను". అందామె.

"నాకు కావలసింది డబ్బుకాదు" అందా కంఠం.

"మరేం కావాలి?" అడిగిందామె.

"బాబుమీద నీకు చాలా ప్రేముందా?"

"వుంది. బాబు నా ప్రాణం. బాబు లేకుండా నేను బ్రతకలేను" అందామె.

"బాబు నీకు దొరక్కపోతే ఏం చేస్తావు?"

"బాధపడ్తాను. బెంగతో క్షీణించిపోతాను"అందామె.

"నాకు కావలసింది అదే! నువ్వు బాధపడాలి! ఏడ్వాలి! తిండి తినలేక కృశించిపోవాలి!" అర్చాడతను.

"ప్లీస్, నా బాబును నా కిచ్చేయండి!" అందామె.

"బాబు మాటలు వింటావా?"

"వింటాను" అందామె.

బాబు చేతిలో సూది దిగింది. బిగ్గరగా బాబు ఏడ్వసాగాడు. "బాబు ఏడుపు వినిపించిందా?"

"ప్లీస్ వాడిని ఏడ్పించకండి! మీకెంతైనా ఇస్తాను. వాడిని నాకు అప్పగించండి!"

అటువైపునుంచి గంభీరంగా నవ్వాడతను.

"ప్రేమంటే యేమిటో నీకు తెలియాలి! నువ్వు గుండెలు బాదుకుంటూ యేడ్వాలి! కన్నీళ్ళలో మునిగి తేలాలి!" అర్చాడతను.

# 8

టైమ్ పన్నెండు దాటింది. పోర్టికోలో కారు ఆపి మోహనరావు దిగాడు. నలువైపులా నిశ్శబ్దంగా వుంది. అతడు హాల్లోకి వెళ్ళాడు. సోఫాలో సుందరి పడుకుని వుంది. నేలమీద పనిమనిషి నిద్రపోతోంది.

అతడు భార్య పక్కనే కూర్చున్నాడు. చేత్తోతట్టి ఆమెను లేపాడు.

కళ్ళు తెరిచి అతడివైపు చూసి ఆమె యేడ్వడం మొదలెట్టింది. ఆమె యేడ్పు విని మాధవి మేలుకొన్నది.

"ఎంత ఘోరం జరిగిందో చూశారా?"

"చెప్పావుగా!"

"బాబు తిరిగి వస్తాడా?"

"సుందరీ, బాబు తప్పక తిరిగివస్తాడు. చిన్నతనంలో ఆరేళ్ళ వయస్సులో వుండగా నన్ను ఎత్తుకుపోయారు. అప్పట్లో లక్షరూపాయలు చెల్లించి నాన్నగారు నన్ను వాపసు తెప్పించారు. వాళ్ళతో నేను వారంరోజులపాటు వున్నాను. వాళ్ళు నన్ను చాలా బాగా చూశారు. నన్ను

ఏమాత్రమూ కష్టపెట్టలేదు."

"బాబును వాళ్ళు జాగ్రత్తగా చూస్తారని నమ్మొచ్చా?" అందామె.

"నమ్మొచ్చు."

క్షణకాలం ఆమె మాట్లాడలేదు. రుమాలుతో ఆమె కన్నీళ్ళను తుడిచాడు.

"భోజనం చేశావా?"

"తినలేదయ్యా" అంది మాధవి.

"తిండి మాని ఇలా యేడుస్తూ కూర్చుంటే బాబు రాడు. మనం ధైర్యంగా వుండాలి. పద తిందాం."

మాధవి లోపలకు పరుగె త్తింది. వాళ్ళు భోజనాని కొస్తున్నారని సావిత్రమ్మతో చెప్పింది.

మోహనరావు, సుందరి డైనింగ్ రూమ్‌లోకి వెళ్ళారు. ఏర్ కండిషండ్ గది. కుషన్డ్ కుర్చీల్లో పక్కపక్కనే కూర్చున్నారు. అనేక ప్లేట్లను సావిత్రమ్మ వాళ్ళముందు టేబుల్ మీద పెట్టింది. మోహనరావు ఆకలితో తింటు న్నాడు. సుందరి మౌనంగా కూర్చుంది.

"వాళ్ళు ఫోన్ చేశారా?"

"చేశారు."

"ఎంతడిగారు?"

"చెప్పలేదు. బాబుకోసం పరితపిస్తూ నేను బాధ పడాలన్నారు" అందామె.

ఆలోచిస్తూ మోహనరావు తింటున్నాడు. ఫోన్ ద్వారా ఆ వ్యక్తి చెప్పినదంతా సుందరి భర్తకు తెలి పింది. "విచిత్రంగా వుంది. నువ్వు బాధపడ్తే వాళ్ళకొచ్చే దేమిటి? శాడిస్టిక్! మొదట్లో అలా అన్నా మళ్ళీ ఫోనుచేసి యెంతకావాలో చెప్తారు. యెలా ఇవ్వాలో

కనుక్కో!" తింటూ అతడు భార్యవైపు చూశాడు.

"సుందరీ తిను! వాళ్ళు నిన్ను బాధపడమన్నారు. వాళ్ళకు సరైన జవాబు నువ్వు బాధపడకపోవడం!"

"నాకు తిండి వెళ్ళదు" అందామె ఏడుస్తూ.

"ఇలా ఏడుస్తూ కూర్చుంటే బాబు తిరిగివచ్చేసరికి నువ్వు అస్థిపంజరంలా వుంటావు. నిన్ను ఆ స్థితిలో చూసి నేనూ, వాడూ ఏడ్వాలి! ఏడ్పు అంటే నాకు అసహ్యం. ప్లీస్, యేడ్వడం మాని తిను!"

ఆమె తినడానికి ప్రయత్నించింది. కాని ఆకలిలేదు! ఆమె మనస్సు బాబుమీదే వుంది. తనకోసం బాబు యేడుస్తున్నాడేమో! బాబుకి వాళ్ళు పాలు యిచ్చారో, లేదో!

# 9

అతడు ఆరక్ సేవిస్తున్నాడు. పక్కనే బాబు పక్కమీద నిద్రపోతున్నాడు.

అతడు బాబువైపు చూశాడు. తల్లిపోలిక! అచ్చగా తల్లిలాగానే వున్నాడు.

మొదట్లో బాబు విపరీతంగా ఏడ్చాడు. కొంతసేపు టాక్సీలో తిప్పేసరికి సీటుమీద పడుకుని నిద్రపోయాడు.

గ్లాక్సో డబ్బా, ఫారెక్స్, ఫీడింగ్ బాటిల్, కొన్ని బొమ్మలు, దుస్తులు బాబుకోసం కొన్నాడతను. తను పిన్ను గుచ్చినచోట ఎర్రగా వుంది. బిడ్డ యేడ్పు తల్లికి వినపడాలని అతడు పిన్నును చేతిలోకి గుచ్చాడు. ఆ కుర్రాడి బాధ చూసి తర్వాత విచారించాడు.

నిషాలో వున్న అతడికి మంజూ గుర్తొస్తోంది. చాలా కాలం తర్వాత ఆ కంఠాన్ని ఫోన్‌లో విన్నాడు.

ఆమె తన్ని గుర్తుపట్టి వుండదు. ఎవడో బ్లాక్ మెయిలర్ డబ్బుకోసం బాబును యెత్తుకుపోయాడని

ళావిస్తోంది. అందుకే యెంత కావాలని అడిగింది.

గ్లాసులోని అరక్‌ను తాగేసి అతడు పకపక నవ్వ సాగాడు. ఆ నవ్వుకు బాబు మేల్కొన్నాడు. కళ్ళు తెరిచి అతడివంక చూశాడు. "అమ్మా!" అంటూ అతడివైపు తప్పటడుగులు వేస్తూ వెళ్ళాడు. అతడి ఒళ్ళో పడు కున్నాడు. ఒళ్ళో పడుకున్న బాబువైపు అతడు సూటిగా చూశాడు. బాబు తీయగా నవ్వాడు. అదే నవ్వు! మరుపురానిది! అతడు మరువలేనిది!

అతడు బాబుకేసే చూస్తున్నాడు. గ్లాసులో అరక్ పోసుకున్నాడు. ఆ గ్లాసువైపు బాబు చెయ్యి చాచాడు.

"ఇది నీకు కాదు!" అన్నాడతను.

గ్లాసును టేబులుమీద పెట్టి అతడు లేచాడు. నీళ్ళలో గ్లాక్సో పౌడరు కలిపి దాన్ని బాటిల్లో పోసి తీసుకెళ్ళి బాబుకిచ్చాడు. తాగుతూ కూర్చున్నాడు బాబు.

అతడు గ్లాసులోని అరక్‌ను తాగేశాడు. తన ఫీడింగ్ బాటిల్ని పక్కన పడేసి బాబు నవ్వుతూ అతడి దగ్గర కొచ్చాడు. కోపంగా అతడు బాబువైపు చూశాడు. ఏడుస్తూ బాబు అతడి ఒళ్ళో పడ్డాడు. బాబుని ఎత్తుకుని అతడు గదిలో యిటూ అటూ తిరిగాడు.

కాస్సేపట్లో బాబు నిద్రపోయాడు. పక్కమీద బాబును పడుకోబెట్టి అతడు గ్లాసులో అరక్ మళ్ళా పోసుకున్నాడు.

కళ్ళు తిరుగుతున్నాయి. గోడలు, కుర్చీలు, గదిలోని అన్ని వస్తువులూ గిర్రున తిరుగుతున్నాయి.

తటాలున అతడు బాబు పక్కనే పడి, క్షణంలో కళ్ళు మూసి నిద్రపోయాడు.

పొద్దుట మేలుకున్నాడతను. బాబు ధరించిన గుడ్డలు

తడిసి వున్నాయి. అతడు లేచాడు. బాబును బాత్‌రూం లోకి తీసుకెళ్ళి బాగా కడిగాడు. తను కొన్న కొత్త బేసి, పౌడర్ పూసి, పాలతో నిండిన బాటిల్ తిత్తిని బాబు నోట్లో పెట్టాడు.

చేతులు, కాళ్ళు వూపుతూ బాబు తాగసాగాడు.

తను పనిలోకి వెళ్ళాలి! ఎలా? శిశువిహార్ అతడి గుర్తొచ్చింది.

అతడు తొందరగా తయారయ్యాడు. కావలసిన వస్తువులను ప్లాస్టిక్ బుట్టలో పెట్టాడు. బాబుని ఎత్తుకుని ప్లాస్టిక్ బుట్ట పట్టుకుని, బయటకు నడిచి తలుపు మూసి తాళం వేశాడు. ముందు సీటుమీద బాబును కూర్చో బెట్టి టాక్సీని పోనిచ్చాడు.

శిశువిహార్‌లో బాబునూ, ప్లాస్టిక్ బుట్టనూ అప్ప గించి అతడు స్వేచ్ఛగా తన టాక్సీవైపు నడిచాడు.

రాత్రి తొమ్మిదిదాకా బాబును వాళ్ళు అక్కడ జాగ్రత్తగా చూస్తారు. అతను తన పని చేసుకోవచ్చు.

సాయంత్రం మూడింటికి అతడు ఒక టెలిఫోన్ బూత్‌లోకి దూరాడు. ఒక నంబరు తిప్పి యాభైపైసల కాసు పడేశాడు.

"హలో!" అంవొక స్త్రీ కంఠం అటువైపునుంచి.

"నీ కొడుకు బాగానే ఉన్నాడు" అన్నాడతను.

"మిస్టర్ నీకేం కావాలి? నన్నెందుకిలా పీడిస్తు న్నావు?" అందామె.

"ఆలోచిస్తే నీకే అర్థమవుతుంది!"

"ప్లీజ్, ఎంత డబ్బు కావలసినా యిస్తాను. నా బాబును నాకిచ్చేయి."

అతడు వెటకారంగా నవ్వాడు.

"డబ్బుతో నువ్వు ప్రేమించిన బాబును కొనలేవు!"

"దేనితో కొనగలను చెప్పు!" అందామె.

"ఏడ్వాలి! దుఃఖసముద్రంలో అల్లల్లాడాలి! ఆకలి చచ్చి చిక్కి శల్యమవ్వాలి!"

అటువైపున ఆమె వెక్కి వెక్కి యేడుస్తోంది.

అతడు రిసీవర్ పెట్టేసి బయటకు నడిచి టాక్సీలో కూర్చుని తలుపు మూశాడు. టాక్సీ కదిలింది.

# 10

టైమ్ పది దాటింది. అతడింకా ఇంట్లోనే ఉన్నాడు. బాబుతో ఆడుకుంటూ కూర్చుండిపోయాడు.

ఎవరో తలుపును తట్టారు. అతడు వెళ్ళి తలుపు తెర్చాడు. మాధవి కన్నీళ్ళతో లోపలకు దూసుకొచ్చింది.

"బాబును ఎత్తుకుపోవద్దంటే వినలేదు. నువ్వు చేసిన పని మూలంగా ఆనందంగా బతికే ఒక యువతి జీవితం అకాలంగా అంతరించింది" అందామె.

"ఏమైంది?" అడిగాడతను ఆమెవైపు చూస్తూ.

"సుందరి మాతిలో పడి మరణించింది. తోటమాలి ఆమె శవాన్ని బయటకు లాగాడు...."

"మంజూ! మంజూ!" అర్చాడతను.

అతడి కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. ఆమె అతడి దగ్గరగా వెళ్ళి చెయ్యి పట్టుకుంది.

"బాబును వెంటనే ఆ యింటికి పంపేయి. తల్లి శవాన్ని ఆఖరిసారిగా చూసే అవకాశాన్ని అతడికి కల్పించు" అందామె.

"బాబే కాదు, ఆమెను నేనూ చూడాలి. కాని ఎలా?"

"అక్కడికెళ్ళి ఆమెను చూడాలంటే యిదే సరైన

సమయం. ఆమె భర్తకు ఫోన్ చేశాను. కాని ఆయన ఆఫీసులో లేరు. తోటమాలీ, నేనూ ఆమె శవాన్ని పడ గ్గదిలో చాపమీద పడుకోబెట్టాం. నేను వెంటనే యిక్క డకు ఆటోలో వచ్చాను" అందామె.

"ఆమెను చూడ్డానికి తెగిస్తాను" అని అతడు బయ ల్దేరాడు.

బాబును ఆమె ఎత్తుకుని బయటకు నడిచింది. తలుపు మూసి అతడు తాళంవేశాడు. ఆమె కారులో కూర్చుంది. అతడు టాక్సీని విమానంలా పోనిచ్చాడు.

గేటు తెర్చి వుంది. గూర్ఖా స్టూల్ మీద కూర్చుని వున్నాడు. అతడు టాక్సీని లోపలకు పోనిచ్చి పోర్టి కోలో ఆపాడు. వాళ్ళు కిందకు దిగారు. చప్పుడు చేయొ ద్దని ఆమె అతడిని హెచ్చరించింది.

హాల్లో యెవ్వరూ లేరు. ఒక గదివైపు వాళ్ళు నడిచారు. ఆమె తలుపును తోసింది. విచారవదనంతో అతడిని లోపలకు వెళ్ళమంది.

ఆమెనుంచి బాబును అతడు తీసుకున్నాడు. మెల్లిగా లోపలకు వెళ్ళాడు. అతడి గుండె వేగంగా కొట్టుకుం టోంది. కళ్ళమ్మట నీళ్ళు కార్తున్నాయి.

తడిగుడ్డలో ఆమె నేలమీద వెల్లకిలా పడుంది. ఆమె పక్కనే అతడు బాబును వదిలాడు. "అమ్మా!" అని ఏడుస్తూ బాబు ఆమెవైపు వెళ్ళి మీదపడ్డాడు.

"మంజూ!" అని పిలుస్తూ అతడు ఏడ్వసాగాడు.

ఆమెను చూడలేక వెనక్కు తిరిగాడు.

"రామ్!" పిల్చారెవరో.

అతడు తిరిగి ఆమెవైపు చూశాడు.

చాపమీద పడున్న సుందరి తటాలున లేచింది.

"రామ్, నేను బతికే ఉన్నాను. చావలేదు" అందామె.

నిర్ఘాంతపోతూ ఆమెవైపు చూస్తూ వుండిపోయాడతను. ఆనందంతో అతడలాగే నిలబడ్డాడు కొంతసేపు.

"మంజూ, నేను చేసిందానికి నన్ను క్షమించు. కాని నువ్వు ఆడిన యీ నాటకం దేనికోసం? నన్ను పోలీసులకు పట్టివ్వడానికా?" అడిగాడతను.

ఆమె తీయగా నవ్వింది.

"రెండోసారి ఫోన్ చేసినపుడు నీ కంఠాన్ని నేను గుర్తించగలాను. అంతేకాదు. మాధవి కూడా నాకు నిజం చెప్పేసింది. నేను మరణించేనని నీకు తెలిస్తే నా శవాన్ని చూడ్డానికి నువ్వు వస్తావనీ, బాబును తిరిగి యిచ్చేస్తావనీ నాకు తెలుసు. అందుకే యీ నాటకం నేనూ, మాధవీ కలిసి ఆడాం. నిన్ను పోలీసులకు పట్టివ్వాలనే ఉద్దేశం లేదు నాకు. అటువంటి దురుద్దేశం నాకెప్పుడూ ఉండదు."

అతడు మౌనంగా వింటున్నాడు.

"నీ ప్రేమ చాలా గొప్పది. దాన్ని ద్వేషంగా మారనీయకు రామ్! నిజమైన ప్రేమ భార్యకాలేకపోయినా యువతిని చెల్లెలుగా ఆదరించగలదు. హృదయంలో వింత ప్రేమున్నా విధి మనుషుల్ని మరో తోవమ్మట లాక్కుపోతుంది. విధినెవ్వరూ యెదిరించలేరు, రామ్!"

ఆమె ఆగింది. అతడివైపు నవ్వుతూ చూసింది. "రామ్, ఇటువైన నువ్వు ఒంటరిగా జీవిస్తే నేను భరించలేను. నీ పెళ్ళిచేసే బాధ్యత నాదీ. నీకోసం ఒక మంచి అమ్మాయిని చూశాను" అని ఆమె మాధవివైపు చూసింది.

అతడు మౌనంగా నిలబడ్డాడు.

"రామ్, మాధవి నీతో తనని గురించి ఏదేదో చెప్పింది. అదంతా అబద్ధం. ఆమె సంస్కారంగల యువతి. విచారకరమైన పరిస్థితుల్లో ధైర్యంగా ఆమె ఇక్కడికి వచ్చేసింది. నిన్ను పెళ్ళాడ్డానికి ఆమె సిద్ధంగా వుంది" అంది సుందరి.

"నేను వెళ్ళనా?" అడిగాడతను.

"స్వేచ్ఛగా వెళ్ళొచ్చు! యెవ్వరూ నిన్ను ఎక్కడా ఆపరు" అంది సుందరి.

"అదేమిటమ్మగారూ అలా అంటారు? అతడి తోవకు నేను అడ్డుపడ్డాను" అంది మాధవి.

ముగ్గురూ పకపక నవ్వారు. అతను బయటకు నడిచాడు. పోర్టికోలో వున్న టాక్సీ దగ్గరకు చేరుకున్నాడు.

మాధవి అతని వెనకనే పరుగెత్తింది.

"ఇక్కడ కాదు, నా ఇంటికిరా, నీకు బుద్ధి చెప్తాను" అన్నాడతను నవ్వుతూ.

"ఏం చేస్తావో వచ్చి చూస్తాను" అంది మాధవి నవ్వుతూ.

అతడు కూర్చుని తలుపు మూశాడు. టాక్సీ కదిలే ముందు వరండావైపు చూశాడు. బాబుని ఎత్తుకుని సుందరి అక్కడ నిలబడి వుంది.

టాక్సీ పోగానే సుందరి ఫోన్ దగ్గరకు వెళ్ళి రిసీవరెత్తి ఒక నంబరు తిప్పింది. కాస్సేపట్లో భర్త కంఠం అటువైపునుంచి వినపడింది. "ఎవరో బాబుని తీసుకొచ్చి వరండా మీద వదిలేశారు!" అందామె ఆనందంగా.

—: అయిపోయింది :—

# వైరివాడి తెలివి

బి. రాజేశ్వరి

చటుక్కున కళ్ళు తెరిచింది సుస్మిత. వాతావరణంలో ఏదో భేదం వచ్చినట్లనిపించింది. కళ్ళు బాగా విచ్చుకుని చూసింది. అది తన పడకగది కాదు! అలాగే ఉన్న మరో పడక గది.

సుస్మిత గుండె ఒక్క క్షణం ఆగి కొట్టుకుంది. రాత్రి తల్లితో బాటు తమ ఇంట్లో తన పడక గదిలో పడుకొంది. కాని ఇప్పుడు తెల్లారి లేచేసరికి మరో ఇంట్లో మరో గదిలో వుంది. ఇదెలా సాధ్యం?

తను కల కనటం లేదుకదా అనుకున్నదో క్షణం. గిల్లి చూసుకుంది. 'అబ్బ' అనుకుంది ఎర్రగా కందిన స్థలం చూసుకుని.

కల కాదు, నిజమే! చుట్టూ పరికించి చూసింది. అలారం టైంపీస్ టేబిల్ మీద ఉంది. కాని అది తమ గదిలో వుండే టైంపీస్ కాదు!

ఉదయం ఆరుగంటల పదినిమిషాలయింది అప్పటికి.

చీకటిపోయి పూర్తిగా వెలుగు వచ్చేసింది.

సుస్మిత గుండె వేగంగా కొట్టుకుంటోంది భయంతో. టెన్షన్‌తో అణువణువూ కంపించిపోతోంది. ఏం జరిగిందో అర్థంకావటంలేదు. తను నిద్రపోతుండగా యెవరో ఎత్తుకొచ్చి మరోచోట మరో పక్కమీద పడుకోబెట్టారు. వేరే పక్కమీద పడుకుని ఉన్నానన్న ఆలోచన రాగానే ఆమె వెన్నున జరజర ఏదో పాకినట్టనిపించింది.

చటుక్కున లేచి పక్కనున్న పేం కుర్చీలో కూచుంది.

నిద్రలో ఉండగా తనకేం కాలేదు, నయమే! భగవంతుడికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంది. ఎలాంటి ఆపద నెదుర్కోవాలో, ఎలా ఇక్కడినుంచి బయటపడాలో ఆమెకర్థం కాలేదు. కూర్చుని యెంతోసేపు ఉండలేకపోయింది.

లేచి నించుంది. దిగజారిపోతున్న ధైర్యాన్ని కూడగట్టుకోవటానికి కాయశక్తులా ప్రయత్నించింది. గుండె వేగంగా కొట్టుకోవటం తగ్గలేదు. అరచేతులు, అరికాళ్ళు చిరుచెమటతో తడిసిపోయాయి. నాలుక పొడారిపోయినట్లనిపించింది. మనసంతా, ఏదో ప్రమాదం ముంచుకురాబోతున్నట్టు అనిపిస్తోంది.

ఆమెకి ఏమీ అర్థంకావటంలేదు. రాత్రి పదిగంటలకు తన తల్లి పక్క పక్క మంచాల మీద పడుకున్నారు. తను ఓ అరగంటసేపు ఏదో మేగజైన్సు తిరగేస్తూ అలాగే యెప్పుడో నిద్రలోకి జారిపోయింది. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు. బెడ్‌లాంపు వెలిగించి ట్యూబ్‌లైటు తీసేద్దామనుకుందిగాని, ఆ విషయమే మరిచి నిద్రకొరిగిపోయింది.

గాఢనిద్ర, ఎప్పుడూ ఎరగని మొద్దునిద్రపోయింది. లేచి చూసేసరికి ఇక్కడ, ఇలా....

అది చిన్న గది! ఓ మంచం, పేముకుర్చీ, ఓ టేబిలు, అంతే ఆ గదిలో. గది తలుపు బయటినుంచి బంధించారు. గోడకున్న అలమరలో ఏవో రెండు పుస్తకాలున్నాయి. తప్పితే మరేంలేవు. టేబిల్ మీద అలారం టైంపీస్, మంచినీళ్ళ జగ్, జగ్ మీద ఓ గ్లాసు బోర్లించివుంది. ఓ స్టూలుమీద ఆ రోజు పేపర్లు మూడు — తెలుగు, ఇంగ్లీషువి ఉన్నాయి. ఓ మంత్లీ, రెండు వీక్లీలు కూడా వున్నాయి.

సుస్మిత లేచి గదిలో అటు ఇటు పచార్లు చేసింది. గదికి ఓ పక్కనే తలుపుంది. కిటికీ స్థానంలో ఓ వెంటిలేటర్ కప్పుకి ఓ అడుగు కిందుగా వుంది. గదిలోనించి లోపలివైపు మరో తలుపుంది.

ఆమె ఆ తలుపు తోసింది. బాత్ రూం లావెట్రీ చాలా నీట్ గా వుంది. ఎవరూ ఉపయోగిస్తున్నట్టు లేదు గాని, ఎక్కడికక్కడ వాటర్ పైపులున్నాయి.

సుస్మిత బాత్రూం తలుపుమూసి, మళ్ళీ గదిలోనికి అడుగుపెట్టింది. అదో మయసభలా వుంది. గోడలకి నాలుగుపక్కలా ఖరీదైన నిలువుటద్దాలు అమర్చబడి వున్నాయి. గోడ అలమరలో పౌడరు, స్నో, సెంట్ వంటి కాస్మెటిక్స్ ఉన్నాయి. తిలకం, కాజల్ కూడా పెట్టడం మరిచిపోలేదు వాళ్ళెవరో!

సుస్మిత ఓ నిర్ణయానికి వచ్చింది. తనని కావాలని ఈ గదిలో బంధీచేశారెవరో. యెవరని వూహించగలదు? వాళ్ళకి తనతో ఏం పని? తనకి కావలసిన సౌకర్యాలన్నీ ఉన్నాయి ఈ చిన్న గదిలో. అంటే ఒక్కరోజో రెండు రోజులోకాదు, కొన్నాళ్ళపాటు తనకీ బందీఖానా తప్ప

దన్న మాట!

సుస్మిత మెదడు ఆలోచనలతో వేడెక్కిపోయింది. తనని అపహరించి తేవలసిన అవసరం, అవకాశం ఎవరి కున్నాయి? ఏమాశించి తనని బంధించారు? అందువల్ల ఎవరికి లాభం? ఎంత ఆలోచించినా ఏమీ తట్టడంలేదు.

తల్లి గుర్తు రాగానే సుస్మిత కళ్ళు చెమర్చాయి. అమ్మ ఎలా వుందో? తెల్లవార్తూనే తను పక్కమీద లేకపోగానే ఎంత కంగారు పడిపోయిందో? నాన్న గారు పోయింతర్వాత అమ్మ తనకి నాన్నగారు లేని లోటు రానివ్వకుండా అన్నీ తనే అయి పెంచుతూ వస్తోంది.

నాన్నగారు తనకి బాగా గుర్తే! తనకు పదేళ్ళ వయసులో అయిదోక్లాసు చదువుతుండగా ఓ రోజు స్కూలునించి వచ్చేసరికి అమ్మ ఇంట్లో లేదు. యిల్లు తాళంపెట్టి వుంది. పక్కింటి ఆంటీ తనను యింట్లోకి పిలిచి కూచోబెట్టుకుంది తన పక్కనే! తను అమ్మ గురించి అడిగితే ఆమె వెంటనే ఏం చెప్పలేదు. 'వచ్చే స్తుందమ్మా ఇప్పుడే వచ్చేస్తుంది' అని మాత్రం చెప్పి ఏదో అర్జంటు పనున్నట్టు ఇంట్లోకివెళ్ళి ఏదో పనిలో మునిగిపోయింది.

ఆ తర్వాత ఎనిమిది గంటల ప్రాంతంలో తమ ఇంటి ముందు ఆగిన టాక్సీలోనుంచి నాన్నను మోసుకొచ్చి వరండాలో పడుకోబెట్టారు నాన్న ఆఫీసులో పనిచేసే వాళ్ళు. అమ్మ గోలుగోలున ఏడుస్తూ, బలవంతాన ఆపు కున్నా ఆగని దుఃఖంతో లోపలకొచ్చింది. తను పక్కింట్లోంచి ఒక్క ఉరుకున తమ ఇంట్లోకి పరుగెత్తింది.

తర్వాత తెలిసింది, నాన్నగారు నడుపుతున్న స్కూటర్ని లారీ ఢీకొట్టిందని! రోడ్ మీదనే నాన్నగారి ప్రాణం

పోయిందని! తను ఏడుస్తూ నేలమీదపడి ఎప్పుడో నిద్ర పోయింది.

నాన్నగార్ని ఎక్కడికో తీసుకుపోవటం, తర్వాత తన మామయ్య, మామయ్య కొడుకు సూర్యప్రకాశ్ — అందరూ వాడిని సూరి అని పిలిచేవారు — తమింటికి రావటం, అమ్మని తీసుకుపోతాం రమ్మనటం, అమ్మ రానని నిరాకరించి ఆ ఇంట్లోనే ఉండిపోవటం, తను అనిపాసులు చూసే నెపంతో మామయ్య సూరిబావతో తమింట్లోనే ఉండిపోవటం నిన్న మొన్న జరిగినట్లు ఊహ తెలిసిన తన జ్ఞాపకాల పొరల్లో దాక్కుని వున్నాయి.

తండ్రి స్మృతిపథంలో మెదలగానే అనుకోకుండానే ఆమె కళ్ళు ఆర్ద్రతను నింపుకుని తడిశాయి.

తనకి గుర్తున్నంతవరకు తండ్రి తనసెంతో గారాబంగా చూసుకునేవాడు. తను అడక్కుండానే, తన నోట్లోమాట నోట్లో ఉండగానే తనక్కావలసింది తెచ్చి పెట్టేవాడు. సాయంత్రాలు పార్కులకి, షికార్లకి తీసుకు పోయేవాడు. సర్కస్‌లు, సినిమాలు చూపించేవాడు. సాధారణంగా అమ్మతోకన్న నాన్నతోనే తను ఎక్కువ చనువుగా వుండేది.

తనకి తాతగారు కూడా చూచాయగా, గుర్తున్నాడు. తను మూడో క్లాసు చదువుతుండగా కాబోలు తాత గారు చనిపోయాడు. ఆయనయితే తనని ఒక్క క్షణం కూడా వదిలివుండేవాడు కాదు. తనసెంతో ప్రేమగా చూసుకునేవాడు. తనని గుఱ్ఱంలా ఎత్తుకుని మోసేవాడు. ఆయనకి బుగ్గమీసాలుండేవి. అవి పట్టుకుని తను నిజంగా గుఱ్ఱం మీద ఎక్కినట్టే ఆయన వీపు మీద కూచుని,

ఉత్సాహంగా ఆయన మీసాలు పట్టుకుని వూగేది! అలాంటి తాతగారు యిప్పుడు లేరు!

తాతగారు పోయిన రెండు సంవత్సరాలకే తండ్రి కూడా పోవటంతో యీ ఆరేడు సంవత్సరాలుగా తను మనస్ఫూర్తిగా నవ్వటమే మర్చిపోయింది.

నాన్నగారు పోయాక అమ్మ ముఖంలో చిరునవ్వే కరువై పోయింది. అన్నీ నాన్నగారితోనే పోయినట్టు విరాగిలా ఉంటుంది. అందుకే అమ్మని చూస్తే తనకి జాలి అంతకుమించి భయభక్తి కూడా ఉన్నాయి. అందుకే అమ్మతో తాతగారి దగ్గర, నాన్నగారి దగ్గర చూపే చనువు చూపించలేక పోయిందేమో తను!

మామయ్య కూడా తన సెంతో ప్రేమగా చూస్తారు గాని, ఎందుకో మామయ్య దగ్గర తనకు చనువుగాని, ఆప్యాయతగాని ఏర్పడలేదు. ఆయన్ని చూస్తుంటే తనకి యిందుకీ పెద్దవాడన్న గౌరవం, భక్తి, భయం వంటివి కలగవు. ఏదో తల్లి తోబుట్టినవాడనే బంధం తనను ఆయనతో ముడిపెట్టి వుండకపోతే అతనెవరో అన్నట్టే ఉంటుంది తనకు!

అలాగే మామకొడుకు సూరి అన్నా తనకు మంచి అభిప్రాయంలేదు. ఇరవయ్యేళ్ళొచ్చినా ఇంకా టెన్త్ క్లాస్‌లోనే ఉండిపోయిన సూరి తన దృష్టిలో మొద్దబ్బాయి కిందే లెక్క! పదహారేళ్ళకే తను ఇంటర్ పాసయి డిగ్రీ చదువుతోంది. ఇప్పుడు తనకి పద్దెనిమిదేళ్ళు. తనని చూసి సూరి ఇకిలించటం, తనతో మాటలు పెంచుకోవాలని చూడటం తనకి ఎందుకో నచ్చదు! కట్టె విరిచినట్టు మాట్లాడినా, అతను పిలిచినపుడు పలకపోయినా సూరి అదేం లెక్కచెయ్యడు. తను చిరునవ్వు

నవ్వితే అదో వరంలాగా తను మాట్లాడితే అదో ప్రత్యేకతలాగా భావించుకుని మురిసిపోతాడు. ఓ విధంగా అమాయిక జీవి అనే చెప్పాలి.

సుస్మిత ఆలోచనలని చెదరగొడుతూ, తలుపులు తెరుచుకున్నాయి. ఆమె దిగ్గున చూసిందటువైపు.

ఎదురుగా నవ్వుతూ నిల్చున్న వ్యక్తిని చూసి, ఆశ్చర్యంతో నోరు తెరిచింది.

## 2

"మామయ్యా నువ్వా?" అన్నది అస్పష్టంగా.

సుస్మిత మామయ్య—పల్లంరాజు—యింకా అలాగే నవ్వుతూనే "అవునమ్మా, నేనే!" అన్నాడు.

"నన్నిక్కడికెవరు తీసుకొచ్చారు?" అన్నది సుస్మిత. ఆమెకు ఉక్రోషంతోను, కోపంతోను కంటనీరు తిరిగింది.

"ఎవరు తీసుకొస్తారు, నేనే!"

"ఎందుకు తీసుకొచ్చావు?"

"ఎందుకేమిటమ్మా, మామయ్య ఇంటికి రావటంలో తప్పేముంది?"

"ఇది మామూలుగా రావటమా, ఎత్తుకుని రావటమా?"

"ఏదైనా అనుకో! నువ్వెప్పటికైనా ఈ ఇంటికి రావలిసినదానివే! అందుకే తీసుకొచ్చాను."

"ఎవర్నడిగి తీసుకొచ్చావు?"

"ఎవర్నడగాలి? నాకా స్వతంత్రం లేదా!?"

"ఎవరిచ్చారు నీకా స్వతంత్రం?"

"ఒకరిచ్చేదేమిటి, నేనే తీసుకున్నాను!"

"అమ్మతో చెప్పావా, కనీసం నాతో చెప్పావా? దొంగచాటుగా నిద్రపోతున్న దానిని నిద్రపోతున్నపళంగా

తీసుకొచ్చావు. ఇదేనా నీకున్న స్వతంత్రత?"

"పిల్లినడిగి గంటకడతామా? ఎద్దునడిగి గంత కడతామా?"

"నా పోలిక పశువులతోనా? అవునులే, నువు చేసిన పని మనుషులు చేసేది కాదుగా!"

"సుస్మీ, ఏమిటా మాటలు పెద్దరికం, చిన్నరికం లేకుండా! అమర్యాదగా మాట్లాడతావూ!"

"నువ్వు చేసిన పని పెద్దమనిషి తరహాగా వుందా, నేను గౌరవంగా మాట్లాడటానికి! నువ్విలా నన్నెత్తుకొచ్చావని తెలిస్తే అమ్మ నిన్ను యెన్నటికీ క్షమించదు సరికదా. నిన్ను మా యింటి ఛాయలకికూడా రానివ్వదు. నీ నీడని కూడా అసహ్యించుకుంటుంది."

"మీ అమ్మకు తెలిసేలా చేస్తానా ఇలాంటి పనులు?"

"అసలు నన్నెందుకు ఎత్తుకొచ్చావు?"

"ఏం, ఇక్కడ నీకు బావుండలేదా? ఇది అచ్చం మీ ఇంట్లోని నీ గదిలా లేదూ!"

"అడిగిన సంగతి వదిలేసి పక్కదారి పట్టిస్తావెందుకు? సూటిగా సమాధానం చెప్పు!"

"చెప్పాను కదా! నువ్వు యింతదాకా నా మేనకోడలివి! ఇప్పుడు నా కోడలిగా చేసుకుందామని!"

"మామయ్యా!" కోపంగా అరిచింది సుస్మిత.

"అదే, ఆ పిలుపే శాశ్వతంగా పిలిపించుకోవాలనే నమ్మి నిన్ను తీసుకొచ్చా మరి!"

"నన్నలా చిన్నపిల్లని చేసి మాట్లాడకు. నామీద యే మాత్రం అభిమానమున్నా, అమ్మమీద ఏ మాత్రం వాత్సల్యం, ప్రేమ మిగిలున్నా—నన్ను వెంటనే అమ్మ దగ్గరికి చేర్చు."

"తిరిగి మీ ఇంటికి పంపెయ్యటానికా తీసుకొచ్చాను?"

"మరి ఎందుకు? నన్నేం చేయబోతున్నావు?"

"అవన్నీ ముందు ముందు నీకే తెలుస్తాయి. ఇక్కడ నీకేలోటూ రాదు. నీ క్కావలసినవన్నీ నీ కాళ్ళ వద్దకే వస్తాయి. నీ కిక్కడ రాజభోగం జరుగుతుంది. కాబోయే యజమానురాల్ని ఎలా చూసుకోవాలో వీళ్ళందరికీ తెలుసు!"

సుస్మిత చాలా కోపంగా చూసింది మామయ్యవంక. పల్లంరాజు యిదేం పట్టించుకోనివాడిలా, నౌకర్లవంక చూసి, "అమ్మాయిగారికేలోటూ రాకుండా చూసుకోండి! ఏమైనా తేడాపాడాలొస్తే ఊరుకునేదిలేదు" అన్నాడు. తర్వాత సుస్మితవంక తిరిగి, "బాత్రూంలో నీక్కావలసినవన్నీ పెట్టే వుంచారనుకుంటాను వీళ్ళు! శుభ్రంగా స్నానంచేసి కూచో. వేడివేడి టిఫెన్, హార్లిక్స్ పంపిస్తాను" అన్నాడు పల్లంరాజు.

"నాకేం పంపవద్దు. నన్ను అమ్మ దగ్గరికి తిరిగి పంపేవరకు యీ యింట పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టను."

"శపథం చేస్తున్నావా?"

"అంతేననుకో! నా గురించి నీకు బాగా తెలుసు. చావనైనా చస్తానుగాని, నా యిష్టానికి వ్యతిరేకంగా నాచేత యేమీ చేయించలేవు."

పల్లంరాజు ఆమె మాటలధాటికి, తీవ్రతకు జంకాడు. సుస్మిత అన్నంతపని చేస్తుంది. చాలా పట్టుదలగల పిల్ల. తల్లికన్న పట్టుదలకలది! తన పంచన ససేమిరా తల దాచుకోనని మొండికేసింది ఆమె తల్లి. అందుకే తనే నూరితో వాళ్ళింటికొచ్చి ఉంటున్నది!

పల్లంరాజు సుస్మితవంక రెండు క్షణాలు చూసి, తనక్కడ నిల్చుని ఉండటాన్నికూడా ఆ పిల్ల సహించలేక

పోతున్నదని గ్రహించి మౌనంగా బయిటికెళ్ళిపోయాడు.

సుస్మిత బోనులోపడ్డ పులిలా ఆ గదిలో కాసేపు తిరిగింది. ఇది మామయ్య యిల్లేనా, లేక, తమ వూళ్ళోనే మరో ఇల్లా? అనుకుంటూ ఆలోచిస్తూ గడిపింది కాసేపు.

ఎలాగైనా యీ బందిఖానానించి బయట పడాలి! మామయ్య యిక్కడికెందుకు తీసుకువచ్చాడో సూచాయగా అర్థమవుతోందామెకు. క్షణక్షణానికి మామయ్య మీద అసహ్యం పెరిగిపోతోంది. ఎలాగైనా యిక్కడి నుంచి బయటపడాలి. ఎలా, ఎలా?

పనిమనుషులు టిఫిన్, హార్లిక్స్ తెస్తే వాటిని గోడకేసి కొట్టింది. హార్లిక్స్ వాళ్ళ ముఖాలమీద చిమ్మింది. అంతే, మళ్ళీ వాళ్ళు ఆమె పక్కకు రావటానికి సాహసించలేదు.

## 3

సాయంత్రంవరకు నిరాహారదీక్ష పూనినట్టు నిజంగానే పచ్చి మంచినీళ్ళు ముట్టలేదు సుస్మిత. మూడుగంటల ప్రాంతాల పల్లంరాజు వచ్చి బతిమాలి వెళ్ళాడుగాని ఆమె పలకనైనా పలకలేదు.

చీకటిపడింది. గదంతా చిమ్మచీకటి అలముకున్నా లైటు వేసుకోవాలనిపించలేదు సుస్మితకు. తల్లి గురించి, యింటిదగ్గర పరిస్థితి గురించి ఆలోచిస్తోందామె. తనని రాత్రికి రాత్రే యిక్కడికెలా తీసుకురాగలిగాడు మామయ్య—అని ఆలోచిస్తోంది.

మామయ్య వాళ్ళది విజయవాడ. తమది హైదరాబాదు. రాత్రికి రాత్రి హైదరాబాదునించి విజయవాడ ఎలా తీసుకురాగలిగాడు? దాదాపు ఏడుగంటల ప్రయాణం కార్లో తీసుకొచ్చినా కూడా.

రాత్రి పదకొండు గంటలకి తను నిద్రపోయింది. ఆ వెనువెంటనే తనని కార్లో వేసుకుని వెళ్ళటం అసంభవం! తెల్లారి ఆరుగంటలయ్యేసరికి తను విజయవాడలో ఆ గదిలో నిద్రలేవటం సహజంగా అనిపించటంలేదు. తనని స్పృహ తప్పించి తీసుకువచ్చినా అంత తక్కువ వ్యవధిలో తనని ఊరు మార్చి, మరో ఇంట్లో అలాంటి గదిలో పడుకోబెట్టడం సాధ్యం కాదు. బహుశా అది విజయవాడ అయుండదు. హైదరాబాద్, లేదా దగ్గరలో మరో ఊరో అయివుండొచ్చు!

సుస్మిత తీవ్రంగా ఆలోచిస్తోంది. ఎలాగైనా బయట పడి పారిపోవాలి! ఇది యే ఊరయినా సరే, ముందిక్కడనుంచి బయటపడాలి. అది రాత్రి సమయమని గాని, బయటికి వెళ్ళాక తను యింటికెలా చేరగలుగు తానని గాని ఆమె యేమాత్రం ఆలోచించటంలేదు. మామయ్య అనబడే యీ మృగం బారినుండి, యీ బందీఖానానుండి బయటపడాలి, అంతే!

రాత్రి యేడుగంట లయింది. పనిమనిషి కాబోలు నవ్వుతూ వచ్చి నిలబడింది. "అమ్మా, భోంచెయ్యవా?" అని మెల్లగా అడిగింది.

సుస్మిత దానివంక చూసి చిన్నగా నవ్వింది.

"ఇలా దగ్గరగారా!" అన్నది. అది భయపడుతూనే దగ్గరకొచ్చింది. సుస్మిత మెరుపుదాడి చేసింది. ఆమెనిపట్టి ఒక్క తోపు తోసింది. ఆ వూపుకి దాని తలపోయి గోడకి కొట్టుకుంది. స్పృహతప్పి కిందపడిపోయింది పని మనిషి.

ఒక్క క్షణం ఆమెవంక చూసి, తలుపు తెరుచుకుని బయటికొచ్చింది. వరండాలో ఎవరూ లేరు—అది పెద్ద

హాలులావుంది. హాలుపక్కనూ అటువంటి గదులున్నాయి. వంటగదిలోనుండి కాబోలు పోపువాసనలు వస్తున్నాయి.

సుస్మిత అడుగులో అడుగు వేసుకుంటూ హాలుదాటింది. గదుల్లో ఎవరున్నారో తెలీదు. తలుపులు మూసివున్నాయి. ఇందాకటి పనిమనుషుల్లో ఒకామె, ఓమగాడు ఓపక్కగా కూచుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

బయటికి పోవాలంటే వాళ్ళిద్దర్నీ దాటిపోవాలి. ఆ యిల్లు యిదివరకెప్పుడూ ఆమె చూసి వుండలేదు. మామయ్య యింటికి యిదివరలో రెండుమూడుసార్లు వచ్చింది తల్లితో. ఇది ఖచ్చితంగా ఆ ఇల్లు కాదు. మరి ఎక్కడి యిల్లు? ఇదే వూరు?

సుస్మిత అవకాశంకోసం అలాగే వరండాలోని క్రీనీడలో చూసింది కాసేపు. పనిమనిషి మొగాడు వంటగదిలోకి కాబోలు జంటగా వెళ్ళిపోయారు. సుస్మిత రెప్పపాటులో వరండానుంచి హాలుగుండా, బయిటికి పోయే ద్వారంవైపు దూసుకుపోయింది.

ఆమె అనుమానించినట్టే అయింది. బయట అల్సేషియన్ కుక్క గొలుసుకి కట్టివుంది. సుస్మితను చూడగానే భోయ్‌మంటూ మీదికి ఉరకబోయింది. అదృష్టవశాత్తు దాన్ని గొలుసుతో వీధివైపు కటకటాలకు కట్టేసి వుంచారు గాబట్టి సరిపోయిందిగాని, లేకుంటే సుస్మితని ఖండఖండాలుగా చీల్చేసి వుండేది!

సుస్మిత దిగజారబోయిన గుండెను జాగ్రత్తగా అదిమి పట్టుకుంది. కుక్క అరుపుకి లోపల కలకలం వినిపించింది. అంటే యిందాకటి పనివాళ్ళు మామయ్య వగైరా బయటకి వస్తూండవచ్చు!

సుస్మిత గేటువైపు నాలుగంగల్లో చేరుకుంది. గేటు

తాళం వేసివుంది లోపలివైపు. తనకి అడుగడుగునా పరీక్ష ఎదురవుతున్నా ఆమె వెనుదియ్యలేదు. గేటు మూడు అడుగులకన్నా ఎత్తులేదు. గేటుకి అడ్డుగా వున్న యినుపరాడ్ మీద కాలేసి ఎక్కింది. అవతలివైపు దూకేసింది. గట్టి నేల తగిలింది.

ఈలోపల వెనకనించి పనివాళ్ళు యింకా ఎవరో వచ్చి గేటు దగ్గరకు చేరారు. తలుపుకున్న తాళం తెరుస్తున్నట్టున్నారు. సుస్మిత అటు యిటు చూసి, ఆ బిల్డింగు పక్కనున్న సందులోకి పరుగెత్తింది.

సుస్మిత సందులో చాలా వేగంగా నడుస్తూ వెనక్కి చూసింది. అంతే ఆమె గుండె జల్లుమంది. పనివాళ్ళు వెనకనించి పరుగెత్తుకుని వస్తున్నారు.

ఇక ఎంతోసేపు అలా పరుగెత్తలేనని ఆమె గ్రహించింది. ఏ క్షణంలోనైనా వాళ్ళు తనని పట్టుకోవచ్చు. అప్పుడు తన బతుకింకా దుర్భరమవుతుంది. మళ్ళీ ఆ బందిఖానా తల్చుకోవటానికే ఒళ్ళు గగుర్పొడుస్తోంది.

సుస్మిత పక్కలకు చూసింది. ఇంకా బాగా రాత్రి పొద్దుపోకపోవటంతో యిళ్ళలో దీపాలు వెలుగుతునే వున్నాయి. జనం యింకా నిద్రలు పోలేదనటానికి ఇళ్ళలోని మాటల సవ్వడి, సంకీర్త ధ్వనులే నిదర్శనం!

సుస్మిత ఓ ఇంటి తలుపులు తెరిచివుండటం చూసింది. అంతే ఆలస్యం చెయ్యకుండా చటుక్కున గుమ్మం ఎక్కి ఆ యింట్లోకి ప్రవేశించింది. లోపలికి చొరబడి తలుపులు మూసేసింది. కొద్ది క్షణాలు ఆ తలుపులకే చేరబడి నిల్చుండిపోయింది.

వీధిలో వాళ్ళు పరుగెడుతూ పోయిన సవ్వడి వినిపించింది. ఆ యింటిముందునించీ వాళ్ళు పరుగెత్తటం, ఏదో

మాట్లాడుకుంటూ వెళ్ళటం ఆమెకు వినిపించింది.

ఫరవాలేదు, తనీ యింట్లోకి రావటం వాళ్ళు చూడలేదు. ముందుకే పరుగెత్తి వెళ్ళిపోయారు. గుండెలమీద చెయ్యి వేసుకుని కాసేపు అలుపు తీర్చుకోవటానికి అలాగే నిల్చుండిపోయింది సుస్మిత!

## 4

"ఎవరు వారు? ఏం కావాలి?" అన్న బొంగురు గొంతు వినిపించింది.

సుస్మిత ఉలిక్కిపడింది. ఏమని సమాధానం చెప్పాలి? కాసేపు ఏమీ పాలుపోలేదు.

ఇంతలో ఆ బొంగురు గొంతు తాలూకు మనిషి వీధి గుమ్మం దగ్గరకొచ్చి సుస్మితను చూసింది.

దగ్గరగా, మరింత దగ్గరగా సుస్మితకి ఎదురుగా నిల్చుని, "ఎవరమ్మా నువ్వు. ఏం కావాలి?" అన్నదామె ఎంతో ఆదరంగా. ఆమెకు దాదాపు ఏభై ఏళ్ళుంటాయి.

ఆమె అలా అడుగుతుంటే సుస్మితకి కంటనీరు తిరిగింది.

"నేను.... నేను...నా పేరు సుస్మిత" అన్నది. అంతకు మించి వివరాలు ఆమె నోట రాలేదు.

ముసలామె ఆమె బాగా భయపడిపోయినట్టు గ్రహించింది. సుస్మిత వెన్ను నిమిరింది. బుగ్గలమీదికి రాబోతున్న కన్నీటిని మధ్యలోనే తుడిచేసింది సుస్మిత.

"రామ్మా, లోపలికిరా! ఇప్పుడేం చెప్పొద్దులే, తర్వాత తీరిగ్గా చెబుదువుగాని" అంటూ సుస్మితని రెక్కపట్టుకుని లోపలికి తీసుకుపోయింది ముసలామె.

ఆమె వెంట మంత్రముగ్ధలా నడిచి లోపలికి వెళ్ళింది సుస్మిత.

లోపల గదులు చాలా అందంగా వున్నాయి. ఖరీదైన పెయింట్‌తో తళతళలాడుతున్న గోడలు, గోడలకి తైలవర్ణ చిత్రాలు. గదులనిండా ఖరీదైన సోఫాసెట్లు, రోజ్‌వుడ్ కుర్చీలు, డెకోలం ఫోల్డింగ్ టేబిల్సు—ఆ యింటి వైభవాన్ని చెప్పకనే చెప్తున్నాయి.

"అలా కూచోమ్మా!" అన్నది ముసలామె ఓ కుర్చీ చూపించి తను మరో కుర్చీలో కూచుంటూ.

సుస్మిత సంకోచిస్తూనే కూచుంది. ఇంట్లో చూడబోతే ఆ ముసలామె ఒక్కతే వున్నట్టనిపిస్తోంది. అంతవరకు ఎవరూ బయటికి రావటం ఆమె చూడలేదు.

ముసలామె చటుక్కున అడిగింది. "నీ ముఖం చూస్తుంటే ఏమీ తిన్నట్టు అనిపించటంలేదు, అవునా?"

సుస్మితకి ఆకలి ఒక్కసారిగా విజృంభించింది. అయినా పరాయిచోట ముక్కూ మొహం తెలీని మనిషి ముందు తన బలహీనతని బయటపెట్టుకోవటానికి ఆమెకు మనస్కరించలేదు. అభిమానం అడ్డొచ్చింది.

"అహఁ, తిన్నాను...." అన్నది పొడిపొడిగా.

ముసలామె చిన్నగా నవ్వింది. "చూడమ్మా, నా దగ్గర మొహమాట పడి కడుపు మాడ్చుకోకు. ముందు కాస్త అన్నం తిందువుగాని రా!" అంటూ సుస్మిత చెయ్యి పట్టుకుని బలవంతాన వంటగదిలోకి తీసుకుపోయింది.

ముసలామె కంచంలో అన్నం, కూరలు వడ్డించింది. అంతవరకు నిద్రాణమై వున్న ఆకలి మరింతగా అవులించుకుంటూ తన్నుకొచ్చింది.

సుస్మిత అవురావురుమంటూ తిన్నది. ఎవరో పరాయి మనిషనిగాని, పరాయి యింట తింటున్నాననిగాని, ఆమె సంకోచించలేదు. ఉదయంనించీ ఏమీ తినకపోవటం,

పరుగెత్తటంతో వచ్చిన నీరసం, టెన్షన్ ఆమెని బాగా లొంగదీసుకున్నాయి. నిస్త్రాణ వచ్చేసింది.

ఆకలి బాధ మహా చెడ్డది! ఆ ముసలామె వడ్డిస్తుంటే సుస్మిత తింటోంది. అలా ఎంత తిన్నదో, ఎంత సేపు తిన్నదో ఆమెకే తెలీదు.

ముసలామె ఆప్యాయంగా కొసరి వడ్డించింది. గడ్డ పెరుగుపోసి ఆవకాయముక్క పెట్టింది. సుస్మిత సంతృప్తి కరంగా భోజనం ముగించి లేచింది.

ముసలామె సుస్మితని తీసుకుని హాల్లోకి వచ్చింది. ఇద్దరు మళ్ళీ కూచున్నాక ముసలామె అడిగింది. "ఎవ రమ్మా, నువ్వు? నేను చూసేసరికి బాగా అలసిపోయి ఉన్నావు. ఆయాసపడుతున్నావు. ఏమిటి కారణం? నిన్నెవరైనా తరుముకుంటూ వచ్చారా?" అనడిగింది.

సుస్మిత ఆమెతో నిజం చెప్పటానికి సంకోచించింది. అయినా అబద్ధం చెప్పటం ఎలాగో ఆమెకి తెలీదు. అందుకే ఉన్నదున్నట్టు చెప్పేసింది.

మామయ్య తనని తీసుకొచ్చి బంధించటం, తనని బావకిచ్చి పెళ్ళిచేస్తాననటం, తను భయపడి తప్పించుకు పారిపోవటం—వరుసగా అన్నీ చెప్పేసింది.

ముసలామె చాలా సానుభూతితో విన్నది. "అయ్యో నా తల్లీ, నీకింత లేతవయసులో ఎంత కష్టం వచ్చిం దమ్మా. మీ మామయ్య ఎంత నిర్దయుడు! నీకిష్టంలేకుండా నీచేత కానిపని చెయ్యించాలని చూస్తాడా? పైగా మేన కోడలివని కూడా చూడకుండా ఎత్తుకొస్తాడా? ఎంత మాట!" అన్నది దవడలు నొక్కుకుని.

సుస్మిత మనసు ఆమెపట్ల క్షణక్షణానికీ కృతజ్ఞత తోను, గౌరవంతోను నిండిపోతోంది.

"నీకొచ్చిన కష్టం చూసి నా గుండె తరుక్కుపో తోందమ్మా! నిన్ను క్షేమంగా మీ యింటికి పంపించే ఏర్పాటు నేచేస్తానుగాని, నువ్వు యీ రాత్రికి హాయిగా యిక్కడే నిద్రపో! అప్పుడు రాత్రి పదకొండుగంటలు కావస్తోంది" అన్నదామె.

"అమ్మ ఎలావుందో, నే నేమైపోయాననుకుంటుందో! నామీద బెంగపెట్టుకుని ఉంటుంది."

"మరేం ఫరవాలేదమ్మా! ఉదయం ఏడుగంటలకి బయల్దేరితే పన్నెండుగంటలకంతా మీ ఇంట్లో వుంటావు" అన్నదామె.

సుస్మితకి చటుక్కున గుర్తొచ్చింది. "ఇదేవూరు?" అనడిగింది.

"విజయవాడ!"

"అరె, హైదరాబాదునించి ఒక్క రాత్రిలో విజయవాడ ఎలారాగలిగాను?" అన్నది సుస్మిత అమాయకంగా.

ముసలామె సుస్మిత ఆ మాటలు పలికిన తీరుకి బాగా ముచ్చటపడిపోయింది. "ఎందుకు రాలేవు?" చిన్నకారులో ఐతే ఐదుగంటల ప్రయాణంలోవే! అంతకన్న తక్కువ సమయంలో కూడా ప్రయాణం చెయ్యొచ్చు" అన్నది.

అయితే రాత్రి పదకొండు గంటలకి తను నిద్రపోయిన వెంటనే యేదో మత్తుమందిచ్చి స్పృహతప్పించి తనని హైదరాబాదునించి మామయ్య యిక్కడికి తీసుకొచ్చాడన్నమాట తన యింటికి! అంటే మామయ్య యింట్లో దాదాపు ఓ గంట నిద్రపోయాక తనకు మత్తు వదిలి ఉంటుంది.

అనుచరులమధ్య ఎప్పుడో నిద్రపట్టేసింది. అలా యిలా కాదు. ఒళ్ళు తెలీకుండా పట్టేసింది—గాఢనిద్ర!

## 5

ఉదయం ముసలామె నిద్రలేపేవరకు మెలకువరాలేదు సుస్మితకు. తన మొద్దునిద్రకు తనలోతనే సిగ్గుపడుతూ లేచింది సుస్మిత.

ముసలామె బాత్రూం చూపించింది. ఓ గంటలో స్నానాదికాలు ముగించుకొచ్చేసరికి సరికొత్త చీర, బ్లౌజు తనకోసం ముసలామె సిద్ధంగా పెట్టి వుంచింది.

"నేనెప్పుడూ చీరకట్టుకోలేదండి!" అన్నది సిగ్గుపడుతూ సుస్మిత.

"మరి మా యింట్లో నీకు సరిపడే పావడాలు కండువాలు లేవమ్మా! ఇది నా కూతురు చీర, రవిక, సరిపోతాయి, కట్టుకో" అన్నది ముసలామె.

సుస్మిత అవసపడి చీర కట్టుకోవటం అప్పటికప్పుడే నేర్చుకుని కట్టుకుంది. రవిక సరిగా తనకి కొలతతీసుకున్నట్టు సరిపోయింది. అద్దంలో తనని చూసుకుని తనే ఆశ్చర్యపోయింది. తనెంతో ఎదిగిపోయినట్టు పెద్దరికం వచ్చేసినట్టు అనుభూతి!

వేడి వేడి టిఫిన్, ఓవల్టిన్ తెచ్చిపెట్టింది వంటమనిషి. సుస్మిత ముసలామె కూచుని తిన్నారు.

ముసలామె చాలా ఆత్మీయంగా మాట్లాడుతోంది.

"నిన్ను మీ యింటికి పంపిస్తున్నాను. జాగ్రత్తగా మా డ్రైవరు తీసుకువెళ్ళి మీ యింట దించివస్తాడు సరేనా?" అన్నది నవ్వుతూ.

సుస్మిత బుద్ధిమంతురాలిలా తలూపింది.

"ఖాసిం!" అని పిలిచింది ముసలామె.

పహిల్వాన్‌లా వున్న ఓ భారీమనిషి లోనికొచ్చాడు.

"ఇదిగో అమ్మాయి. జాగ్రత్త. ఏమీ తేడాపాడాలు

రాకూడదు" అన్నది హెచ్చరికగా.

"అలాగేనమ్మా! నేజూసుకుంటాగా" అన్నాడు ఖాసిం.

సుస్మిత చేతులు రెండూ జోడించి ముసలామెకు దండం పెట్టింది. ముసలామె ఆమెను దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకుంది.

ఖాసిం కారుతీసి సిద్ధంగా వుంచాడు. ముసలామె కారువరకు వచ్చి వీడ్కోలు చెప్పింది.

"మీరు కూడా రాకూడదమ్మా! ఈ సంగతి చెపితే మా అమ్మ మిమ్మల్ని నెత్తిన పెట్టుకుంటుంది" అన్నది సుస్మిత.

"మా దైవరు మీ యిల్లు చూస్తాడుగా యీ రోజు! తర్వాత తీరిక చేసుకుని నా మనమరాల్ని చూడటాని కొస్తాను" అన్నది ముసలామె నిండుగా నవ్వుతూ.

ఖాసిం కారు స్టార్టుచేశాడు.

కారు విజయవాడ సిటీ లిమిట్సు దాటింది. చల్లటి గాలి రివ్వున కిటికీల్లోంచి లోపలికి వస్తుంటే హాయిగా కోలపాడినట్టుంది. సుస్మిత మనసు తేలిగ్గా వుంది. దూది పింజెలా తేలిపోతోంది.

ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు. కారు చిన్న జర్కుతో ఆగగానే చటుక్కున మెలకువవచ్చింది. కళ్ళు తెరిచింది.

కారు ఓ గల్లీలో ఆగివుంది. ఖాసిం కారు దిగు తున్నాడు.

సుస్మిత కిటికీలోంచి బయిటికి చూసింది.

హైదరాబాదు అప్పుడే వచ్చేసిందా? చేతికున్న వాచీ లోని ముళ్ళు పదకొండు అయినట్టు చూపిస్తున్నాయి.

తను విజయవాడలో బయిల్దేరినపుడు ఉదయం ఎనిమిది కావచ్చింది. అంటే మూడుగంటల ప్రయాణం జరిగింది.

హైదరాబాదు యింకా చేరలేదు. అది సూర్యాపేటో మరోవూరో కావచ్చుననుకుంది.

ఖాసిం ఆ వీధిలోని ఓ యింట్లోకి వెళ్ళి బయటకు వచ్చాడు. సుస్మితకు ఆ వీధి చాలా అసహ్యంగా, గలీజుగా వున్నట్టు అనిపించింది.

ఓ పెన్ డ్రయినేజ్ ముక్కుపుటల్ని అదరగొడుతోంది. ఇళ్ళు చూడ్డానికి బాగానే కనిపిస్తున్నాయిగాని, మనుషులు ఎవరూ ఎక్కువగా మసలటంలేదు. ఏదో నిశ్శబ్ద వాతావరణంలో మరమనుషుల్లా యాంత్రికంగా కదులుతున్నారు అటు యిటు.

ఆడవాళ్ళు గుమ్మాల్లో నించుని వున్నారు. అందరూ నిద్రమత్తులోనో జోగుతున్నట్టు కనిపిస్తున్నారే గాని చురుగ్గా, ఉత్సాహంగా కనిపించటంలేదు.

ఖాసిం తలుపు తెరిచాడు. "దిగమ్మా!" అన్నాడు.

సుస్మిత నివ్వెరపోయి, "ఎక్కడికి?" హైదరాబాదు యింకా రాలేదుకదా! అన్నది.

"ఇది హైదరాబాదేనమ్మా! ఓల్డు సిటీ యిలాగే ఉంటుంది, నువ్వెప్పుడూ రాలేదనుకుంటాను! అది మా యిల్లు, ఓ అయిదు నిమిషాలు "చాయ్ తాగి వెళ్ళి పోదువుగాని రామ్మా!" అన్నాడు ఖాసిం ఎంతో నమ్రతగా, ఆప్యాయంగా.

"అరె మూడు గంటల్లో విజయవాడనించి హైద్రాబాద్ తోలుకొచ్చేశావే! రియల్లీ వండర్ ఫుల్!" అన్నది సుస్మిత చిన్నపిల్లలా కేరింతలు కొడుతూ.

"ఈ ఖాసిం చేతిలో స్టీరింగ్ పడితే బండి గాల్లో ప్రయాణం చేస్తుంది. రామ్మా!" అన్నాడు ఖాసిం.

సుస్మిత కారు దిగింది. గల్లీలోని యిళ్ళలోనించి

ఆడవాళ్ళు వీళ్ళవంకే ఆసక్తిగా చూస్తున్నారు. సుస్మితకి ఒంటిమీద తేళ్ళు జెర్రిలు పాకుతున్నట్టనిపిస్తోంది. వాళ్ళ చూపులెన్నెదుర్కోలేక-మౌనంగా ఖాసింని అనుసరించింది. ఖాసిం సుస్మితని ఓ యింట్లోకి తీసుకు వెళ్ళాడు.

అది బాగా యిరుగ్గా వుంది. లోపల ఎవరూ కనిపించ లేదు. ఖాసిం ఆమెని అక్కడే వున్న కుర్చీలో కూచోబెట్టి లోపలి గదిలోకి వెళ్ళాడు.

సుస్మిత ఆ యింటి వాతావరణం చూసి ముఖం చిట్లించింది. గోడలన్నీ వెల్ల వెలిసిపోయి అసహ్యంగా ఉన్నాయి. తాంబూలం ఉమ్ములతోను, ఏదో దుర్గంధం తోను చవుడు రాలిపోతున్నట్టున్నాయి. మీద కూలిపడి పోతుందన్నట్టుంది! యెక్కడపడితే అక్కడ విప్పిన గుడ్డలు, చిరాకుగా పడున్నాయి.

ఖాసిం యెవరో ముసలామెతో బయటికొచ్చాడు. చూడటానికి మొగాడిలా వున్న ఆ ముసలామె గొంతు కూడా అందుకు తగ్గట్టే బొంగురుగా కర్కశంగా వుంది.

"ఈ పిల్లేనా?" అన్నది నఖశిఖపర్యంతం సుస్మితని శల్య పరీక్ష చేస్తూ. ఖాసిం తలూపాడు.

సుస్మిత అర్థంకానట్టు చూసిందతనివంక. ఖాసిం తల వంచుకుని వెళ్ళిపోతున్నాడు. ఆమెకెందుకో భయంవేసి నట్టనిపించింది. "ఖాసిం!" అంటూ పిలుస్తూ చటుక్కున లేచి ముందుకు అడుగు వెయ్యబోయింది.

"అగక్కడే!" అన్నది ముసలామె.

సుస్మిత అనుమానం బలపడింది. చటుక్కున తలుపు దగ్గరికి నాలుగడుగుల్లో చేరుకుంది. వెనకనుంచి యిద్దరు ఆడవాళ్లు అకస్మాత్తుగా చెరో రెక్క పట్టుకుని ఆమెని పట్టి ఆపేశారు.

# 6

సుస్మితని బలవంతాన లాక్కొచ్చి గదిలో పడేశారు ఆ యిద్దరు ఆడవాళ్లు. బొంగురుగొంతు ముసలామె కర్కశమైన చూపుల్తో సుస్మితని కాల్చేస్తున్నట్టు చూసింది.

"ఎవరు మీరంతా? ఏమిటీ మోసం?" కోపంతోను, ఉక్రోషంతోను చిగురుటాకులా వణికిపోయింది సుస్మిత.

"మోసమేమిటే, నిన్ను పబ్లిగ్గా కొనుక్కున్నాను". అన్నది ముసలామె.

"నన్ను కొనుక్కున్నావా? నేనేమైనా సంతలో పశువు ననుకున్నావా, వస్తువు ననుకున్నావా కొనుక్కోవటానికి? మర్యాదగా విడిచిపెట్టు. లేకపోతే పోలీసులకి రిపోర్టిస్తాను" అన్నది సుస్మిత.

ముసలిదానితోబాటు ఆ యిద్దరు ఆడవాళ్ళు కూడా ఫక్కున నవ్వారు.

"పోలీసులకి రిపోర్టిస్తుందంటే వక్రది! ఆళ్ళేంజేత్తారు? మళ్ళీ మనకే అప్పజెప్పేత్తారుగదా! మన సంగతి ఆళ్ళకి తెల్సు, ఆళ్ళ సంగతి మనకి తెల్సు!....ఇదిగో చూడు పిల్లా, అట్టే నీలిగావంటే వొళ్ళు పచ్చడయిపోగల్దు. జాగర్త....ఒసేవ్, వెంకీ, దీన్ని జాగ్రత్తగా చూసుకో! దీన్ని దార్లో బెట్టే డూటీ నీదే! తేడావొస్తే నేనూర్కోను, తెల్సుగా!" అన్నది ముసల్ది.

వెంకి అని పిలవబడ్డ వెంకటమ్మ తలూపింది. ఇందాకటి యిద్దరు ఆడవాళ్ళలో ఆమె ఒకర్తి.

"లోపలికి పద!" అన్నది వెంకటమ్మ సుస్మిత జబ్బ పట్టుకుని లాక్కుని వెళ్తూ. రెండో మనిషి సుస్మితని వెనక నుంచి తోసుకుంటూ వెళ్ళింది. ఆ యిద్దర్నీ విసురుగా కసిరికొట్టింది సుస్మిత. గింజుకుంది. చివరికి వెంకటమ్మ

చెయ్యిని కొరికింది. అయినా ఆమె సహించి, అలా లోపలికి లాక్కుపోతూనే వుంది.

"కదలకుండా పడుకో! ఏమాత్రం గొడవ చేసినా ముసల్ది నీ పీక పిసికేస్తది, తర్వాత ఏమనుకున్నా లాభ ముండదు పిల్లా!" అన్నది రెండో ఆమె.

వెంకటమ్మ చేతికి కట్టు కట్టుకుంటోంది. సుస్మిత రక్తం వచ్చేలా కొరికిందామె చేతిని.

అప్పుడు సమయం రెండుగంటలు దాటింది మధ్యాహ్నం.

"ఇదిగో, ఆ పిల్లకి యీ కూడెట్టు, యెప్పుడో బెజ వాడలో కంత టిపిని తినుంటుంది! ఆకలెయ్యటంలేదు లాగుంది" అన్నది ముసల్ది లోపలినుంచి.

వెంకటమ్మ రెండంగల్లో వెళ్ళి ఆమెనుంచి అన్నం కంచం తెచ్చి టేబిలుమీద పెట్టింది. ఉన్నంతలో ఆ యింటికంతకీ కాస్త శుభ్రంగా ఉన్నది ఆ గదే!

సుస్మిత కూచోవటానిక్కూడా యిష్టపడటంలేదు. ఆ ఇంటి వాతావరణం కడుపులో తిప్పినట్టవుతోంది. బయట పడే మార్గం గురించి తీవ్రంగా ఆలోచిస్తోంది. ఓ ప్రమాదంనుంచి మరో ప్రమాదంలో చిక్కుకున్నట్టుంది.

"ఇదిగో, పిల్లా! కాస్సంత అన్నం తిను! ఆకలేస్త లేదూ!?" అన్నది వెంకటమ్మ దగ్గరగా వచ్చి. ఆమెకి ఓ పక్క సుస్మిత అంటే భయంగానే వుంది—మీదపడి కరుస్తుందేమోనని!

"నాకేం వద్దు. మీ రిద్దరు నా ముందునుంచి బయిటికి పోండి!" అన్నది కోపంగా సుస్మిత. ఉక్రోషంతోను, అవమానంతోను, చేతకానితనంతోను ఆమెకి దుఃఖం తన్నుకుని వస్తోంది. ఓ పక్క ఆకలి కరకరమంటోంది. ఉదయం విజయవాడలో తిన్న టిఫినే! మళ్ళీ ఏం తిన

లేదు. అయినా ఆమె అభిమానం చంపుకుని తినటానికి సిద్ధం గాలేదు. ఎదురుగా అన్నంవున్నా దానివంకనైనా కన్నెత్తి చూడటంలేదు.

వెంకటమ్మ ధైర్యంచేసి సుస్మిత చెయ్యిపట్టుకుని, "తిను! ఆకలికి వుండగలవా?" అన్నది జాలిగా.

రెండోమనిషి ఎప్పుడో బయటకి వెళ్ళింది, ముసలామె పిలవటంతో. గదిలో సుస్మిత, వెంకటమ్మ ఉన్నారు. సుస్మిత చటుక్కున చేతులు రెండూ జోడించి, "నన్ను వదిలిపెట్టెయ్యి నీకు దణ్ణం పెడతాను" అన్నది జాలిగా.

వెంకటమ్మకి ఆ పిల్ల ఎటువంటి కుటుంబంనించి వచ్చినదో, ఎలాంటిదో అరమైపోయింది. ఆమెమీద జాలి వేసింది.

"ఇక్కడకు తీసుకొస్తున్నట్టు నీకు తెలీదా?" అన్నది.

"ఉహుఁ! మా ఇంటికి తీసుకెళ్తున్నానని ఖాసిం చెప్పాడు. నిజమేననుకున్నాను."

"మీ ఇంటికా? అసలు మీదే వూరు?"

"హైదరాబాదు."

"మరి బెజవాడ ఎందుకు వెళ్ళావు? ఖాసింకి ఎలా దొరికావు?"

"నేను దొరకడమేమిటి? బెజవాడలో మా మామయ్య ఇంటనుంచి తప్పించుకుని పారిపోతూ అమ్మమ్మ లేదూ, ఆమె ఇంట్లోకి వెళ్ళాను. ఆమె చాలా మంచిగా మాట్లాడింది. అన్నం పెట్టింది. రాత్రి అక్కడే పడుకున్నాను. పొద్దున్న ఖాసింతో నన్ను కారులో హైదరాబాదు పంపుతున్నానని చెప్పింది. చూడబోతే ఖాసిం ఇక్కడికి తీసుకొచ్చాడు."

"నిన్ను మా ముసలమ్మకి — మేమంతా 'అమ్మా' అని పిలుస్తాంలే—అమ్మేశాడు."

[illegible] చూసింది. "మళ్ళీ అదేమాటా? నన్ను అమ్మడమేమిటి?" అన్నది.

వెంకటమ్మ జాలిగా చూసింది సుస్మిత వంక.

"చూడమ్మా, నీ పేరేమిటి?" అన్నది.

"సుస్మిత."

"పాపం, ఇలాంటి యిళ్ళుంటాయనిగాని, యిలాంటి మనిసి రూపంలో వున్న జెంతువులుంటాయనిగాని నీకు తెల్వదుకదా! ఇదో నరకమన్నమాట! ఇందులో కాలెట్టినోళ్ళకి ఇక బయట పెపంచం తెల్దు. అసలు ఆళ్ళ గురించే ఆళ్ళకి ఆలోచించుకోవటానికి టయిముండదు. చూడమ్మా, నిన్ను బయిటికి పంపించటానికి నాకేమీ అధికారంలేదు. ముసల్ది చూస్తే నన్ను, నిన్ను కూడా ఉప్పు పాతరేసేస్తది" అన్నది వెంకటమ్మ.

సుస్మిత జాలిగా చూసింది. "ఇదే ఊరు?" అన్నది.

"ఒంగోలు."

"విజయవాడ నించి హైదరాబాదు తీసుకెళ్తానని ఇలా ఒంగోలు తీసుకొచ్చేశాడన్నమాట ఖాసిం. వాడికి నేనేం అపకారం చేశాను?" దుఃఖం తన్నుకొచ్చేస్తుంది సుస్మితకి. ఇక ఆపుకోలేక భోరున ఏడ్చేసింది.

"ఏయ్ పిల్లా ఏటా యేడుపులు? ఏమే వెంకీ దాన్ని నయానో బయానో లొంగదియ్యి. రాత్రికి కోటపాడు మునసబుగారొస్తానని కబురెట్టారు. యెన్నాల్టినుంచో ఇలాంటి కేసొస్తే చెప్పమని పాణాలు తోడేస్తన్నాడు. ఇన్నాల్టికి దొరికింది" అంటూ అరుస్తోంది ముసలిది.

ముసలామె మాటలు కొంత అర్థమయ్యి, కొంత కాక ఏడుపుమాని ఆలోచనలో పడింది సుస్మిత. ఎలాగైనా సాయంత్రంలోపల ఇక్కడనుంచి బయటపడాలి! ఎలా?

“గొడవ చెయ్యకుండా కాసేపలా [illegible] త్ర పడుకో! మనసు నెమ్మదిస్తది!” అన్నది వెంకటమ్మ లాలనగా. సుస్మిత నిల్చున్న చోటినుంచి కదల్లేదు.

“ఎంత సేపలా నించుంటావమ్మా, అలా కూచో. పడుకోకపోతే పోనీ, కాస్త అన్నం తిను!”

“ఉహుఁ! నేను తినను. ఆకల్తో చావనైనా ఛస్తాను గాని, యీ పాడు తిండి తినను!”

వెంకటమ్మ ఎంత బతిమాలినా సుస్మిత వినక పోవటంతో విసిగిపోయి బయటికి వెళ్ళిపోయింది.

సాయంత్రం అయిదు గంటలు కావస్తోంది అప్పటికి.

సుస్మిత తప్పించుకునే మార్గం కోసం తీవ్రంగా అన్వేషిస్తోంది. గుమ్మానికి అడ్డుగా ముసల్ది కుర్చీ వేసుకుని కూర్చుని ఉంది. సుస్మిత వచ్చినప్పట్నుంచీ ఆమె అక్కడే కాపలా కాస్తోంది.

చీకటి పడిపోయింది. సుస్మిత గుండెల్లో గుబులు ప్రారంభమయింది. పగలంతా ఏమీ తినకపోవటంతో బాగా నిస్త్రాణగా వుంది. కళ్ళు తిరుగుతున్నాయి.

ముసలిది లోపలికి తొంగిచూసి, “ఇంకా అలాగే ఉన్నావేం? స్నానం చేసి, గుడ్డలు మార్చుకో! ఏమే వెంకీ, దీన్నింకా తయారుజెయ్యలేదేం? ఎక్కడ సచ్చావు?” అని అరిచింది. సుస్మిత ఉలిక్కిపడింది.

ఎనిమిది గంటలయింది.

“అలాగేనమ్మా! యిప్పుడే స్నానం చేయిస్తాను” అన్నది వెంకటమ్మ. “పద పద స్నానం చేద్దువుగాని!” అంటూ రెక్కపట్టుకుని సుస్మితని లాక్కునిపోయింది.

పెరట్లో నుయ్యి వుంది. దానికి చేర్చి తలుపులేని స్నానాల గది వుంది. అక్కడ చుట్టూ పిచ్చిమొక్కలు

పెరిగిపోయి నానా భీభత్సంగా ఉంది.

వెంకటమ్మ లోపలికి తొంగి చూసింది. ముసల్ది, రెండో ఆడమనిషి బయట వీధి వరండాలో ఏదో కబుర్లు చెప్పుకుంటున్నారు.

"అమ్మా, వెంటనే ఇక్కడినుంచి పారిపో! ఇదిగో పెరటి తలుపు తీసిపెడతాను. ఏదో పనున్నట్టు నేను కూడా వీధి వరండాలోకి వెళ్తాను — ముసల్దానికి అనుమానం రాకుండా ఈలోపల పారిపో! ఇదిగో యీ పది రూపాయలుతప్ప నా దగ్గరేంలేవు, ఎందుకైనా పనికొస్తాయి తీసుకో!" తొందరచేసింది వెంకటమ్మ.

నీళ్ళు నిండిన కళ్ళతో రెండు చేతులు జోడించి, "నీ మేలు ఈ జన్మలో మరిచిపోలేను!....కాని, ఆ ముసలామె నిన్నేమైనా చేస్తుందేమో...." అన్నది సుస్మిత.

"నన్ను నరికేసినా సరే, ఆనందంగా భరిస్తాను. నీలాగే నేనూ బలవంతంగా తీసుకురాబడ్డాను. ఇప్పుడు అలవాటు పడిపోయాను. నీ జీవితం నాశనంకావటం నేను చూడలేను. వెళ్ళిపో, వెంటనే పరుగెత్తు" అంటూ వెంకటమ్మ వీధి వరండాలోకి వెళ్ళిపోయింది.

సుస్మిత ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా పెరటి తలుపు తీసుకుని బయిటికి ఉరికింది. బయట ఏముందో తెలీదు, చీకటి! అదికూడా ఓ వీధిలాగానే వుంది! తాను ఉదయం చూసిన వీధిలాంటిదే! చాలామంది ఆడవాళ్ళు బయటనించుని ఉన్నారు. మగవాళ్ళు ఎవరెవరో వస్తున్నారు, పోతున్నారు.

దారిన పోయే రిక్షాని పిలిచింది. ఎక్కి "పోనియ్యి" అన్నది. రిక్షావాడు ఎక్కడికి, యేమిటని అడగలేదు. వేగంగా తొక్కుకుంటూ ఆ వీధి దాటించేశాడు.

# 7

రిక్షా ముందుకి సాగిపోతోంది.

"రైల్వేస్టేషన్‌కి పోనివ్వు" అన్నది రిక్షావాడితో.

వాడు ఏం మాట్లాడలేదు. రిక్షా పోతూనే వుంది. వీధిలైట్లు అంతమయిపోయాయి. రిక్షా ఏదో నాటుదారి పట్టింది. సుస్మిత పరిసరాలు చూసి ఉలిక్కిపడింది.

"ఏయ్, రిక్షా, అబ్బాయ్, ఎక్కడికిపోతున్నావు? నేను చెప్పింది రైల్వేస్టేషన్‌కి!"

"నేను తీసుకుపోతున్నది కూడా అడికే!" అన్నాడు రిక్షావాడు. నాటుసారా వాసన గుప్పుమన్నది.

సుస్మితకి ఏదో అనుమానం వచ్చింది. ఆమెకి రైల్వే స్టేషన్‌కి పోయే దారి తెలియదు. కాని, అది స్టేషన్‌కి దారికాదని ఆమె సిక్స్త్ సెన్స్ చెపుతోంది. అందుకు సాక్ష్యంగా ఊరివైపు దీపాలున్నవైపు రైలుకూత వినిపిస్తోంది. పొగ తెరలుగా పైకిలేస్తోంది అంటే స్టేషన్ ఊళ్ళోంచే మధ్యగా వుండివుండాలి.

సుస్మిత ఆలస్యం చెయ్యలేదు. ఎదురుగా వస్తూన్న లారీ హెడ్‌లైట్సు కాంతి కళ్ళమీదపడి రిక్షావాడు రిక్షా స్లో చేశాడు. ఆ క్షణాన్ని ఉపయోగించుకుంది. ఆమె చటుక్కున రిక్షాలోనించి దిగిపోయింది. వెనక్కి ఊరివైపు పరుగులు పెట్టసాగింది.

రిక్షావాడు కొంతదూరం పోయాక రిక్షాలో ఆమె లేదని గ్రహించుకుని రిక్షా వెనక్కి తిప్పాడు. వేగంగా ఆమెను వెంబడించసాగాడు.

కాస్తలో ఆమె వాడికి దొరికిపోయి వుండేదే! కాని ఆమె అదృష్టమో, రిక్షావాడి ప్రారబ్ధమో తెలీదుగాని, రోడ్డుపక్కగా వేసిన రాళ్ళగుట్టమీద కెక్కేసింది రిక్షా.

రిక్షా వాడు అదురుకు పోయి గుట్టమీదనుంచి జారి పక్కనే పారుతున్న డ్రెయినేజి కాలవలో పడిపోయాడు.

సుస్మిత వెనుతిరిగి ఏం జరిగిందో చూడాలనుకుని కూడా, ఆగితే, వాడెక్కడ పట్టుకుంటాడోనని పరుగు ఆపలేదు. ఆయాసం వస్తోంది. కళ్ళు తిరుగుతున్నాయి. కాళ్ళు తడబడుతున్నాయి. దాహంతో నాలుక పిడచ కట్టుకుపోతోంది. ఏ క్షణంలోనైనా శోషవచ్చి పడిపోయేలా వుంది. అయినా ఆమె పరుగు ఆపలేదు.

లైట్లు దగ్గరపడ్డాయి. ఊరు దగ్గరయిందని గ్రహించిందామె. పరుగు ఆపింది.

లైట్లు బాగా దగ్గరయ్యాయి. ఊరి మొదట్లోనే ఓ పాన్ షాపు కనిపించింది. ప్రాణం లేచివచ్చినట్లయింది.

"ఓ సోడా" అన్నది.

పాన్ షాపతను సోడా కొట్టించాడు. ఐస్ సోడా నీళ్ళు చల్లగా గొంతులో దిగుతుంటే అప్పటివరకు తనుపడ్డ ప్రయాస, టెన్షన్ మెల్లగా తగ్గుతూ వచ్చాయి. వరసగా మూడు సోడాలు తాగితేనేగానీ దాహం చల్లారలేదు. పాన్ షాపతను వింతగా చూస్తున్నాడామెవంక.

పదిరూపాయిల కాగితం షాపతనికిచ్చింది. అతను చిల్లర ఎంచి ఇచ్చాడు.

"రైల్వేస్టేషన్‌కి దారి ఎటు?" అనడిగిందతన్ని.

"దగ్గరేనమ్మా! రిక్షా కట్టించుకుని వెళ్ళు" అన్నాడతను. ఆమె చూడగా పెద్దింటి పిల్లలా కనిపిస్తోంది. ఊరు కొత్తలా వుంది, ఒక్కతే వస్తోంది, ఎక్కడినుంచో అని ఆలోచిస్తున్నాడతను.

"రిక్షా వద్దులే! ఎటో దారిచెప్పు," అన్నది సుస్మిత.

అతనికి జాలేసింది. "ఎక్కడికి వెళ్ళాలమ్మా?"

అన్నాడు ప్రశ్నకు ప్రశ్న సమాధానమన్నట్టు."

"హైదరాబాదు."

"తొందరగా వెళ్ళమ్మా! మద్రాసునించి ఎక్స్‌ప్రెస్సు వచ్చే టైమయింది. అదిగో కుడిచేతిమీదుగా కనిపిస్తున్న రోడ్ తిన్నగా స్టేషన్ కే పోతుంది.... ఒరే, సోములూ అమ్మాయిగార్ని రైలుస్టేషన్ కి తీసుకెళ్ళరా!" అంటూ అటుగా వచ్చిన రిక్షావాడ్ని కేకేశాడు పాపతను.

"వద్దు, వద్దు నేను వెళ్ళగలను!" అంటూ అతను చూపించిన దారివంక చకచక అడుగులు వేసింది సుస్మిత.

రాత్రి పదకొండు గంటలయింది. రోడ్డున జన సంచారం లేదు. అయినా దారిపొడవునా మున్సిపాల్టీ వాళ్ళు అమర్చిన ట్యూబ్ లైట్లు చక్కటి కాంతిని వెద జల్లుతున్నాయి. స్టేషన్ దగ్గరపడుతున్న సూచనలు దూరం నించే కనిపించాయామెకు. ట్రెయిన్ కూత, షంటింగ్ చేస్తున్న శబ్దం—అన్నీ దగ్గరయ్యాయి.

చకచక స్టేషన్ మెట్లెక్కింది. ఏదో ట్రెయిన్ స్టేషన్‌లో సిద్ధంగా వుంది. లోపలికి వేగంగా అడుగులు వేసింది. బుకింగ్ రూం దగ్గర్నుంచి వెళ్తూ గతుక్కు మంది. తన దగ్గర టికెట్ కి సరిపడ డబ్బుల్లేవు. కనీసం ముప్ఫైరూపాయలకు తక్కువుండదేమో ఛార్జీ. కాని తన దగ్గర తొమ్మిది రూపాయల పావలా వుంది.

ట్రెయిన్ కూతలో ఆమె ఆలోచనలు చెదిరిపోయాయి. సరే, టి.సి. పట్టుకుంటే యేదో చెప్పుకోవచ్చునన్న తెగింపు వచ్చేసిందామెకు. ప్లాట్ ఫామ్‌మీదకు చేరుకుంది. అక్కడెవరో వుంటే అడిగింది.

"ఏమండీ, ఇది మద్రాసునుంచేనా వస్తున్నది?" అని.

"అవును!" అన్నాడతను ముక్తసరిగా.

అప్పటికే ట్రెయిన్ మూవ్ అయింది. సుస్మిత చటుక్కున దొరికిన కంపార్టుమెంటు ఎక్కేసింది. అది జనరల్ కంపార్టుమెంటు. అంతమంది జనాన్ని తోసుకుని లోపలికెలా వెళ్ళాలో ఆమెకి తోచలేదు. ఆడపిల్లని ఎవరూ జాలిపడి చోటివ్వలేదు సరికదా, మరికాస్త ధీటుగా నించున్నారు తలుపు దగ్గర. అలాగే దారిచేసుకుని లోపలికి జొరబడింది.

ట్రెయిన్ స్పీడు అందుకుంది. మెల్లిగా దారిచేసుకుని సీటున్నవేమోనని వెతుక్కుంది. ఎక్కడా ఖాళీ దొరకలేదు. ఒక ముసలాయన కాస్త జరిగి చోటిచ్చాడు, "కూచోమ్మా!" అన్నాడు. తన మనవరాలు గుర్తొచ్చిందేమో! ఆయనకి కృతజ్ఞతలు చెప్పుకుని కూచుంది. అంతమంది జనాన్ని చూశాక ఆమెలో భయం, బెరుకుపోయి ఆ స్థానాన్నే ధైర్యం చోటుచేసుకుంది.

రిలాక్సింగ్ గా కూచుని వెనక్కి జారగిలబడింది. అంతసేపు తనుపడ్డ ప్రయాస మర్చిపోయింది.

ట్రెయిన్ కుదుపుకి నిద్రదేవత తనంతట తానుగా వచ్చి ఆమెను ఆవరించింది. ఎంత ఆపుకోవాలన్నా ఆమెకు సాధ్యపడలేదు. అలాగే కూచుని కళ్ళుమూసుకుంది.

## 8

టి. సి. తట్టిలేపటంతో చటుక్కున కళ్ళు తెరిచింది సుస్మిత. కాసేపటివరకు తనెక్కడున్నదో ఆమెకు అర్థం చేసుకోవటానికి రెండు నిమిషాలు పట్టింది.

"టికెట్, టికెట్" అంటున్నాడు టి. సి.

సుస్మిత గుండెల్లో రాయిపడింది. అతనికేమని సమాధానం చెప్పాలి?

"టికెట్ యేదమ్మా!" అంటున్నాడాయన.

సుస్మిత గుటకలు మింగి, "ట్రెయిన్ కదిలిపోతుంటే హడావిడిగా ఎక్కేశానండి. టికెట్ తీసుకోలేదండి!" అన్నది.

టి. సి.కి ఆమె నిజమే చెప్తున్నదనిపించింది. చూడగా టికెట్ లెస్ ట్రావెలర్ లా కనిపించటంలేదు.

బిల్ బుక్ పైకి తీసి "సరే, టికెట్ నేను ఇంచు తాను ఎక్కడ ఎక్కావు?" అన్నాడు టి.సి.

"ఒంగోలు."

"ఎక్కడికి పోవాలి?"

"హైదరాబాదు."

టి.సి. విచిత్రంగా చూశాడు. "ఏమమ్మా, నిద్ర మత్తులో వున్నావా, లేక నాతో వేళాకోళ మాడుతున్నావా?" అన్నాడు సీరియస్ గా.

"అయ్యయ్యో, నిజంగా నే హైద్రాబాద్ వెళ్ళాలి అంకుల్!" అన్నది సుస్మిత.

"ఇది హౌరా పోయే ట్రెయిన్, హైద్రాబాదు పోదు. చదువుకున్న పిల్లలా వున్నావు, ఆమాత్రం తెలీదా?" అన్నాడు ఆయన అదే సీరియస్ నెస్ తో.

"నిజంగా నాకు తెలీదు అంకుల్. ఎవర్నో అడిగితే ఇదేనన్నారు, ఎక్కేశాను" అన్నది చుట్టూ భయంగా చూస్తూ. ఆమెకి ఏడుపొచ్చినంత పనయ్యింది. హైద్రాబాదు వెళ్ళిపోతే ఎలాగైనా ఇక ఫరవాలేదనుకుంటుంటే ఇప్పుడు అసలు రూటే మారిపోయింది. భగవాన్ యిప్పుడెలా?

"సరే, వచ్చే ఏలూరు స్టేషన్ లో దిగిపో! ఇక్కడి వరకు ఛార్జీ ఇరవై రెండు రూపాయలు-ఇదిగో టికెట్!" అన్నాడు బిల్ బుక్ నించి ఎర్ర కాగితంనించి ఆమెకిస్తూ.

"సారీ, అంకుల్! నా దగ్గర పైసల్లేవు!" అన్నది దిక్కు మొహం వేసుకుని సుస్మిత.

టి.సి.కీసారి చాలా కోపం వచ్చేసింది.

"ఏమిటీ నాటకం? నువ్వు కావాలనే ఈ ట్రెయిన్ ఎక్కావు. మళ్ళీ హైదరాబాద్ పోవాలని అబద్ధమాడుతున్నావు. మధ్యలో దించేస్తే హాయిగా దిగిపోయి, మరో ట్రెయిన్ ఎక్కి నీ ప్రయాణం పొడిగించాలని ప్లాన్ వేశావు. నీ చదువు ఇలాంటి వక్రమార్గాలు పట్టడానికి ఉపయోగించేబదులు, బుద్ధి తెచ్చుకో!" అంటున్నాడు.

అంతదాకా దాదాపు అందరూ నిద్రావస్థలో వున్నారు. టి.సి. లేపటంతో లేచి టికెట్ చూపించి మళ్ళీ నిద్రకొరిగిపోతున్నారు. టి.సి. కేకలకు చాలామంది నిద్రాభంగమై లేచి చూస్తున్నారు.

సుస్మితకు ఏడుపు తన్నుకుంటూ వచ్చేసింది. అందరూ తనని ఓ దొంగలా, ఘోరమైన తప్పుచేసినదానిలా చూస్తుంటే ఆమెకు అవమానంతో ఒళ్ళు చచ్చిపోయింది.

"పోనీండి పాపం, డబ్బుల్లేవేమో!" అని జాలిపడ్డారు ఒకరిద్దరు. అది ఇంకా అవమానకరమనిపించింది సుస్మితకు. ఆ ట్రెయిన్‌లోనుంచి దూకి చచ్చిపోదామన్నంత బాధగా తోచాయి ఆ మాటలు. అయినా సహించింది.

"ట్రెయిన్ ఆగుతోంది. రైల్వేపోలీసులకప్పచెప్పాల్సి వుంటుంది. అన్నీ దొంగవేషాలు!" నిర్దయంగా అంటున్న టి.సి. మాటలు ఆమె హృదయాన్ని తూట్లు పొడిచాయి.

# 9

"నీ పేరు సుస్మితేనా?" ఇన్‌స్పెక్టర్‌లా వున్నతను అడిగాడామెను. అసంకల్పితంగా తలూపింది. అతను

తన చేతిలో వున్న ఫోటోను, సుస్మితను మార్చి మార్చి చూశాడు.

"ఏంటి ఇన్‌స్పెక్టరు!" అన్నాడు టి.సి. ఆత్రుతగా.

"అచ్చే మరేంలేదు సార్, ఈ అమ్మాయి తప్పిపోయి నట్టు వీళ్ళ మామయ్య పల్లంరాజుగారు పోలీసు రిపోర్టు ఇచ్చారు. పోలీస్టేషన్లన్నిటితోబాటు రైల్వే పోలీస్‌లకి, బస్ స్టేషన్లకు మెసేజ్ వెళ్ళింది. ఇదిగో ఈ అమ్మాయి ఫోటోలు కూడా అన్ని స్టేషన్లకీ పంపించారు. ఈ ఫోటో సాయంతోనే ఈ అమ్మాయిని గుర్తించాం" అని చెప్పాడు ఆ రైల్వే పోలీస్ ఇన్‌స్పెక్టరు.

సుస్మితకి అర్థమైపోయింది. తన మామయ్య తను తప్పించుకు పోగానే ఏం ఎరగనట్టు పోలీసురిపోర్టిచ్చాడన్నమాట! తనమీదికి రాకుండా ముందుగానే జాగ్రత్త పడ్డాడు — అమ్మని కూడా ఈ రిపోర్టుతో నమ్మించి వుంటాడు.

"ఎ క్క డి ను ం చి వస్తున్నావమ్మా, ఎలా తప్పి పోయావు?" అడిగాడు ఇన్‌స్పెక్టరు.

ఒంగోలులోని ముసల్ది చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. పోలీసులు తమకు కావలసినవాళ్ళేనంటూ వ్యాఖ్యా నించటం గుర్తొచ్చింది. తను విజయవాడ ముసలామెమీద, ఒంగోలు ముసలామెమీద రిపోర్టిచ్చినా పోలీసులు వాళ్ళ మీద చర్య తీసుకుంటారనే గ్యారంటీ ఏముంది? తను చెప్పాల్సిన సమయం ఇదికాదు, సరైన టైం చూసుకుని చెప్పాలి. అప్పుడు వాళ్ళు మళ్ళీ తప్పించుకోలేని విధంగా పట్టించాలి!

"రామ్మా, మాతో!" అన్నాడు రైల్వే ఇన్‌స్పెక్టరు.

సుస్మిత వాళ్ళతోబాటు నడిచింది. రైల్వేస్టేషన్

ఆవరణలోనే వున్న తమ స్టేషన్‌కి తీసుకువెళ్ళా రామెని.

ఇన్‌స్పెక్టరు మళ్ళీ రెట్టించి అడిగినా, సుస్మిత పెదవి విప్పలేదు. తన ప్రమేయం లేకుండానే పరిస్థితులు చకచక మారిపోవటం ఆమెలో జడత్వాన్ని తెచ్చాయి.

ఇన్‌స్పెక్టరు ఆమెని ఏమడిగినా లాభంలేదని నిర్ణయించుకున్నాడేమో యెవరికో ఫోన్ చేసి తను దొరికినట్టు ఇన్ఫర్మేషనిచ్చాడు.

ఓ పదినిమిషాల తర్వాత మరో పోలీసు ఇన్‌స్పెక్టరు ఇద్దరు కాన్‌స్టేబుల్స్‌తో వచ్చాడు. రైల్వే పోలీసువాళ్లు తనని జనరల్ పోలీసువాళ్ళకి అప్పచెప్పబోతున్నారని గ్రహించింది సుస్మిత.

"రామ్మా, మాతో! మీ మామయ్యగారికి విజయవాడ కబురుచేశాం. ఆయన మా పోలీస్‌స్టేషన్‌కొస్తారు. నువ్వెక్కడో తప్పిపోయావని కంప్లయింట్ యిచ్చారు. ఎక్కడికిపోయావు, ఇక్కడికెలా వచ్చావు?" అనడిగాడు ఆ సబ్‌ఇన్‌స్పెక్టరు. సుస్మిత పెదవి విప్పలేదు. అతను కళ్ళతోనే రైల్వే ఇన్‌స్పెక్టరుతో ఏదో మాట్లాడు న్నాడు.

సుస్మిత ఇది గమనించింది. పోలీసు స్టేషన్‌లో స్త్రీలకు జరిగిన అత్యాచారాల గురించి ఆమె పేపర్లో చదివింది, విన్నది. తను ఏదియేమయినా వీళ్ళవెంట పోకూడదని నిర్ణయించుకుంది.

"రామ్మా, వెళ్దాం!" అన్నాడు ఎస్.ఐ. మళ్ళీ.

"నేను రాను. మీరు మా మామయ్యను పిలిపించదల్చుకుంటే ఇక్కడికే పిలవండి!" అన్నది సుస్మిత ఒక నిర్ణయానికి వస్తూ.

ఎస్.ఐ. రైల్వే ఇన్‌స్పెక్టరు దెబ్బతిన్నట్టు చూశారు.

ఆమె అంతర్యం యేమిటో చూచాయగా వాళ్ళకర్థమైంది.

ఎస్.ఐ. ముఖం మాడ్చుకుని, "ఆల్ రైట్! ఇక్కడికే పంపిస్తాం. మా దేంపోయింది?" అంటూ అక్కడినుంచి విసురుగా వెళ్ళిపోయాడు.

మరో గంటన్నర తర్వాత పల్లంరాజు పరుగెత్తుకుంటూ వచ్చాడు. సుస్మితకి అతన్ని చూడగానే ప్రతీకార వాంఛతో భగ్గున మండింది.

అతను వస్తూనే కొండంత ఆప్యాయతను వెదజల్లుతూ "అమ్మా సుస్మీ, యెక్కడికి వెళ్ళిపోయావమ్మా, నువ్వేమయిపోయావోనని మీ అమ్మ ఒకటే గొడవ! ఏడుస్తూ కూచుంది. నేను రాత్రే హైదరాబాదునుంచి వచ్చాను. మీ అమ్మని నాతో బెజవాడ రమ్మంటే రాలేదు. ఈ రోజు ఎంత సుదినం!" అన్నాడు.

సుస్మిత ముఖంలో ఎలాంటి భావాలనీ కనపరచలేదు. మౌనంగా అతని వెంట బయలుదేరింది.

స్టేషన్ బయట నిలబెట్టిన కారులో సుస్మితని కూర్చోబెట్టాడు. తను పక్కనే కూచుని, "డ్రైవర్ పోనియ్యి" అన్నాడు. కారు కదిలింది.

"మెసేజ్ వినగానే విజయవాడనుంచే కారేసుకుని ఆఘమేఘాలమధ్య వచ్చేశాను...." అంటూ చెప్పుకొస్తున్నాడు పల్లంరాజు.

సుస్మిత ఆ మాటలు వినటంలేదు. తిరిగి తిరిగి మళ్ళీ పులి బోనులో చిక్కుకున్నందుకు ఆమె మనసు నలిగిపోతోంది.

ఆలోచనల మధ్య కారు విజయవాడ ఎప్పుడు చేరుకుందో, సుస్మిత గమనించలేదు. చిన్న జర్కుతో కారాగింది.

సుస్మిత బయటికి చూసింది. మామయ్య ఇల్లు! మళ్ళీ తనకి బందిఖానా తప్పదా?

"దిగమ్మా, లోపలికి వెళ్దాం!" అన్నాడు పల్లంరాజు.

మౌనంగా అతన్ననుసరించింది. పక్కకు చూసింది. ఆ పక్కవీధిలోనే తనను ఖాసిం చేత వేశ్యాగృహానికి అమ్మించిన ముసలిది వుంటున్న ఇల్లుంది. ఆ ఇల్లు తనకి గుర్తే. ఒంగోలు ముసలిదాని ఇల్లుకూడా మరిచిపోలేదు. వీళ్ళిద్దరికి జన్మలో మరిచిపోలేని శిక్షవిధించేలా చూడాలి! తను వీళ్ళనంత తేలిగ్గా వదలదు.

సుస్మితలో ప్రతీకారవాంఛ ప్రజ్వరిల్లుతోంది.

లోపల తనని వెంబడించిన పనివాడిని, ఇద్దరు ఆడ వాళ్ళని చూసింది సుస్మిత. మీ సంగతి చూస్తాను అనుకున్నది మనసులోనే.

మామయ్యతో లోపలి గదిలోనికి మౌనంగా నడిచింది.

లోపలికి రాగానే తలుపులు మూసి, పల్లంరాజు తన విశ్వరూపాన్ని చూపించాడు. ఆమె చెంపలు రెండూ వాయించాడు. సుస్మిత కళ్ళు తిరిగి పడిపోబోయింది.

"ఏమే, నాకే మస్కా కొట్టి పారిపోతావా? నిన్ను పట్టుకోలేనంత అసమర్థుడిననుకున్నావా, నా దృష్టినుంచి తప్పించుకు పారిపోవటం నీ తరమా, నీ బాబు తరమా?" నోటికొచ్చినట్టు వాగుతున్నాడు పల్లంరాజు.

సుస్మిత అప్పటికప్పుడే ఓ నిర్ణయానికొచ్చేసింది.

"క్షమించు మామయ్యా, నువ్వు చెప్పినట్టే వింటాను. చెయ్యమన్నట్టు చేస్తాను" అన్నది అవమానాన్ని ఉక్రోషాన్ని పళ్ళ బిగువున దాచుకుని.

"అలా దారికిరా! అయినా నిన్ను నమ్మపనిలేదు.

నువ్వు ఆ గదిలోనే పడుండు. నువ్వింకా మేజర్ కావ టానికి రెండు నెలల టైముంది...." అని అంతలోనే మాట మార్చేసి, "అదే రెండు నెలల్లో నీ పెళ్ళి!" అన్నాడు.

సుస్మిత ఆశ్చర్యాన్ని బయటికి ప్రకటించకుండా నిగ్ర హించుకుంది. అంటే రెండు నెలల్లో తనకి పద్దెనిమిదేళ్లు నిండుతున్నాయి. దానికీ తనను మామయ్య బంధించటానికి యేదో బలమైన కారణముందన్నమాట! యేమిటది?

పల్లంరాజు బయటికి వెళ్ళాడు. సుస్మితని మళ్ళీ అదే బందిఖానాలోకి మార్చటానికి యేర్పాట్లు జరిగాయి.

# 10

సుస్మిత మౌనంగా స్నానాదులు చేసింది. తన కార్య క్రమాన్ని అమలు చెయ్యటానికి ఆకలితో బాధపడ కూడదు. మామయ్య అంతు తేల్చటానికి అతనింట్లోనే కార్యక్రమాన్ని మొదలు పెట్టాలి!

"గుడ్, అలా బుద్ధిమంతురాలిలా వుండాలి నా కోడలు" అని ముచ్చటపడిపోయాడు పల్లంరాజు.

సుస్మిత నవ్వింది. "మామయ్యా, సూరిబావ కనిపించ టంలేదేమిటి?" అన్నది.

"ఇక్కడే వున్నాడమ్మా. రాత్రి వాతో మీ ఇంటి దగ్గర్నుంచి తీసుకొచ్చాను. వాడు నీమీద చాలా బెంగ పెట్టుకున్నాడమ్మా!" అన్నాడు పల్లంరాజు.

ఓ పదినిమిషాల తర్వాత సూరి అక్కడికొచ్చాడు. "సుసీ, యెప్పుడొచ్చావు? నువ్వేమయిపోయావోనని భయ పడిపోయాం, తెల్సా!" అంటూ.

"బావా, అమ్మ ఎలా వుంది?" అన్నది సుస్మిత ముందుగా తల్లిని గురించి తెల్సుకోవాలనే ఆరాటంతో.

"నీ గురించి బెంగ పెట్టుకుంది. అసలు నిన్నెవరో ఎత్తుకుపోయారంటగదా!"

"ఎవరన్నారు?"

"మా నాన్న మీ అమ్మతో చెప్పాడు. అమ్మ పోలీసు రిపోర్టు ఇస్తానంటే నాన్న తనే రిపోర్టిచ్చాడు నిన్న. కారుందిగా అస్తమానూ హైద్రాబాదూ విజయవాడ తిరుగుతున్నాడు."

"మామయ్య ఎక్కడున్నాడు?"

"హైద్రాబాద్ పోతున్నాడుగా."

"ఎప్పుడు?"

"ఇంకో గంటలో."

సుస్మిత టైం చూసుకుంది. రాత్రి యేడు కావచ్చింది. ఇప్పుడు ఎందుకు వెళ్తున్నట్టు మామయ్య? ఆమె మనసు పరిపరివిధాలా ఆలోచిస్తోంది. ఈ రాత్రే తను యీ బందిఖానానించి బయటపడాలి.

"సుసీ, మన పెళ్ళంటగా!" అన్నాడు సూరి.

"ఎవరు చెప్పారు?"

"మా నాన్న."

"మా అమ్మకి తెలుసా?"

"ఏమో మరి!"

"నన్నెందుకు చేసుకోవాలనుకుంటున్నావు నువ్వు? మాకన్నా మీరే బాగా డబ్బున్నవాళ్ళు కదా? పెద్ద కట్నంతో పెళ్ళాం దొరుకుతుందికదా నీకు!"

"అబ్బ, అబ్బా! నువ్వే అందరికన్నా డబ్బున్నదానివి! నీకు తాతయ్య ఎన్నో లక్షల రూపాయలు రాసిచ్చాడటగదా! రెండు నెలల్లో ఆ డబ్బు నీకొస్తూందటగదా. నిన్ను పెళ్ళిచేసుకుంటే అదంతా నాదే కదా!"

సుస్మితకి మబ్బు తెర విడిపోయింది. అసలు కారణం అర్థమయింది. ఇదా మామయ్య పన్నాగం? తాతయ్య తనకి ఆస్తి మేజరయ్యాక ముట్టేటట్టు ఏదైనా వీలునామా రాసివుండాలి? బహుశా అది, మామయ్య చేతికి చిక్కి వుంటుంది. తండ్రి పోయాక ఆస్తిపాస్తుల వ్యవహారాలు చూసే నెపంతో తమ ఇంట్లో తిష్ట వేసుకుని మామయ్య చేసిన నిర్వాకం ఏమిటో ఆమెకి బాగా తెలిసి వచ్చింది. ఆమె ఏదో అడగబోయింది.

ఇంతలో పల్లంరాజు లోపలికొచ్చాడు. వాళ్ళిద్దర్నీ అక్కడ పక్కపక్కన చూసి మురిసిపోతూ, ఏదో చెప్పాలని వచ్చినవాడు అల్లాగే వెనక్కి వెళ్ళిపోయాడు. మామయ్య ప్రయాణానికి సిద్ధమయ్యాడని అర్థం చేసుకుందామె. బయట ఎవరితోనో తనని జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండమని జాగ్రత్తలు చెపుతున్నాడు మామయ్య.

"చూడు నూరీ, ఆ ఆస్తి తాలూకు వివరాలు నీకు తెలుసా?" అన్నది లాలనగా సుస్మిత, బయట కారు చప్పుడు దూరంకాగానే.

"నాకు తెలీకపోవటమేమిటి? అవన్నీ బీరువాలో దాచాడు నాన్న!"

"అలాగా, నేనెప్పుడూ చూడనేలేదు."

"నేను చూపించనా?"

"నీ దగ్గర తాళాలు లేవుగా!"

"నాన్న ఊరెళ్ళేటప్పుడు తాళాలు తీసుకుపోడుగా. అవెక్కడ దాస్తాడో నాకు తెలుసుగా!"

"నీకు తెలుసా? అయితే చూపించమ్మా!"

"ఉందు. ఆ పనిమనుషులు నిద్రపోనియ్యి. నాన్న లేనపుడు వేటకుక్కల్లా కాపలా కాస్తుంటారు వాళ్ళు."

"సరే, గమ్మున తీసుకురా!" అన్నది సుస్మిత.

రాత్రి పదిగంటలు కావచ్చింది.

సుస్మిత గదిలో అసహనంగా పచార్లు చేస్తోంది. పని వాళ్ళిద్దరు గదిముందే కాపలా కాస్తున్నారు. వాళ్ళు ఆ రాత్రి తమ పక్కలు సుస్మిత గది ముందుకే మార్చుకున్నారు.

నూరి వచ్చాడు. దస్తావేజుల కట్టలు తెచ్చాడు.

అవన్నీ చూసి సుస్మిత విస్తుపోయింది. తలుపులు చేర వేసింది. బయట పనివాళ్ళకు తెలిస్తే కథ తారుమారు అయిపోతుందని ఆమెకు తెలుసు.

అవన్నీ వడ్డీలకి అప్పులిచ్చి భూముల్ని, ఇళ్ళని పల్లం రాజు తన పేర రాయించుకున్న దస్తావేజులు! తన మామయ్య విశ్వరూపం బోధపడసాగిందామెకు.

అందులో తనక్కావలసిన దస్తావేజు దొరికింది. తనని గుండెలమీద ఎక్కించుకుని గుఱ్ఱం ఆటలు ఆడిన తాతయ్య రాసిన వీలునామా అది! తనకు పద్ధెనిమిదేళ్ళు నిండేసరికి ఆస్తి అంతా తనకు చెందేలాగున రాశాడు.

"నూరీ, నేనంటే నీకిష్టమేకదా!" అన్నది సుస్మిత సూటిగా.

"ఓ బోలెడంత."

"అయితే, నాకు అమ్మని చూడాలని వుంది, తీసుకు వెళ్తావా?"

"తప్పకుండా. మరి ఇందాకా చెపితే నాన్నతో కార్లో వెళ్ళేదానివి కదా!"

అతని అమాయకత్వానికి నవ్వొచ్చింది.

"ట్రెయిన్ కెళ్దామా, బస్ కా!"

"ట్రెయిన్ కే వెళ్దాం."

"ఇంకో గంటలో గోదావరి ఎక్స్‌ప్రెస్ వుంది. పోదామా?"

"మరి ఈ కాపలావాళ్ళ సంగతి?"

"సెకండ్ షోకి తీసుకెళ్తున్నానని చెపుతాను. నన్నెవరూ కాదనరు కదా!"

వెర్రివాడికి కూడా తెలివి వుంటుందని మొదటిసారిగా గ్రహించింది సుస్మిత.

మరోగంట తర్వాత వాళ్ళిద్దరు హైదరాబాద్ పోయే గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వున్నారు. తన వెంట తాతయ్య వీలునామాతో బాటు, మామయ్యని కటకటాల వెనక్కు పంపించటానికి దోహదం చేసే డాక్యుమెంట్సన్నీ తెచ్చుకోవటం మరిచిపోలేదు సుస్మిత.

మర్నాడుదయం ట్రెయిన్ సికింద్రాబాద్ చేరుతూనే బావతో సరాసరి కమిషనర్ ఆఫ్ పోలీసు ఇంటికి టాక్సీ వేసుకుని వెళ్ళింది సుస్మిత.

ఆమె రిపోర్టులన్నీ రికార్డయ్యాయి. విజయవాడ ఒంగోలు ముసలామెల సంగతితో పాటు అన్ని సంగతులు రికార్డయిపోయాయి.

తనమీద ఆశతో తనకు అన్నివిధాలా సాయపడిన వెర్రిబాగుల బావవంక జాలిగా చూసింది సుస్మిత.

టాక్సీ సుస్మిత ఇంటివైపు దూసుకుపోయింది.

—:అయిపోయింది:—

సీరియల్

# విషసర్పాల సికిందర్

(గత సంచిక తరువాయి)

మేడమీదికి ముఫైరెండు మెట్లెక్కితే ఎదురయ్యే మొదటి గదిలో యెప్పుడూ నిశ్శబ్దం రాజ్యమేలుతూ వుంటుంది.

ఆ ప్రశాంతతని భంగపర్చడానికి యెవరూ.... సాహసించరు, ఎంతో అవసరమైతే తప్ప. ఆ అవసరమూ తమది కాకుండా వుండాలి. అప్పుడే క్షేమంగా వుండగల్గుతారు.

అలా తమదికాని అవసరంతో ఆ గదిలో అడుగుపెట్టిన శంభూనాథ్, జింబోతో గుటకలువేస్తూ నిలబడ్డారు.

ఆ వార్త ఎలా చెప్పాలో తోచలేదు వాళ్ళకి.

వాళ్ళకెదురుగా ఎత్తయిన మెత్తని బెడ్ మీద పడుకుని, పైపు కాలుస్తూ వున్నాడొక వృద్ధకాయుడు.

వాళ్ళిద్దర్నీ అతను తదేకంగా గమనిస్తున్నాడు—అది చూసేవాళ్ళకు మాత్రమే.

అతను రోజుకు పదహారు గంటలు ఆలోచిస్తాడు. రెండు గంటలు తింటాడు. ఆరు గంటలు నిద్రపోతాడు.

అందుకే అతని కెప్పుడూ ప్రశాంతతే కావాలి.

ఒకసారి మిడిల్ ఈస్టులో ఏ నమూనాలో భవనం కట్టుకోవాలో ఆలోచిస్తోంటే, ఎక్కడ్నించో ఒక పిట్ట వచ్చి ఫ్యానుకు కొట్టుకుని తనమీదపడి చచ్చినందుకు, కోపంతో అరుచుకుంటూ వచ్చి; ఆ చుట్టుపక్కల పిట్ట లేకుండా కాల్చి పారెయ్యమన్నాడు.

ఒక్కోసారి అతని ఆలోచనలకి మూడ్ కుదరదు—

అప్పుడు తాజాగా కోడిపిల్లల్ని తెప్పించి, వాటికి సూదులు గుచ్చుతూ ఆనందిస్తూంటే, అవిచేసే ధ్వనులకి అతని మెదడులో గంటలు మ్రోగుతాయి.

ఒకవేళ తన ఆలోచన ఫలించకపోతే—

అప్పుడు తన ఇష్టదైవం పటాన్ని ముందుంచుకొని తిట్ట రాని తిట్లు తిడతాడు. అవి భయంకరంగా బయటికి విన్పిస్తోంటే, ఆ చుట్టుపక్కల ఎవరూ వుండరు.

ఆలోచన ఫలిస్తే—

పటంముందు సాష్టాంగపడి ముక్కు నేలకు రాచి రాచి రక్తం వచ్చేలా చేసుకుంటాడు. అప్పుడా రుధిరంతో తిలకం అద్దుతాడు. అందుకే అతని ముక్కెప్పుడూ చిలక కొట్టిన జాంపండులా వుంటుంది.

తనకెవరైనా ఆగ్రహం తెప్పించే పనిచేస్తే—

యాసిడ్‌లో పడేస్తానని బెదిరిస్తాడు. ఆ బెదిరింపుకి సైకలాజికల్‌గా కారణాలు తీయవచ్చు. అతనికి పైశాచిక మనస్తత్వమనుకునే వాళ్ళకి, అంతరంగంలో అతను రెట్టింపు పిరికితనం కలవాడని తెలియదు. అతని విపరీత చేష్టలు చూసి జడుసుకునేవాళ్ళు. సహజంగానే అతని బెదిరింపుల్ని సీరియస్‌గా తీసుకుంటారు. అందులో సంభవా సంభవాల్ని యోచించరు. యోచించనివ్వదు

అతని శాడిస్టికల్ ఇమేజ్.

లేకపోతే తన వైఫల్యానికతను దేవుడ్ని దూషించడు.

దాని కారకుల్నిపట్టి శిక్షించేవాడు.

తనకంటే చిన్న చిన్న మూగజీవాల్ని తప్ప అతను హింసించడానికి సాహసించడు. అతని సోకాల్డు శాడిజం వెనుక బోలెడు ఇన్ఫీరియారిటీ వుంది.

ఇదే అతని చేత వ్యూహాలల్లిస్తుంది. ఫాంటసీలు సృష్టిస్తుంది. వాస్తవంలో తను చేయలేనివి అనుచర వర్గంతో చేయించి అహాన్ని తృప్తిపరచుకుంటాడు.

రెండు నెలల క్రితమే అతనికీ కోరిక కలిగింది. మూకుమ్మడిగా మనుషుల్ని చంపాలని, ఇంకా ఈ నోరులేని ప్రాణులతో తృప్తిపడలేక పోయాడు. తనలాంటి మనుషుల ప్రాణాలతో ఆడుతున్నప్పుడే తనేమిటో రుజువవుతుంది. విద్యానికైనా సమఉజ్జీ వుండాలి. తనలోని ఇన్ఫీరియారిటీని ప్రారద్రోలాలంటే ఇప్పుడు మానవ జాతితో తలపడక తప్పదు!

మానవ లోకాన్ని భయభ్రాంతుల్ని చేయాలి!

మనుషుల్ని గజగజలాడించాలి!

తనంటే హడలిపోవాలి!

తనిప్పుడు స్వాప్నిక జగత్తులో తృప్తిపడడం మానేసి, వాస్తవంలో తన శక్తియుక్తిలేమిటో నిరూపించుకోవాలి. లోకానికి చూపించాలి!

ఈ కోరిక అతనిలో బాగా నాటుకుపోయింది. అది రోజురోజుకు, అధికమవుతోంటే ఆలోచనల్ని పూర్తిగా ఆచరణా విధానంమీదికి కేంద్రీకరించాడు. అప్పుడతనికి 'వంక' కావాలనిపించింది ఈ కార్యక్రమానికి. తనిప్పుడు ఉన్మాదికాదు. చేసేది అర్థవంతంగా వుండాలి. లోకానికి

ఉపకరించాలి. ఆ కారణంగా అందర్నీ చంపడం ప్రయోజకత్వం అనిపించుకోదు.

అతనికి పత్రికలు చదివే అలవాటుంది. ప్రపంచంలో ఏం జరుగుతోందో తెలుసుకుంటాడు. స్త్రీలపై రోజు రోజుకీ అత్యాచారాలు పెరిగిపోతున్నాయని గ్రహించాడు. అప్పుడతనికి వంక దొరికింది. ప్రతి వంచకుడ్నీ వధించడం ద్వారా తన కోరిక నెరవేరడమేగాక, సమాజానికి ఎంతో కొంత మేలు జరుగుతుందనిపించింది.....

అంతే, అప్పుడతను పథకాలాలోచించసాగాడు.

పథకాలల్లడంలో అతను దిట్టే అయినా, ఆచరణకొచ్చేటప్పటికి భీరువే. అప్పుడతన్ని పిరికితనం, ఇన్ ఫీరియారిటీ ఆవహిస్తాయి. ఈ హైదరాబాదుకి రాకపూర్వం అతను ఔరంగబాదులో చెఱకు పండించుకునే సామాన్య రైతు. యశ్వంత్ రావ్ గైక్వాడ్ అంటే ఆ చుట్టు పక్కల అతిమంచి అమాయకమైన మరాఠీ రైతుబిడ్డ మాత్రమే.

కానీ ఆ అమాయక రైతుబిడ్డ ఓ అర్ధరాత్రి అమాంతంగా బందిపోటు అయిపోయాడు. ఏడాదిక్రితం ఎవరో భూస్వామిని దోచుకుని పారిపోతూ తన ఇంట్లో బలవంతంగా తలదాచుకున్న కిరాతక ముఠాతో పరిచయం ఏర్పడి, ఆ కాస్సేపటి పరిచయంతోనే తన్ని తాను అత్యంత సాహసికుడిగా వూహించుకునే యశ్వంత్ రావ్ గైక్వాడ్ కి, ఇక తెగించాలన్న కోరిక పట్టుపగ్గాల్లేకుండా పోయింది....

ఆ కిరాతక ముఠా సరళిలోనే అతను పోవాలనుకున్నాడు. పట్నం వెళ్ళి రెండు రోజులు బాగా గమనించి, పట్టపగలు 'దుబాదియా' బ్యాంక్ ని దోచుకు

సేందుకు పథకం వేశాడు. ఆ సందర్భంలోనే డైగనేశ్ బార్‌లో అతనికి శంభూనాథ్, జింబోలు పరిచయమయ్యారు.

పట్నంలో చిన్న సైజు చోర శిఖామణులుగా వుంటున్న వీళ్ళిద్దరూ, యశ్వంత్ పథకం వినగానే అతనికి జీహుజూర్ గాళ్ళయి పోయారు. వాళ్ళు యశ్వంత్‌ని తమ ఆమ్నిపొటెంట్ థింక్‌టాంక్‌గా భావించారు. యశ్వంత్‌కి కూడా వాళ్ళలో విశ్వాసం ఏర్పడింది. పథకం చెప్పేసి ఇంటికెళ్ళిపోయి తలుపు వేసుకుని కూర్చున్నాడు.

పథకం సూపర్ హిట్ అయి, ఆ మధ్యాహ్నమే డబ్బు సంచులతో వచ్చేసి తలుపులు తట్టారు వాళ్ళు. కానీ తర్వాత ఓ చిన్న దుర్వార్త కూడా చెప్పారు వాళ్ళు. వాళ్ళు ఎన్నుకున్న మరిద్దరు పోలీసులకి దొరికి పోయారు. లాఠీపడితే లబలబలాడి మన్‌హార్ రాగంలో అంతా ఆలాపించేస్తారు వాళ్ళు. దాంతో గుండెలు దిగజారి, భయస్థుడైన యశ్వంత్ రావ్ తక్షణం ఓ డబ్బు సంచీ పుచ్చుకుని పారిపోయాడు రైల్వేస్టేషన్‌కి.

అలా అతను హైదరాబాదు వచ్చి చేరుకున్నాడు. ఈ ఏడాదంతా కాజేసుకొచ్చిన మూడులక్షల రొక్కంతో బెదురుతూ బెదురుతూ గడిపాడు. పోలీసులెప్పుడూ అతను భయపడినట్టు అతని గడప తొక్కలేదు. కొంచెం స్వేచ్ఛా వూపిరి పీల్చుకుంటూండగా మనసు తిరిగి ఊహాలల్లడం ప్రారంభించింది.... వాటి ఫలితమే ఈ మనుషుల్ని చంపాలన్న కోరిక.

ఈ కోరికకు వంక దొరికింది. కానీ జంకు వుండనే వుంది. అతనికేదీ స్వయంగా చేసే సాహసం లేదు,

చేయించగలడు తప్ప. అప్పుడతనికి బాలరాజ్ జ్ఞాపకమొచ్చాడు. బాలరాజ్ సిటీలో గూండాల్ని కిరాయికి సరఫరా చేసే కాంట్రాక్టర్ గా వుండేవాడు. అతన్ని రెండుమూడుసార్లు ఊరికే కలిసిన పరిచయం వుంది. అతను యశ్వంత్ ఆలోచన, కోరిక విని — నవ్వి — సైకోపథిక్స్‌తో తను పనిచెయ్యడని నిష్కర్షగా చెప్పేశాడు.

యశ్వంత్ దెబ్బతిన్నాడు.

అప్పుడు రెండువందల కోడిపిల్లల్ని హింసించాడు. కొత్త ఆలోచన పుట్టింది. బాలరాజ్ ని అప్రోచ్ అయ్యాడు. కొత్త ప్రపోజల్ ముందుంచాడు—

"హత్యలు మనం చెయ్యం. అవే జరుగుతాయి. అత్యాచారణకి బలైన ఏ రౌద్రక్రూర ప్రతీకార వాంఛితురాలో కారకురాలవుతుంది. అలాంటి ఒకామె మనకు దొరికితే చాలు. ఆ సందడిలో సందు చూసుకుని దండిగా సొమ్ము చేసుకోవచ్చు. ఆమె డబ్బులేని సామాన్యుల్నే చంపుతుంది. మనం డబ్బున్న డిజనేరేట్స్‌ని దోచుకుంటాం. డబ్బు! డబ్బు! డబ్బంటే చేదా నీకు? చెప్పు, నీ వాటా పాతిక. సైయ్యంటే ఇప్పుడే ముహూర్తం. ఓ.కే?"

"ఓ.కే, ఓ.కే, డబుల్ ఓ.కే!" డబ్బు మాట మందలా పనిచేసింది బాలరాజ్ మీద. అంటే దాసుడైపోయాడు.

యశ్వంత్ వెంటనే తాననుకున్న ప్రకారం ఆర్గనైజ్ చేయడం ప్రారంభించాడు. నమ్మకస్థులైన మనుషుల ప్రశ్న వచ్చినప్పుడు శంభూనాథ్, జింబోలు జ్ఞాపకం వచ్చారు. వెంటనే ఔరంగాబాద్ లో కై X ణేశ్ బార్ కి ఉత్తరాలు వ్రాసి వాళ్ళని రప్పించుకున్నాడు — వస్తూ జింబో మరిద్దరు నమ్మకస్థుల్ని తెచ్చాడు—సంతోష్, సుభాష్‌లని.

బాలరాజ్ తను కొందరు ఆపరేటర్స్‌ని తెచ్చాడు, ఓ చురుకైన యువతితోసహా. ఆమె పేరు దేవయాని. ఆమె గొంతులు అనుకరించడంలో, మనుషుల్ని అనుకరించడంలో దిట్ట. ఆర్గనైజేషన్ మొత్తం రెడీ అయింది.

అప్పుడే పైన చెప్పిన రౌద్రక్రూర ప్రతీకారవాంఛితు రాలొకామెని గాలించి పట్టుకోవడంతో ప్రారంభమైంది మొత్తం ఈ స్నేక్ సొసైటీ వ్యవహారం....

యశ్వంత్ రావ్, పైపు నోట్లోంచి తీసి, "ఏం జరిగింది, శంభూ?" అనడిగాడు, వాళ్ళిద్దర్నీ చూస్తూ.

శంభూనాథ్ ధైర్యంగా పెదవి విప్పాడు. "బ్యాడ్ న్యూస్. మన కలెక్టింగ్ స్పాట్ గురించి పోలీసులకి తెలిసిపోయింది...."

"తెలిసిపోయిందా!" యశ్వంత్ దిగ్గున లేచి నిల్చున్నాడు, "ఎలా?"

శంభూనాథ్ ధైర్యం తెచ్చుకున్నాడు. కిటికీ దగ్గర బయటికి చూస్తూ నిలుచున్న ఆమె వెనుక అందచందాల్ని చూసి కళ్ళు తిప్పుకున్నాడు చటుక్కున, "ఆ ముసలాడు-విశ్వేశ్వర్రావ్ చెప్పేశాడట, బాస్! నారాయణ్ ఫోన్ చేశాడు."

యశ్వంత్ చిన్న కళ్ళు మరింత ముడుచుకున్నాయి. అతను సాలోచనగా నేలవంక చూసి ఆమెవైపు తిరిగాడు. తను కూడా తిరిగి అతన్ని చూసింది దేవయాని.

"ఓహ్, అయితే మనం స్పాట్ మార్చెయ్యాలి! దేవయానీ, నువ్వెవ్వరికి ఫోన్ చేశావో వాళ్ళకి మళ్ళీ చెప్పు—స్థలం మారుస్తున్నామని...."

"అలాగే."

"శంభూ, నువ్వు కూడా! ఏ స్పాట్ ని ఎన్నుకోవాలి,

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

ఆలోచించావా?”

“లేదు, బాస్.”

అతనుఅర చేతిలో పిడికిలితో కొడుతూ తిరగసాగాడు.

“బాంబే రూట్! కూకట్ పల్లి దాటాక ఎడమవైపు, హైవేకి లోపల ఒక కూలిపోయిన మసీదు వుంటుంది చూడండి! అదే మన స్పాట్, ఓ.కే?”

“ఓ.కే, బాస్. ఇప్పుడే వెళ్ళిచూసి ఎనౌన్స్ చేస్తాం.”

“గుడ్, ఇంకేమిటి న్యూస్?”

శంభూనాథ్ తన ప్రక్కన జింబోని చూసి, చెప్పాడు. “మనకిక ఢోకాలేదు, బాస్. పోలీసులు ఇంకా హత్యలు జరగవని నమ్ముతున్నారు. సుహాసిని నిన్నటి అనుభవంతో మళ్ళీ ప్రయత్నించదని అనుకుంటున్నారు. వాళ్ళ కట్టడినంతా రిలాక్స్ చేశారు....ఇంకే జాగ్రత్తలూ, హెచ్చరికలూ చేయలేదు....మీరిందాక వినేవుంటారు రేడియోలో.”

యశ్వంత్ తల విదిలించాడు, “లేదు, నేను వినలేదు. నా ట్రాన్సిస్టర్ పనిచేయడంలేదు, శంభూ.”

ఆ క్షణంలో తన వెన్ను జలదరించిందని తనకే తెలుసు — శంభూనాథ్ నిటారుగా అయి జింబోని చూశాడు—అతడి వెన్ను కూడా జలదరించే వుంటుంది.

“మీ రేడియో ఎలా పాడయింది, బాస్?” అడిగాడు జింబో సహజంగా.

“ఏమో తెలియదు” యశ్వంత్ ట్రాన్సిస్టర్ అందుకుని జింబోకిచ్చాడు, “దీన్ని మార్చి కొత్తది పెట్టండి.”

“అలాగే, బాస్” తీసుకున్నాడు జింబో.

అతనూ శంభూనాథ్ దొంగచాటుగా చూపులు మార్చుకున్నారు. (ఇంకా వుంది)

